# ఎన్నెమ్మ కతలు

(ఊసుపోక శీర్షికతో tethulika.wordpress.comలో ధారావాహికంగా ప్రచురించిన కతలు)

నిడదవోలు మాలతి

డిసెంబరు 2010

# విషయసూచిక


ముందు మాట యస్. నారాయణస్వామి ................ iv

స్వపరిచయం నిడదవోలు మాలతి .................... viii

1. ఇక్ష్వాకులనాటి గడియారం ........................................................................................ 1

2. మిరపకాయ బజ్జీలు ................................................................................................ 3

3. నసాంకేతికం ......................................................................................................... 5

5. వినదగు నెవ్వరు చెప్పిన......................................................................................... 12

6. ఏపేరెట్టి పిల్చినా ... ................................................................................................ 14

7. ఉగాది కోరిక ......................................................................................................... 18

8. నా దినము............................................................................................................ 20

9. దీపాలార్పు దినం.................................................................................................... 24

10. మీరూ టెల్గూలో టాకితే, మాకీ బహుత్ ఖుషీ! ........................................................... 27

11. కలగంటి, కలాగంటి ... ........................................................................................... 31

12. అప్పులూ ఆప్తులూ .. ............................................................................................ 34

13. కథా? బ్లాగా?........................................................................................................ 38

14. అయ్యో నారాతా!.................................................................................................... 41

15. అచ్చంగా నేనే అచ్చేసేసుకున్న చిన్నినా పొత్తము. ..................................................... 48

16. చతురు ముఖము!................................................................................................. 53

17 మహావీరచక్ర ........................................................................................................ 58

9. పుస్తకం కొనడఁవా? ఎక్కడా విన్లేదు, చోద్యం!............................................................. 65

20. చెత్త భ్రమణం ....................................................................................................... 68

21. చెత్త క్షోభ ............................................................................................................ 71

22. చేపాటి కర్ర .......................................................................................................... 74

23. నీకో దరమం వున్నాది............................................................................................ 77

25. కలం బలం అంటే నవ్విపోయే రోజు వచ్చెనా?............................................................ 85

26. మరో యేడూ, మళ్లీ ప్రమాణాలూ............................................................................... 91

27. తుమ్మెదా ఒకసారి ................................................................................................ 93

28. టెనిస్ చూడ్డం ఓ తమాషా ...................................................................................... 96

29. వెదురుమొక్క అదురుష్టం ........................................................................................ 99
30. గంటకూలీ అణాపరక ........................................................................................ 101
31. ఒత్తులేవీ ........................................................................................ 104
32. గల్పిక ముదిరి కథ అయిందిట! ........................................................................................ 109
33. కావలెను కథలకి తెలుగుపదాలు! ........................................................................................113
34. రామక్కా అంటే తామరాకా అనీ … ........................................................................................117
35. బొమ్మ అంటే బాపూబొమ్మ అని అర్థంట! ........................................................................................ 122
36. Parallax error ........................................................................................ 125
36. వైరాగ్యంలోంచి క్రియాశీలతలోకి ........................................................................................ 129
37. లేమంటే ప్రేమా!! ........................................................................................ 132
39. సంతకంటె సంతోసమయ్యె మాకు! ........................................................................................ 136

# ముందు మాట

యస్. నారాయణస్వామి (Michigan, USA)

తనబాల్యాన్నీ, ఆ బాల్యన్నిండా నిండి ఉన్న మనుషుల్నీ కథా వేదికనెక్కించి నామిని సుబ్రహ్మణ్యన్నాయుడు తెలుగుకథకి ఒక కొత్త రూపమిచ్చాడు 1980లలో. సినబ్బకతలు, మిట్టూరోడికతలు ... ఈ సంపుటులరాక తెలుగు కథా సాహిత్యంలో వ్యక్తిగత కథనానికి, నిజజీవిత కథనానికి తెరతీసింది. ఆ తరవాత ఖదీర్ బాబు దర్గా మిట్ట కతలనీ, సోమరాజు సుశీల ఇల్లేరమ్మ కతలనీ అదేపంథాలో ఇంకో అడుగు ముందుకేశారు. ఇంకా కొన్ని కూడ వచ్చి ఉండొచ్చు. ఈ కతలన్నిటి ప్రయోజనం చిన్నప్పటి కబుర్లు నెమరు వేసుకోవటం ఒక్కటే కాదు. ఒక్కొక్క స్థల కాల సందర్భాల్లో వెల్లివిరిసిన జీవితానికి, ఒక్కొక్క సామాజిక వర్గపు జీవితానికి, ఈ కతలు సజీవమైన డాక్యుమెంటరీలు. అటుపైన కథ చెప్పే వ్యక్తి తన బాల్యాన్ని నెమరు వేసుకుంటూ ఉత్తమ పురుషలో నేను అనుకుంటూ కథ చెప్పడమూ, అప్పుడప్పుడూ తానే ఆ బాల్యంలోకి జారిపోయి అప్పటి చైతన్యంలోంచి కథ కొనసాగించడం వల్ల ఆసక్తికరమైన సన్నివేశాలు, దృక్కోణాలు ఉత్పన్నమవుతుంటాయి.

మాలతిగారి ఎన్నెమ్మకతలు (ఇంతకీ వీటికి ఎన్నెమ్మ కతలని పేరెందుకొచ్చిందో అర్థమయిందా?) కూడా వ్యక్తిగత కథనానికి, నిజజీవిత సంఘటనలకీ పెద్ద పీట వేస్తున్నాయి. మాలతిగారు వీటికి ఊసుపోక అని ట్యాగ్ లైను పెట్టినా, వీటిలో పనికొచ్చే ఊసులు చాలా ఉన్నాయి. అక్కడక్కడా బాల్యపు స్పర్శ తగులుతుంది గానీ ఇవి బాల్యపు కథలు కావు. వీటిల్లో పాఠకుల ఉత్కంఠని రేకెత్తించే ప్లాటు, సస్పెన్సు లాంటి మసాలా దినుసులు ఎక్కువగా కనపడవు. అమెరికాలో ఉత్తరపు అంచున కెనడా సరిహద్దున ఉన్న విస్కాన్సిన్ రాష్ట్రంలో, రాష్ట్రానికి రాజధాని అయినా, ఒక గొప్ప విశ్వవిద్యాలయానికి పుట్టినిల్లయినా, విస్తీర్ణంలోనూ గుణంలోనూ మన తెనాలి వంటి ఒక చిన్న పట్టణంలో, మంచు కురుస్తున్న ఒక డిసెంబరు సాయంత్రం మనం వారింటి వాకిట నిలబడి ఉంటే, మనల్ని లోపలికి ఆహ్వానించి, లివింగ్ రూములో కూర్చో బెట్టి, ఫైర్ ప్లేసులో మంట వెలిగించి, చిక్కటి కమ్మటి వేడి వేడి కాఫీ ఇచ్చి, అంతకన్నా వెచ్చ వెచ్చటి కబుర్లు మనకి చెబుతారు రచయిత్రి. ఏదో రోజువారీ సాధారణ సంఘటనతోనో (ఉదా: కాఫీ తాగడం), ఎప్పుడైనా ఒక అసాధారణ సంఘటనతోనో (ఉదా: మంచులో నడవబోయి జారి పడి రచయిత్రి చెయ్యి విరగడం) మొదలు పెట్టి, అనేక వైయక్తిక, సాంఘిక, సాహిత్య, సాత్త్విక అంశాలని స్పృశిస్తూ నిజజీవన ప్రవంతిగా ఈ కబుర్ల కథనాలు

సాగుతుంటాయి. మధ్య మధ్య పొన్నమ్మాళ్ వంటి ప్రస్తుత జీవితంలో పాత్రలూ, సముద్రాల్లాంటి బాల్యకాలపు పాత్రలూ వచ్చి ఆప్యాయంగా పలకరిస్తుంటారు.

ఇదంతా ఒక యెత్తు, ఈ కథల్లో అంతర్లీనంగా ఉన్న సామాజిక విలువ ఇంకో యెత్తు. ఇంతకు ముందు ఉదహరించిన కథల్లాగానే ఈ ఎన్నెమ్మ కథలు కూడా ముఖ్యమైన సోషల్ డాక్యుమెంటరీలు. నేపథ్యంలో భారత జీవితానికి సంబంధించి ఒక అదృశ్యమై పోయిన మధ్యతరగతి నాగరిక జీవితపు ఛాయలు లీలగా కనిపిస్తుంటే, ప్రస్తుతంలో అమెరికాలో చాలా కాలంగా ప్రవాసం ఉన్న తొలి తరపు అనుభవాలు ప్రస్ఫుటంగా మన దృష్టిని ఆకర్షిస్తుంటాయి. దానికి తోడు ఆ కథలు చెప్పే మనిషి స్వతహాగా మాంచి సునిశితమైన పరిశీలనా దృష్టి కలిగిన రచయిత్రి కావడమూ, ఇతర భారతీయ వలసప్రజ లాగా ఏదో ఒక వృత్తి విద్యకి అంకితమైన మనిషి కాకపోవడమూ కారణంగా ఈ కథలకి ఇతరత్రా సాధ్యం కాని ఒక చురుకూ ఒక మెరుపూ సంక్రమించాయి. ఏ డాక్టరో, ఇంజనీరో, సాఫ్టువేరు నిపుణులో ఈ కథలు రాయలేరు. ఆలాగే మాలతి గారు తాను అమెరికాకి వలస వచ్చి ఉండక పోతే ఈ కథలసలు పుట్టి ఉండేవే కావు. ఆ విధంగా ఈ కథలు ప్రత్యేకమైన అనుభవ సముదాయానికి సాక్షర సాక్ష్యాలు.

ఆంధ్ర దేశాన్నించి పెద్ద సంఖ్యలో అమెరికాకి తొలి తరం వలసలు 70 లలో జరిగాయి. అప్పట్లో అమెరికను నగరాల్లో ప్రతి వీధికీ ఒక భారతీయ పచారీ కొట్టూ, ప్రతి పేటకీ ఒక భారతీయ రెస్టారెంటు ఉండేవి కావు. కందిపప్పు కావాలంటే న్యూయార్కుకి రాసి తెప్పించుకోవాల్సి వచ్చేదిట. అలా తమ వలస జీవనం మొదలు పెట్టి గత నలభయ్యేళ్ళుగా తమదైన ఒక అస్తిత్వాన్ని నిర్వచించుకున్నారు ఆ తరం వారు. వీరిలో కాస్త కలం పట్టనేర్చిన వారు తమతమ అనుభవాల్ని రికార్డు చేసే ప్రయత్నం చేశారు కూడా. దీన్నే డయాస్పోరా సాహిత్యం అన్నారు. అమెరికా వచ్చిన తెలుగువాళ్ళు రాసుకున్న డయాస్పోరా సాహిత్యంలో నిజంగా డయాస్పోరా ఏమీ లేదూ అని వేలూరి వేంకటేశ్వర్రావు గారు చాలా బాధపడిపోతుంటారు. మాలతి గారి ఎన్నెమ్మ కథలు ఆ కొరత (అనేది ఉంటే) ని తీరుస్తున్నాయని ఘంటాపథంగా చెప్పగలను. మాతృదేశంలో తాము అలవాటు పడిన జీవన విధానాన్నించి బాగా తేడాగా ఉండే పాశ్చాత్య సమాజంలో వచ్చి పడిన మనవాళ్ళకి సాధారణంగా కొన్ని వింత అనుభవాలు ఎదురవుతుంటాయి. మన పేర్లు పలకడానికి ఇక్కడి వాళ్ళ తిప్పలు, ఏ ఫాస్ట్ ఫుడ్ సెంటర్లోనో కాఫీషాపులోనో ఆర్డరివ్వడానికి మనవాళ్ళు పడే తిప్పలు, కారులో జోరుగా పోతుంటే కాపులతో తిప్పలు .. అమెరికా వచ్చిన కొత్తల్లో వీటి పాలబడని భారతీయులు ఉండరంటే అతిశయోక్తి కాదు. ఐతే, ఈ అనుభవాల్ని గురించి చిరాకుతోనో, హాస్యంగానో, రాసుకున్నంత మాత్రాన అది డయాస్పోరా సాహిత్యం ఐపోదు. ఈ వ్యక్తిగత అనుభవాల్ని శోధించి మధించి, ఆ మధనంలోంచి జీవితసత్యమనే అమృతాన్ని ఆవిష్కరించినప్పుడు అది నిజమైన డయాస్పోరా సాహిత్య మవుతుంది.

ప్రవాసులు తమని తాము అర్థం చేసుకోవడానికే కాక, ఇటువంటి సాహిత్యం, నివాసులకీ ప్రవాసులకీ మధ్య వారధిగా కూడా ఉపయోగ పడుతుంది. అటువంటి సాహిత్యానికి అగ్రగామిగా మీ ముందుకొస్తున్నాయి ఈ ఎన్నెమ్మ కథలు.

ఇదిలా ఉండగా ఈ కథల అస్తిత్వానికి ఇంకొక ఆసక్తికరమైన నేపథ్యం ఉంది. అది తెలుగు బ్లాగ్లోకం. ఈ కథల్లో తెలుగు బ్లాగుల ప్రస్తావనా, అనేక తెలుగు బ్లాగరుల పరమార్శా చాలా చోట్ల మీకు కనిపిస్తాయి. తాము ఎక్కువగా ఉపయోగించక పోయినా, సగటు తెలుగు పుస్తక పాఠకులకి కంప్యూటర్, ఇంటర్నెట్, ఈమెయిల్ .. అంటే ఏవిటో తెలిసే ఉంటుంది. యాహూ, గూగుల్ వంటి సంస్థలు వాడుక దారులకి ఉచితంగా ఈమెయిల్ సదుపాయాన్ని కల్పించాయి. అదే పద్ధతిలో వాడుకదారులు తమ ఆలోచనల్ని రాసుకుని ఇంటర్నెట్లో ప్రచురించుకునే అవకాశాన్ని ఉచితంగా అందిస్తున్నాయి కొన్ని ఇంటర్నెట్ వ్యాపార సంస్థలు. ఇలా రాసి ప్రచురించే రచనలకే బ్లాగు అని పేరు. బ్లాగులో రాయడమే బ్లాగడం. బ్లాగే మనిషి బ్లాగరి. తెలుగులో బ్లాగే బ్లాగరులందరూ చేరి తమ అనుభవాల్ని కలబోసుకునే వినూత్న ఆలోచనా ప్రపంచమే తెలుగు బ్లాగ్లోకం. ఈ బ్లాగ్లోక విశేషాలను గురించీ, అనేక బ్లాగులను గురించీ దిన పత్రికల్లోనూ, కంప్యూటర్ ఎరా వంటి సాంకేతిక విద్యా పత్రికల్లోనూ, ఎఫ్ఫెం రేడియో, స్థానిక తెలుగు టీవీ ఛానెళ్ళలోనూ కొన్ని కథనాలు వెలువడుతూ వస్తున్నాయి, కానీ తెలుగు బ్లాగుల గురించి ఎక్కువమందికి తెలీదు, తెలుగు సాహిత్యాన్నీ, ఇంటర్నెట్టునీ పట్టించుకునే వారికి కూడా.

ఎవరి బ్లాగుకి వారే అధినేత. మరి ఎటువంటి సంపాదక పర్యవేక్షణ లేకుండా రచనల్లో నాణ్యత ఎలా ఉంటుంది? నిజమే. అన్ని బ్లాగులూ ఆసక్తికరం కాకపోవచ్చు. ఆసక్తికరమైన బ్లాగుల్లోనూ ప్రతీ బ్లాగు టపా గుర్తు పెట్టుకోదగిన గొప్ప సాహిత్యం కాకపోవచ్చు. కానీ సమర్ధవంతులైన రచయితలకీ, తమ ఆలోచనల మీద ఇతరుల నియంత్రణ సహించని రచయితలకీ బ్లాగులు గొప్ప స్వేఛ్ఛాద్వారాలని తెరిచాయి. సాధారణ పత్రికా ప్రపంచంలో కనబడని, ఆమోదించబడని భావజాలాన్ని పదిమందితో పంచుకోగలిగిన స్వేఛ్ఛకు బ్లాగులు తెరతీశాయి. పత్రికలో ప్రచురించాలి అంటే అది కథా వ్యాసమో కవితో ఫీచరో ఏదో ఒకటి అయ్యుండాలి. ఇలాంటి వర్గీకరణ చట్రాల్లో స్థిమితంగా ఇమడని ఎన్నెమ్మ కథలకి తెలుగు బ్లాగ్లోకం తగిన పుట్టినిల్లయింది. ఎందుకంటే ఈ కథలు, ఇదిగో ఇలా పుస్తకంగా సంకలిస్తే తప్ప, మరో విధంగా పదిమందికీ చేరే అవకాశం లేదు. అప్పటికే కొన్నేళ్ళుగా ఆంగ్ల అనువాద కథలకి తూలిక అనే వెబ్ సైట్ నిర్వహిస్తున్న మాలతి గారు, తెలుగు బ్లాగుల గురించి తెలుసుకోగానే తాను కూడా ఒక బ్లాగుని ప్రారంభించి తన తాజా తెలుగు రచనలని తద్వారా ప్రచురించడం తెలుగు సాహిత్యానికి, ముఖ్యంగా అమెరికా తెలుగు డయాస్పోరా సాహిత్యానికి గొప్ప మేలు చేసిందని నేను నమ్ముతున్నా.

ఎన్నెమ్మ కథలకి విశాలమైన జీవితానుభవం ఆవరణ కాగా లోతైన పరిశీలన వీటికి పునాది. కథనం అంటారా, తినబోతూ రుచి ఆడగడమెందుకు గానీ, పచ్చి మిరపకాయ బజ్జీలో కొద్దిగా నిమ్మరసం పిండి తిన్నట్టుంటుందనుకోండి. అటు వ్యంగ్యపు కారం ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే, ఇటు హాస్యపు నిమ్మపులుపు ఉపశమనమిస్తుటుంది. అన్నట్టు మిరపకాయబజ్జీ కూడా ఒక కథాంశమేనండోయ్. మధ్య మధ్య ముళ్ళపూడి బ్రాండు వాడుకలూ, పిట్ట కథలూ పలకరిస్తుంటాయ్. ఋణాంకితమైన అమెరికను ఆర్థిక వ్యవస్థకి నీరాజనమిస్తూ వెంకట్రమణగారి అప్పారావుని కూడ తల్చుకున్నారు. ఇంటర్నెట్, బ్లాగులు, బ్లాగరులు తరచు కనిపిస్తారిక్కడ. "నసాంకేతికం", "సెట్టవతారం", ఇలాంటి వినూత్న పదబంధాల్తో పాటు తెలుగుతనం ఉట్టిపడే అచ్చతెలుగు జాతీయాలూ, సామెతలూ, నుడికారాలూ కోకొల్లలు ఎన్నెమ్మ కథల్లో. వీటన్నిటికీ కింద అంతర్లీనంగా మెత్తగా మంద్రంగా వినబడే తూర్పు యాస (రచనలో యాసేంటి అంటారా? చదవండి, మీకే తెలుస్తుంది.) మెత్తగా గిలిగింతలు పెడుతూంటుంది.

అదుగో మాలతిగారు తలుపు తెరిచారు. మరి లోపలకి పదండి.

# స్వపరిచయం

“వసుధైక కుటుంబం”, “విపులాచ పృథ్వీ” వంటి సూన్నృతాలకి అంతర్జాలరూపం తెలుగుబ్లాగులు. బ్లాగు అన్న పదానికి సొంతడైరీలు అన్న అర్థం ప్రాచుర్యంలో వున్నా, తెలుగుబ్లాగులోకంలో ఏసాహిత్యపత్రికకీ తీసిపోనిస్థాయిలో కథలూ, కవితలూ, వ్యాసాలూ వస్తున్నాయి. దేశ, కాలాలూ, తరాల్లో అంతరాలూ అధిగమించిన వినూత్న సృష్టి ఇది. బ్లాగురూపంలో ఈనాటి యువతీయువకులు సృష్టిస్తున్న సాహిత్యహేల ఆధునిక సాహిత్యంలో నాలుగో డైమెన్షన్.

నేను తెలుగుతూలిక పేరున నా బ్లాగు డిసెంబరు 2007, 5వ తేదీన తెరిచాను. ఆనాడు తొంభై శాతం బ్లాగరులకి నేనెవరో తెలీదు. ఈనాడు దాదాపు అంతమందికి నాపేరు సుపరిచితం. దానికి కారణం కొంతవరకూ “ఊసుపోక” శీర్షకతో నేను రాస్తున్న ఈ కతాపరంపరే.

ఇవి కథలా? వ్యాసాలా? ఏ అరుగుమీదో నలుగురు కలుకున్నవేళ ఊసుపోక చెప్పుకునే పోచికోలు కబుర్లా? అంటే ఇదమిత్థంగా చెప్పడం కష్టం. ఈ ప్రక్రియకి సాహిత్యంలో ఇంకా ఏపేరూ పెట్టినట్టు లేదు గానీ, తెలుగులో ఇలాటి రచనలకి మాత్రం చాలాకాలం క్రితమే బీజం పడింది. నారాయణస్వామి ముందుమాట చూడండి వివరాలకి.

ఇలాటి రచనల్లో వాస్తవం ఎంతుంటుందో కల్పన కూడా అంతా ఉంటుంది. అందుకే వీటిని కతలనే అనాలనుకుంటాను. పోతే వీటిలో స్పృశించే అంశాలకి పరిమితుల్లేవు. ఊహలకి కొరత లేదు. భిన్నకోణాలు దర్శించడానికి కావలిసినంత అవకాశం వుంది. అధికంగా నాలాటివారికి రెండు భిన్న సంస్కృతులలో కనిపించే జీవనసరళి ఉపయోగించుకునే సౌలభ్యం వుంది.

నాచిన్నతనంలో నేను లత “ఊహాగానం”, పురాణం సుబ్రహ్మణ్య శర్మగారి “ఇల్లాలి ముచ్చట్లు” ఎంతో ఉత్సాహంగా చదివేను. అంచేత, ఈ కతలకి అవే అనుకోవచ్చు సుమారుగా. మొదటి కత, “పాత చేతిగడియారం”గురించి రాస్తున్నప్పుడు ఇలా రాసుకుంటూ పోతానని అనుకోలేదు. రెండో కత, “నసాంకేతికం”, నా కంప్యూటరులో చిక్కులొచ్చినప్పుడు, నా సాంకేతిక అసమర్థత నన్ను ఇరుకున పెట్టి కొరుక్కు తింటుంటే, ఆ చిరాకుతో రాసింది. దానికి పాఠకులు విశేషంగా స్పందించారు. ఆ ఊపులోనే వరసగా రాసేయడం సాగించేను. ఇంకా రాస్తూనే వున్నాను.

పైన చెప్పిన ఊహాగానం, ఇల్లాలిముచ్చట్లలోలాగే, హాస్యం, వ్యంగ్యమే నాకతల్లో కూడా ప్రధానరసాలయినా, కరుణ, సానుభూతి, కదాచితుగా ఎత్తిపొడుపూ, సాహిత్యపరమైన విశ్లేషణా కూడా చోటు చేసుకున్నాయి. నాకు అట్టే అలవాటు లేని సామాజికస్పృహ కూడా రెండు కతల్లో వున్నట్టు కనిపిస్తోంది! "నీకో దరమం వున్నాది" ముంబై అశోకా హోటల్లో జరిగిన మారణహోమం గురించి. "దీపాలార్పుదినము" హైదరాబాదులో ప్రశాంతి లేవదీసిన విద్యుచ్ఛక్తి పొదుపుగురించి. వస్తువు ప్రధానంగా వ్యాసలక్షణాలతో కొన్ని కతలు మంచి చర్చలకీ, పాఠకులు నిశితమైన అభిప్రాయాలు వెలిబుచ్చడానికీ ఆలవాలమయేయి. అవి "చెత్తభ్రమణం", "చెత్త క్షోభ" "కథా, బ్లాగా?", "అయ్యో, నారాతా!", "అచ్చంగా నేనే అచ్చేసుకున్న చిన్ని నాపొత్తము", "కలంబలం అంటే నవ్విపోయేరోజు వచ్చెనా?"లాటివి.

వీటిలో రెండు కతలవిషయంలో నేపథ్యం కొంత వివరించడం అవసరమనుకుంటున్నాను. "చెత్త భ్రమణం" recycling అన్న అర్థంలో మనదేశంలోనూ అమెరికాలోనూ పారేసేవి పారేయకుండా పరులకి చేరేసే విధానం తులనాత్మకంగా ఎత్తి చూపించాను. దానికి ఒక పాఠకుడు "అమెరికా, అమెరికా అంటూ రాసింది మూర్ఖురాలు" అని తన అభిప్రాయం వెలిబుచ్చాడు వేరొక సైటులో.

ఇంచుమించు అదే సమయంలో Eemaata.com (జనవరి 2009) లో వేలూరి వెంకటేశ్వరరావుగారు నా పుస్తకం, Telugu Women Writers, 1950-1975, A unique phenomenon in the history of Telugu ficton¸ మీద సమీక్ష రాసేరు. ఆసమీక్ష మీద ఒక పాఠకుడు "2008 లో డెబ్భయ్యేదు ముందు నవలామణులు రాసిన వాటి గురించి రాసిన పుస్తకం పాచి బూరి. పర్లేదు, బానేవుంది అనడం "సరస్వతికి" అపచారం" అని వ్యాఖ్యానించేరు. అతని వ్యాఖ్య మొత్తం ఇక్కడ తిరిగి రాయలేను కానీ, అది చదివినప్పుడు నాకు అర్థమయింది ఏమిటంటే సదరు పాఠకుడికి నేను చర్చించిన విషయంలో ఆసక్తి లేదు. నాపుస్తకం చదివే వుద్దేశ్యం లేదు. అంతేకాదు. వేలూరివారి సమీక్ష సరిగ్గా చదవకుండా రాసిన వ్యాఖ్య అది. ఎవరికి గానీ ఒక విషయంమీద ఆసక్తి లేకపోతే నేను తప్పు పట్టను. నేనైనా అంతే కదా. చదవకపోవడం తప్పు కాదు గానీ, ఓ పక్కన పాసిబూరి అంటూ అవహేళన చేస్తూ, మరోపక్కన అదేమిటీ, ఇదేమిటీ అంటూ ప్రశ్నించడం తమ అవివేకాన్ని చాటుకోడమే.

పై ఇద్దరు వ్యాఖ్యాతలధోరణిలో లోపాన్ని స్పష్టం చేయడానికే "చెత్త క్షోభ" రాసేను, నా ఊసుపోక శైలిలోనే హాస్యం, ఎత్తిపొడుపూ మేళవించి.

వ్యాసంలాటి మరో కత "కలంబలం అంటే నవ్విపోయే రోజు వచ్చెనా?" అన్నది. అందులో నేను రచయితలకీ సంపాదకులకీ మధ్యగల అవినాభావసంబంధమూ, గత యాభై ఏళ్లలో వచ్చిన మార్పులూ చర్చించాను. దీనిమీద పాఠకులూ, రచయితలూ, సంపాదకులూ, ఆసాంతం చదివి, నిశితంగా ఆలోచించి విలువైన

అభిప్రాయాలు వెలిబుచ్చడం జరిగింది. అంతే కాక, ఒక సైటువారు తమ నిబంధనలను సవరించుకొనడమూ, మరొక సైటువారు తమ నిబంధనలు వివరించడమూ జరిగింది. కబుర్లు.కామ్‌వారు ఆవ్యాఖ్యతకి (మూర్ఖురాలు అన్న వ్యాఖ్యాతకి) అతని అస్తవ్యస్తపురాతలు ప్రచురించం అని తెలియజేసారు.

ఇలా క్రియారూపంలో ప్రతిస్పందన వచ్చినప్పుడు ఏరచయితకయినా ఆనందమే కదా. ఆ ఆనందంతోనే ఈకతలని పుస్తక రూపంలో మీముందు పెడుతున్నాను.

నా ఊసుపోకకతలు మొదటినుండీ ఎప్పటికప్పుడు చదువుతూ, వ్యాఖ్యానిస్తూ, నాకు ప్రోత్సాహం ఇస్తూ వచ్చిన యస్. నారాయణస్వామి (http://kottapali.blogspot.com ) అమెరికావాసి. వృత్తిరీత్యా ఇంజనీరు, తెలుగూ, ఇంగ్లీషూ సాహిత్యాలతో మంచి పరిచయం వున్నవారు. ప్రముఖ రచయితా, కవీ, నృత్యకళాకారుడూ. వారి కథలసంకలనం “రంగుటద్దాల కిటికి” ఈనాటి పాఠకులకి సుపరిచితమే. తెలుగుబ్లాగులోకంలో కొత్తపాళీగా బ్లాగ్‌గురువుగా గౌరవాదరాలు అందుకుంటున్న నారాయణస్వామి నేను అడగ్గానే ముందుమాట రాయడానికి అంగీకరించడం, పరిశీలనాత్మకంగా రాసి ఇవ్వడం నా అదృష్టం. ఆయనకి నా ధన్యవాదాలు.

ఆదినించీ ఈనాటివరకూ ఎంతో వుత్సాహంగా ఈ ఊసుపోక వ్యాసాలు చదివి, తమ అభిప్రాయాలూ, హర్షాతిరేకమూ వెలిబుచ్చుతున్న బ్లాగరులకి నా కృతజ్ఞతలు.

ఈ చిన్ని పుస్తకం తెలుగుబ్లాగరులకి అంకితం. పోతే, మా చిన్నన్నయ్య సీతారామారావు, మా అమ్మాయి సరయు నాకు సదా అండదండలు. వీరికి నేనెంతో ఋణపడి ఉన్నాను.

నిడదవోలు మాలతి

డిసెంబరు 19, 2010.

# 1. ఇక్ష్వాకులనాటి గడియారం

ఆమధ్య ఓ స్నేహితురాలు రాసింది నాకు, వాళ్లతాతగారి వాచీ రిపేరు చేయిద్దామని తీసికెళ్తే ఆకొట్టువాడు అదిరిపడ్డాడుట, "ఈ ఇక్ష్వాకులనాటి చేతిగడియారం మీకెక్కడ దొరికిందండీ" అంటూ.. నిజమే పాతకాలపు వాచీలు ఇప్పటికీ పనిచేసేవి వున్నాయి. నాదగ్గిరో వాచీ వుంది 1968లో నూటయాభై విచ్చురూపాయాలిచ్చి మనదేశంలోనే కొన్నది. అప్పటికి ఈడిజిటలులూ అవీ లేవు కదా. అనాడు పొద్దున్నేలేచి కాఫీతాగుతూ, రేడియోలో పన్యాల రంగనాథరావు వార్తలు వింటూ, వాచీకి కీ ఇచ్చుకోడం ఓఆనవాయితీ.

నేను నిజంగా పాతకాలపు మనిషిని. అమెరికా వచ్చేక పదేళ్లవరకూ మోనోరికార్డరులో సంగీతంవింటూ రికార్డు సృష్టించిన అర్భకురాలిని. అంచేత వాచీసంగతి కూడా అంతే. మీకు తెలుసో తెలీదో అమెరికాలో వందేళ్లున్న కొంపలని హిస్టారికల్ లాండ్‌మార్కులంటారు. అంటే అలా ముద్ర వేయించుకున్న ఇంటిని ఆ యింటివారు దాన్ని సొంతకొంపకంటె ఎక్కువగా పరిరక్షించుకుంటూ వుండాలన్నమాట. అది చట్టం. వారికి ఆయింటిని తమఇష్టం వచ్చినట్టు మార్చేసుకోడానికి హక్కులుండవు. దానికేం గానీ, నావాచీ మాత్రం వాచీకాలమానంలో ఆ స్థాయి చేరుకోవాలని నాఅభిలాష.

అమెరికాలో టైమెక్స్‌వారి చెక్కభజన పాటొకటి వుంది. అదేమిటంటే takes a licking and keeps on ticking అని. అంటే చావగొట్టి చెవులు మూసినా చకచక నడుకుపోతూ వుంటుందని అర్థం. నేను అమెరికాలో కొన్న - నాస్తోమతుకి తగినస్థాయిలోనే అని గమనించాలి- వాచీలేవీ ఇలా కలకాలం నిలవలేదు. అంచేత నేను ఇండియానించి తెచ్చుకున్న ఆ అణాపరక వాచీయే వాడుతూ వచ్చాను.

ఇలా వుండగా ఓరోజు, నేలమీద కుప్పలు కుప్పలుగా మంచు పేరుకున్నరోజున బయటికి వెళ్తూ నావాచీకి కీ ఇవ్వబోతూంటే అది కాస్తా చేతిలోంచి జారి కిందపడి మంచులో కూరుకుపోయింది. దానికోసం మంచు కెలుకూతూంటే దొరికినవి - మాఅమ్మాయి ఏనాడో పారేసుకున్నానని చెప్పిన క్రేయానులు, మూడు పెన్సిలు, మరెవరో పారేసుకున్న తాళాలూను. ఇలా చాలా వస్తువులు సేకరించబడ్డాయి ఆరోజు నాచేత కాని నా వాచీ మాత్రం దొరకలేదు. బహుశా నేను మంచు కెలుకుతున్నకొద్దీ ఇంకా ఇంకా లోతుకు దిగడిపోయిందేమో. వుసూరుమనుకుంటూ, కారెక్కి పనికి పోయాను.

ఆతరవాత మూడునెలలకి శిశిరం వెనకబడి, సూర్యనారాయణమూర్తి కరుణించి, ప్రభవించి మంచుని కరిగించి తనపరువు నిలబెట్టుకున్న శుభసమయంలో నావాచీ దొరికింది. ఎక్కడ అంటే అదే పడినచోటే. నేను ఆత్రంగా ఆవాచీ ఆచి పట్టుకుని అమందానందకందళితహృదయారవిందంతో కీ ఇచ్చాను. అది టిక్ టిక్ మనడం మొదలెట్టింది. ఇది కథకోసం రాసిన ముగింపు కాదండీ. నిజంగానే మూడునెలలపాటు మంచుపాతరలో నిశ్చలసమాధిలో మునివరునివలె ముడుచుకు పడుకున్న నా వాచీ ఒళ్లు విరుచుకు కళ్లు తెరుచుకు నాకు కాలమానం తెలియజేసింది.

ఏంచెప్పమంటారు? నేను క్లాసుకి వెళ్లడం ఆరున్నర నిముషాలు ఆలస్యం అయింది ఆ వాచీప్రకారమే! విద్యార్థులు మీరు "ఆలస్యంగా వస్తానని మాకు ముందే చెప్పి వుంటే బాగుండు"నంటూ సన్నగా నాకు బుద్ధి గరిపేరు.

(14 ఫిబ్రవరి 2008)

# 2. మిరపకాయ బజ్జీలు

చలి ..చలి ... మంచు ప్రళయంలా ముంచుకొచ్చి ఎముకలు కొరుక్కు తినేస్తోందీ రోజు ఇక్కడ. వీధిలోకెళ్లడం గగనమయిపోయింది. వేడివేడిగా ఖారంఖారంగా మిరపకాయ బజ్జీ కొరుకుతూ ముడుకు పడుకుని టీవీ చూసుకోవాలనిపించే శుభసమయం అన్నమాట.

నేను చిన్నప్పటినుంచీ ఇలా కారాలూ మిరియాలూ నూరుతూ పుట్టలేదు. అసలు నేను సగటుకారం కూడా తినలేనని మాఅమ్మ నాకోసం కూర వేరే తీసిపెట్టేది. అలాటిది అమెరికా వచ్చేక కారం అలవాటయింది. నేనే చేసుకున్నాను.

అలా చేసుకోడానికి ముఖ్యకారణం కాఫీదుకాణాల్లో ఎదురయే డోనట్లు. అవి చూడ్డానికి గారెల్లా కనిపించి మురిపించి నన్ను మోసం చేసేయి. మొదటిసారి తెలీక తిన్నాను. రెండోసారి ఆశ చావక తిన్నాను. ఆతరవాత మరి నాతరం కాలేదు. అచిరకాలంలోనే నాకు ఇక్కడ తిళ్లు తలుచుకుంటే మొహం మొత్తడం మొదలెట్టింది. ఏం తినబోయినా తియ్యగానో చప్పగానో వుంటాయి తప్ప మరో రుచి నాలుక్కి తగలదు. ఏటాకోవో, పీచావో అయితే తప్ప. చాలాకాలం నన్ను ఎవరేనా భోజనానికి పిలిస్తే, ఇంట్లో తినేసి వెళ్లడమో, తిరిగొచ్చాక ఖారం ఖారంగా ఆవకాయేసుకుని అన్నం తినడమో చేసేదాన్ని. ఆతరవాత చచ్చినజిహ్వాని లేపడానికి కాస్త కారం తగిలితే బాగుండుననిపించి కూరల్లో ఓ చిన్నమిరపకాయ తగిలించేను. ఆతరవాత రెండూ, రెండున్నరా, ... అలా పెంచుకుంటూ వచ్చి ఆఖరికి నసాళం అంటే వరకూ వచ్చింది.

ఆపైన రిసెర్చి మొదలెట్టాను ఏ మిరపకాయకి హీటిండెక్సు ఏ స్థాయిలో వుంటుందో. నాకు గుర్తున్నంతవరకూ మనూళ్లో మిరపకాయలు రెండే రకాలు, పచ్చిమిరపకాయలూ, సీమమిరపకాయలూను. ఇక్కడ మనుషుల్లాగే దేశదేశాల పెప్పరులు కుప్పలుతిప్పలుగా కనిపిస్తూ మనని ఉక్కిరిబిక్కిరి చేస్తాయి. ఫ్రెంచి కయన్ కాస్త మెరుగు, మనగుంటూరు మిరపకాయలసాటి అనుకోండి. సెరానో కూడా అంతే. హీటిండెక్సులో పదివేలనించి 23 వేలవరకూ వుంటుందిట స్కవిల్ కొలతల్లో. హబానో కాస్త నయం 280 వేలవరకూ వుంటుంది. గిన్నెస్ బుక్కాఫ్ రికార్డులకెక్కిన ఘనత హబానో పెపరుదేనట. మరి ఇంకో రకం షొల్తొపెన్ కూడా నోట్లో చిచ్చు పెడుతుంది.

హాట్ బనానా పెప్పరయితే అట్టే కారం వుండదనుకున్నాను కానీ ఓసారి నోరు మండిపోయింది అదే కూరలదుకాణంలో అదేతట్టలోనుంచి ఏరుకొచ్చినా. అదేంటో దానివరస నాకు అంతుబట్టలేదు. ఆనహెమ్ అసలు కారమే వుండదు పసరువాసన. పప్రికా అయితే మరీను ఆకారపుష్టి. జానెడు పొడవుంటుంది కాని ఆ

మిరపకాయ కొరికినా ఒకటే ఇంత పచ్చగడ్డి నమిలినా ఒకటే. స్కవిల్ కొలతల్లో 500 నుండీ 2500 వరకూనట దాని చురుకు.

ఇంతకీ నేను ఇంతగా పరిశోధన చెయ్యడానికి మరో కారణం వుంది. తెలుగుదేశంలో నాస్నేహితురాలితో ఏదో సందర్భంలో మిరపకాయబజ్జీలు చేసుకున్నానన్నాను ఇ-మెయిల్లో. దాంతో ఆ అమ్మాయి మిరపకాయబజ్జీలు చేసిపెడతానంటే అమెరికా వస్తానంది. సరే, చేస్తా రమ్మన్నాను కానీ ఇంతదూరం ఆవురావురామంటూ వచ్చినపిల్లకి సంతృప్తికరంగా చెయ్యలేనేమోనన్న బెంగ పట్టుకుంది. దాంతో ఏ మిరపకాయలు బజ్జీలకు తగినవో చూడడానికన్నమాట నా పరిశోధన అంతా.

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, పచారీకొట్లో లేబులులెప్పుడూ మారవు కాని ఒక్కోపూట ఒక్కో రకంగా వుంటోంది హీటిండెక్సు మాత్రం. ఇక్కడ షాపుల్లో ఒక్కోప్పుడు రుచులు చూడనిస్తారు. అంచేత కొరికి చూద్దాం అన్న దుర్బుద్ధి అయితే పుట్టింది కానీ మళ్లీ నాకే బాగోలేక చెయ్యలేదు. ప్రతిసారీ ఇంటికి తెచ్చి చూసుకుని "ఇది కాదు," "ఇది కాదు" అంటూ నేతివాదం ప్రాక్టీసు చేసాను కొన్నాళ్లు. మొత్తంమీద నాస్నేహితురాలు వచ్చినప్పుడు రెండు రకాలు హబీనో మరియూ సెరానో తెచ్చి బజ్జీలు చేసేను. హబీనో నసాళానికంటింది. ఆ అమ్మాయి వొలోమని కేకేసి, కుండెడు నీళ్లూ, గరిటెడూ పెరుగూ, పుచ్చుకుని, తరవాత నెయ్యీ అన్నం కాస్త తిని తేరుకుంది.

నేను నెమ్మదిగా "నువ్వు కారం తింటావనుకుని ఆ మిరపకాయలు తెచ్చాను. ఇదయితే అంత కారంలేదు" అంటూ నాకోసం పక్కన పెట్టుకున్న సెరానో మిరపకాయలు ఇచ్చాను. నాకు తెనాలి రామలింగడిపిల్లికథ జ్ఞాపకం వచ్చింది.

తాజాకలం - కారం పరాకాష్ట అందుకున్నరోజుల్లో మొదటిముద్ద నోట పెట్టుకున్న తరవాత జిహ్వ మాడి మసి అయి, ఆ తరవాత ఏం తింటున్నానో తెలియనిస్థితికి వచ్చేను. అందులో కూడా కొన్ని అందాలు కనిపించేయి. నాలుక ఆ హాటు, హాటు కూరలతో కాలిపోయాక తరవాత ఏం తిన్నా రుచి తెలీదు కనక రకరకాల వంటలు చెయ్యాల్సిన పనిలేదు. అంచేత మధ్యాన్నం లంచీ, రాత్రి సప్పరూ, మర్నాడు లంచీ, .. ఇలా ఒకే డిష్షు తినే గతికొచ్చాను కొన్నాళ్లు. తరవాత ఆ వరస బావులేదని, కారం తగ్గించుకుంటూ వచ్చి ప్రస్తుతం రీజనబుల్లెవలు కొచ్చేను. కనీసం అనే అనుకుంటున్నాను. ఇంతే సంగతులు.

(17 ఫిబ్రవరి 2008).

# 3. నసాంకేతికం

హెచ్చరిక - ఘనసాంకేతికనిపుణులకు ఈ అసాకేంతికాలూ, నసాంకేతికాలు నచ్చవు. ఇది కేవలం నాలాటి అసాంకేతికేయులతోనూ అంటే బొత్తిగా సాంకేతికపరిజ్ఞానంలేనివారితోనూ, నసాంకేతికేయులతోనూ అంటే తెలుసుకోవాలన్న తహతహతో నసపెట్టే మధ్యస్థ సాంకేతికేయులతోనూ కలబోసుకుంటున్న ఈతిబాధలు ఇవి అని గ్రహించగలరు …

ఈతరతమతరగతులని ఇంకొంచెం వివరంగా చెప్పాలంటే - బుద్ధిగా కాలేజీకెళ్లి చక్కగా చదువుకుని సాంకేతికనిపుణులుగా చెలగుతున్నవారు ఘనసాంకేతిక నిపుణులు. వీరు నిరంతరం ప్రోగ్రాములు రాయడమో, పాతవి తిరగరాయడమో చేస్తూ సకలజనులకు వెలుగు చూపుతారు. (అందువల్ల నాలాటివారికి కాస్త ఇబ్బందే. అది తరవాత చెప్తాను) రెండోతరగతి - కీబోర్డుమీద చెయ్యేస్తే అరిగిపోతుందో విరిగిపోతుందోనని బెదిరిపోయేవాళ్లు. వీరిని అసాంకేతికేయులు అనొచ్చు. మీరు నమ్మకపోవచ్చు కానీ ఇలాటివారు 21వ శతాబ్దంలో అమెరికాలోనే వున్నారు. ఇహ మూడో తరగతి - నసాంతికేయులు అంటే కొంచెం తెలిసీ, అట్టే తెలీకా, కీబోర్డుని గెలవలేకా వదిలిపెట్టలేకా త్రిశంకుస్వర్గంలో కొట్టుమిట్టాడేవాళ్లు. నేను ఈజాతిలోకి వస్తాను. అసాంకేతికేయులకి చాలా తెలిసినదానిలా కనిపిస్తాను, సాంకేతికేయులకి “అదేమిటీ ఇదేమిటీ” అంటూ నసపెట్టే నసాంకేతికేయురాలిగా పరిచితురాలిని. సూక్ష్మంగా ఇదీ నాఅవతారం. నేను కదాచితుగా మావూళ్లో అసాకేంతికేయులకి కంప్యూటరు ప్రాథమికపాఠాలు నేర్పుతుంటాను కూడా. ఆ కారణంగా కూడా నాకు ఇంకా ఎక్కువ తెలుసుకోవాలన్న తాపత్రయం.

అసలు మాయింట్లో అందరూ లెక్కలవాళ్లే. ఇంటరులో లెక్కలగ్రూపు తీస్కోపోతే లెక్కలోకి రామని లెక్క. మాయింట్లో. నేను మాత్రం కాదు కూడదని సాహిత్యంలోకి దిగేను. సాహిత్యం చదివి ఏంచేస్తావంటే పాఠాలు చెప్పుకుంటానన్నాను. ఇంగ్లీషులో ఓసామెతుంది. చెయ్యలేనివారు చెప్పడానికి సిద్ధమవుతారని. (those who can’t do, teach). అలాటి సదభిప్రాయంతో సాహిత్యంలో పడ్డాను. కానీ నాది ఇంజినీరింగు బుర్ర అని నాకు నేనే చాలా చిన్నతనంలోనే కనిపెట్టేసుకున్నాను.

మాయింట్లో నాఇంజినీరింగు హార్డ్‌వేరుతోనే మొదలయింది. ఇంట్లో రేడియోలూ, ట్రాన్సిస్టార్లూ వీలయినప్పుడల్లా ఓ స్క్రూడ్రైవరు పుచ్చుకుని కనిపించిన స్క్రూ నల్లా వూడతీసి మళ్లీ

సమీకరించేస్తూండేదాన్ని. అలా ఏ కీలుకా కీలు వూడదీసి కూర్చి బెట్టింతరవాత సహజంగానే పొరపాట్లొస్తాయి. సరిగ్గా పనిచెయ్యదు. అప్పుడు రేడియో అయితే ఓమొట్టికాయ వెయ్యడమో, బల్ల కుదపడమో చేస్తాను. ట్రాన్సిస్టారయితే రెండు చేతులతోనూ పుచ్చుకుని గలగల్లాడించడమో ఎగరేసి పట్టుకోడమో చేస్తాను. ఒక్కొక్కప్పుడు పని చేస్తాయి, … లేకపోతే పని చెయ్యవు.

ఆతరవాత కంప్యూటర్లకి ప్రమోటు చేసుకున్నాను నన్ను. నామొదటి కంప్యూటరు 8084 ప్రాసెసర్. అంటే కంప్యూటర్లకాలమానంలో పాతరాతియుగం అన్నమాట.

అలా నా సాఫ్టువేరుచదువు మొదలయింది. ఇది కూడా నా హార్డువేరు రీతిలోనే. ప్రతి కీ కొట్టి ఏమవుతుందో చూడ్డంతో మొదలు పెట్టేను. నాకసలు పుస్తకాలు చదివి తెలుసుకోడం అన్నది ఆదినుండీ పట్టుబడలేదు (ఇదీ అసలు కారణం నేను ఇంజినీరింగులో చేరకపోవడానికి).

దానికి యూజర్స్ మాన్యూల్లు కూడా కొంత సాయం చేసాయి. “వైరు గోడనున్న అవుట్లెట్టుకి తగిలించేవా, కంప్యూటరు స్విచ్చి ఆన్చేశావా.. అంటూ సృష్టిప్రారంభందగ్గర మొదలు పెడితాయవి. అంచేత, మామూలుగా పుస్తకం పుచ్చుకున్నా నాలుగు పేజీలు దాటేసి, చూస్తాను నాకు కావలసిన అంశం వుందేమోనని.

సాఫ్టువేరు విద్యలో నాతొలియత్నం ఈమెయిలు సెటప్ చెయ్యడం. తీరా నాక్కావలసిన విషయానికొచ్చేసరికి, “నీకు పనికొచ్చే బాడ్రేటు ఎంచుకో” అని వచ్చింది. అప్పటికింకా 3300 బాడ్‌రేటే చాలా స్పీడుకింద లెక్క అని మీలో చాలామందికి తెలీకపోవచ్చు. తెలిస్తే గుర్తుండకపోవచ్చు. ఇంతకీ నాకంప్యూటరులో ఏది పని చేస్తుందో నాకే తెలిస్తే ఈమాన్యూలు ఎందుకు చూస్తాను అనుకుని, ఆపుస్తకం పక్కన పారేసి, ఒక్కొక్క కీ కొట్టడం మొదలెట్టాను. అన్నీ పనిచేస్తున్నట్టే వున్నాయి. కాని మళ్లీ ఏదీ పనిచేసినట్టూ లేదు. మాయ! అలా దాంతో కుస్తీలు పడుతూ కొయ్యగుర్రంలా ముందుకీ వెనక్కీ వూగుతూ వున్నచోటే వుంటూ రెండుగంటలసేపు గడిపి, ఆతరవాత మొత్తం మూసేసి, వెళ్లిపోయాను.

కాని నేనలా వూరుకోలేను అట్టేసేపు. అటూ ఇటూ తిరిగొచ్చి, మళ్లీ మొదలెపెట్టాను సాఫ్టువేరు ఇన్‌స్టాలు చేయడం. ఈసారి కస్టమ్ (ఫర్ ఎడ్వాన్సుడు యూసర్స్) అన్నది ఎంచుకున్నాను, చుట్టుపక్కల ఎవరూ లేకుండా చూసి. (నువ్వు ఎడ్వాన్సుడు కాదు కదా అని ఎవరైనా రొకాయిస్తారేమోనని). ఆకస్టములో ఏదీ మార్చకుండా వున్నదున్నట్టుంచి, పద, పదమంటూ నడిపించుకు పోయాను మొదటివరస. మళ్లీ వెనక్కొచ్చీ ఒకొక సెట్టింగూ మార్చుకుంటూ పోయేను. ఇదన్నమాట నా ఎడ్యుకేషను. ఇలా చేస్తుంటే ఒక్కోసారి మనకి పనికొచ్చేది సరిగ్గా తగులుతుంది. ఒక్కొక్కప్పుడు మొత్తం సిస్టమంతా పొలోమంటూ కూలిపోతుంది పేకమేడలా. “సాహసమువలన సమకూరు పనులు ధరలోన” అని అనిపించదప్పుడు. అంటే నేను అలా చెయ్యడం మానేశానని అపార్థం చేసుకోకండి.

మొత్తంమీద ఇలా నేను సాఫ్టువేరు రహస్యాలు చాలానే గ్రహించేను. కొండొకచో నా దుష్టబుద్ధిని కంప్యూటర్లు అప్రీషియేటు చెయ్యవని గ్రహించడం కూడా ఈచదువులో భాగమే.

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, శనివారం,, సోంవారం, పోలేరమావాస్య, వైకుంఠేకాదశీ ,.. వుపోషాలుండడం తెలికేనేమో కాని కీబోర్డుమీద చెయ్యియ్యకుండా దినము గడవదు నాకు - అర్జనుడికి శ్రీకృష్ణునివలె సచివుడూ, గురువూ, దైవమూ, బంధువూ, ఇహమూ, పరమూను అన్నీ నాకు ఆ ప్లాస్టిక్ డొక్కే.

ఇంకా ఈ కీకారణ్యంలో వెలుగురేఖ - నా పూర్వజన్మ సంచితార్థం, ఈలోహ మరియు ప్లాస్టిక్ సంచయంమూలంగా నాకు ఆప్తులయిన నిజమనుషులు కూడా వున్నారు. దేశ, కాల, పరిస్థితులనీ, జాతి, కుల, మత, వయో వివక్షతలనీ అధిగమించిన కంప్యూటరుని కాదనడం ఎవరితరం, సాంకేతికంగా ఎంత నాస్తికులయితే మాత్రం?

(8 మార్చి 2008)

# 4. కాలువిరిగిన కలదు సుఖం.

కాలు కాదులెండి. యతిప్రాసలు కుదిరాయని షోకులు పోయేను☺. నిజంగా విరిగింది చెయ్యి. కుడిచేయి. తన్మూలంగా నాకు పట్టుబడ్డ కొత్త సుళువులే ఈ కత.

సర్జరీ అయి ఇంటికి వచ్చాక, ఎడంచేత్తో నేనేం చెయ్యగలనో ఏంచెయ్యలేనో అంచనా వేసుకోడం నా మొదటి వ్యాపకం అయింది.

ఓరోజంతా ఆస్పత్రినీళ్లతో ప్రాణం విసిగిన నాకు మొట్టమొదట కావల్సివచ్చింది ఒకప్పు చిక్కటి కాఫీ. గబగబ వున్న ఏకైక చేత్తోనే ఎస్ప్రెసో కాఫీమేకరు తీసి నీళ్లుపోసి, పొడి వెయ్యబోతూంటే తళుక్కున వెలిగింది బల్బు. ఎస్ప్రెసోమేకరు ఇప్పుడు వాడేనంటే, దాన్ని కడుక్కోడానికి ఆ రెండు చిప్పలూ విడదీయడం నాతరం కాదని. సరే. అది పక్కన పెట్టేసి, మన ఇండియా కాఫీఫిల్టరు తీసాను. ఎందుకేనా మంచిదని నీళ్లు పొయ్యకముందే ప్రాక్టీసు చేయబోయేను. అదీ అంతే. డిటో. సరి, ఈపూటకి కాఫీయోగం లేదు కాబోలు అని బాధ పడిపోతూంటే మా అమ్మాయి పిలిచింది ఫోనులో.

ముందురోజే ప్రసారం చేసేనులెండి మాఅమ్మాయికీ, అమ్మాయిలాటి మరోఅమ్మాయికీను. మాఅమ్మాయి హాలీవుడ్‌లో వుంది. నేనేమో విస్కాన్సిన్‌లో వున్నాను. మూడువేలమైళ్ల దూరం. ఇండియానించి చూస్తే అంతా అమెరికాయే కదా అనిపిస్తుంది కానీ నిజంగా ఇక్కడ కూడా దాదాపు ఓరోజు ప్రయాణం. సరే, మా అమ్మాయి "ఎలా జరిగింద"ని అడిగి, "నేను రానా" అని ప్రశ్నించి, డాక్టరుతో లాంగ్ డిస్టన్సులో 'మాఅమ్మని జాగ్రత్తగా చూడండ'ని గట్టిగా చెప్పి, "జాగ్రత్తగా చూడకపోతే తనకి జవాబు చెప్పుకోవలసివుంటుంద"ని మర్యాదగా చెప్పి తనకర్తవ్యం నెరవేర్చుకుని నాముచ్చట తీర్చింది. ఏ తల్లికి మాత్రం అంతకంటె ఏంకావాలి!.

ఇహ మా అమ్మాయిలాటి అమ్మాయి "చూసుకు నడవక్కర్లేదుటండీ" అంది సన్నగా.

"చూసుకునే నడిచేను" అన్నాను.

"చూసుకు నడిస్తే ఎందుకు పడతారు?" అంది మళ్లీ.

ఎందుకు, ఎలా ఎక్కడ పడాలో నేను ప్లాను వేసుకుని పడలేదనీ, "పడవేయబడ్డాన"నీ, అందులో నా సంకల్పం ఎంతమాత్రమున్నూ లేదనీ బహువిధాల చెప్పుకున్నాను.

"సరేలెండి, ఇహమీదట జాగ్రత్తగా వుండండి" అనేసి చాటు మూసేసింది నాహారికథ అంతా విని.

ఇంతలో, మాఅమ్మాయి మళ్లీ పిలిచి, మావూళ్లోనే వున్న తన స్నేహితురాలు నాకు ఏంకావాలన్నా సాయం చేస్తుందనీ, పిలవమనీ ఫోన్నెంబరిచ్చింది. ఇది నాతొలి సుఖం. ఇంతవరకూ నేను అందరినీ నాకారులో తిప్పేను కాని మరొకరికారు ఎప్పుడూ ఎక్కలేదు. సరేనని ఆ అమ్మాయిని పిలిచి ఆసాయంత్రం తనతో బజారుకెళ్లి అర్జంటుగా బ్రూ కొనుక్కున్నాను. ఆపూట నాకు బ్రూ ఎంతో బావుంటుందనిపించింది. ఎనలేని కొత్త రుచులు అనుభవంలోకొచ్చేయి.

ఆతరవాత ఆ చిట్టితల్లి తాను ఆఫీసుపనిమీద వేరే వెళ్తున్నాననీ, నాకేమైనా అవసరమయితే పదిరోజుల తరవాత పిలవమనీ చెప్పి వెళ్లిపోయింది.

ఏంచెప్పను. నాఅవసరాలు పది రోజులు ఆగలేదు. ఆపిల్ల వెళ్లిపోయిన సాయంత్రమే నాకు అవసరం వచ్చేసింది. తినడానికి ఫ్రిజిలో ఏమీ కనిపించలేదు. తప్పనిసరిగా ఎవరో ఒకర్ని పిలిచి నన్ను బజారుకి తీసుకెళ్లమని అడుక్కోవలసిన అగత్యం ఏర్పడింది. కాఫీపొడి తెచ్చుకున్నప్పుడే ఆషాపులోనే నానూ, ఛొలేలాటివి తెచ్చుకోలేకపోయారా అని విజ్ఞులకు తోచకమాలదు. ప్చ్. తెచ్చుకోలేకపోయాను. నాకప్పట్లో తోచలేదు. ఇంట్లో ఏవో వున్నాయనుకున్నాను. ఏదో చేసుకోవచ్చనుకున్నాను ... ఇంకా ఏంవనుకున్నానో చెప్పడానికి గుర్తు రావడంలేదు. ....

సరే కూచుని స్నేహితులనీ, పరిచయస్తులనీ, అయినవాళ్లనీ, కానివాళ్లనీ, కాబోయి మానేసినవాళ్లనీ .. ఒక్కొక్కరినే తలుచుకోడం మొదలెట్టాను. ఎవరిని పిలవను? ఎవరిని పిలిస్తే నాకు బాగుంటుంది? ఎవరిని పిలిస్తే వాళ్లకి బాగుండదు ... .. ఇక్కడ మరో మాట కూడా చెప్పాలి. నాకు అట్టే స్నేహబుద్ధి లేదు. నాకు కలుపుగోల్తనంపాలు తక్కువ. నేనెలా ఆలోచిస్తానంటే, కొందరు నన్నుగురించి నేను చెప్పనిచ్చగించని ప్రశ్నలు అడుగుతారు. కొందరు నేను అడిగిన ప్రశ్నలకి జవాబులు చెప్పరు. కొందరు ఒకటడిగితే మరొకటి చెప్తారు ... ఇలా ఆలోచించుకుంటూ, ఏదో ఓవంకన ప్రజలని తప్పుకు తిరుగుతాను.

అలాటి వారిలో పొన్నమ్మాళ్ ఒకరు. ఆపద్రక్షకుడికి ఫీమేల్ వెర్షను ఆవిడ. ఎవరికి ఎప్పుడు ఎక్కడ కావాలంటే అప్పుడు అక్కడ ప్రత్యక్షమయి, ఏది కావాలంటే అది సమకూర్చగల పరమయోగిని. నాప్రాణానికి మాత్రం డైట్ ప్లాన్‌లా అనిపిస్తుంది. ఆవిడని తలుచుకుంటే ఆపూట నాకు అన్నం దిగదు. దానికి వేరే వ్యక్తిగత కారణాలున్నాయి కానీ అవి ఇక్కడ చెప్పదగదు.

నేను ఇక్కడికి వచ్చినకొత్తలో షాపింగ్ మాలులో కనిపించి, తెళుంగళా అనడిగి, అక్కడిక్కడికే ప్రాణస్నేహితురాలయిపోయింది. నేను నేస్తం కట్టే శాఖలో నిష్ణాతురాలిని కాకున్నా ఆవిడచొరవ మూలంగా మాపరిచయం అంచెలంచెలుగా పెరిగిపోయింది అచిరకాలంలోనే. ప్రతిరోజూ పిలిచి ఓపావుగంట వూళ్లోవారి విశేషాలన్నీ తెలుగూ తమిళం కలగాపులగంగా మాటాడుతూ నాకు చేరేసేది. ఆవిధంగా మావూళ్లో

భారతీయులందరి సంగతులు ఎప్పటికప్పుడు తెలుస్తూండేవి నాకు. అదేమంత ఆనందదాయకం కాకపోయినా ఏదోలే ఆవిడధోరణి ఆవిడది అనుకుంటూ వచ్చేను.

ఇంతకీ మావూళ్లో నాకు తెలిసినవాళ్లందరినీ పైన చెప్పినట్టు రైటాఫ్ చేసేస్తూ, ఏంచెయ్యనా అని ఆలోచిస్తుంటే ఫోనుకాలొచ్చింది సదరు పొన్నమ్మాళ్ నుండే! చెప్పేను కదా ఆపద్రక్షకుడి లక్షణాలున్నాయని. నన్ను ఆస్పత్రిలో చూసినవాళ్లెవరో చెప్పారట. కటకటా, అనుకుంటూ రమ్మన్నాను. నాఅవుసరం కదా. వెంటనే ఆవిడ ఆఘమేఘాలమీద వేంచేసి నాకు కావలసినవీ, అక్కర్లేనివీ అన్ని పనులూ చేసిపెట్టింది. ఆవిడ శలవు పుచ్చుకు వెళ్లేవేళకి పాపం, మంచిదే, నేనే ఏదో అనుకుంటాను కానీ అని అనిపించింపించుకునే (అంటే బలవంతంగా, నాఇష్టాఇష్టాలతో ప్రమేయంలేకుండా) స్థితికి వచ్చేశాను.

ఆవిడ వాళ్లింట పనిచేసే మెయిడ్‌ని కూడా పంపించింది. ఆమెయిడొచ్చి మాయిల్లు చూసి నవ్వింది. ఎందుకంటే నాయిల్లు రెండంటే రెండే గదులు, అది అయ్యవారినట్టిల్లులా బోసిగా వుంటుంది నా వస్తుచయం చిట్టా వేస్తే అరపేజికి మించదు. అంచేత గంటలో క్లీనింగు పూర్తి చేసేసి, ఇంకేం చెయ్యను అని అడిగింది మాయలాంతరు రాక్షసుఢిలా. మళ్లీ రమ్మని చెప్పడానికి నాకే నోరు రాలేదు. అందుమూలంగా నాపనులు నేను ఎంతవరకూ చేసుకోగలనో పరీక్షించుకునే సుదినం ఆసన్నమయింది. ఫరవాలేదు. అదీ బాగానే వుంది.

వీధిలోకి వెళ్లడానికి వీల్లేదు కనక ఇంట్లోనే ఉండి చెయ్యగల పనులతో కాలక్షేపం చెయ్యడం మొదలెట్టాను. మామూలుగా టీనీళ్లు మైక్రోవేవ్‌లో కాచుకుని ఓ టీసంచీ పడేస్తే అయిపోయేది ఇప్పుడు దాదాపు అరగంట పడుతోంది. ఆపైన మళ్లీ ఆ టీకప్పు కడుక్కోడం మరో అరగంట. ఇలా చిన్న చిన్నపనులకే నాకాలం సరితోంది. ఆవిధంగా నాకు ఇంట్లోంచి కదలలేకపోవడంచేత జీవితం నరకప్రాయం అన్న బాధ లేకుండా పోయింది.

ఒక్కచేత్తో అన్నిపనులు చేసేసుకుంటుంటే, అసలు మనిషికి రెండు చేతులు ఎందుకు చెప్మా అని కూడా అనిపించకపోలేదు.

కాస్టు వున్నన్నాళ్లు తెలీలేదు కాని, అది తీసేసింతరవాత, నొప్పి తెలుస్తోంది. వేడి వేడి కాఫీ తాగుతూ, చెయ్యి కాపు పెట్టుకోడం మొదలుపెట్టాను. కాఫీకప్పు, లంచికంచం ఒకొక్కటే ఎప్పటికప్పుడు కడిగేసుకుంటుంటే కూడా సుఖంగా వుంది, దానివల్ల సుఖం - కడుక్కోవలసిన గిన్నెలు సింకులో పోగు పడి యూనియన్ వర్కరులా పోరు పెట్టవు. పైగా, కొళాయినీళ్లు కూడా వెచ్చగా చేతికి కాపడం పెట్టినట్టు సుఖంగా వుంటోంది. కాగా దానికి ప్రతిబంధకం ఏమిటంటే ఆ కాఫీలూ టీలూ ఎక్కువయి, రాత్రి నిద్ర పట్టలేదు. దాంతో బండి మళ్లించవలసిన అగత్యం ఏర్పడింది.

అమెరికాలో ఎడంచేత్తో రాసేవాళ్లు ఎక్కువ, అదేలెండి కంప్యూటరో, సెల్లో వాడనప్పుడు. తల ఓరగా ఒంచి నీళ్లకుండ ఎత్తుకున్న పల్లెపడుచుల్లా వయ్యారంగా ఎడంచెయ్యి ఒంచి పెట్టి, కలం ఘంటంలా పుచ్చుకుని వాళ్లు రాస్తుంటే నాకు చూడముచ్చటగా వుండేది. ఎడంచేత్తో రాయడమేం బ్రహ్మవిద్యా అనుకుని నేను కూడా కొన్నాళ్లు ప్రాక్టీసు చేస్తూ వుండేదాన్ని ఆరోజుల్లో. (మీరు కనిపెట్టేసినట్టున్నారు ☺). అదిప్పుడు పనికొచ్చింది.

ఇన్ని మాటలెందుకు. తప్పటడుగులతో నడక నేర్చుకున్ననాటి ముచ్చట్లు గుర్తుకొస్తున్నాయి అనుకోండి. అప్పటికంటె ఇప్పుడు కాస్త నా ఐక్యూ కూడా పెరుగుటచేత ఉత్సాహం కూడా కొంచెం పైస్థాయిలోనే వుంది.

పరిశుభ్రతగురించిన ఆలోచనలు కూడా అధికమయాయి -- దులిపిన దుమ్మే దులపడం, కడిగిన గిన్నే కడగడం … వున్నరెండు మొక్కలఆకులూ--ఒక్కొక్క ఆకూ తుడవడం ఇలా గంటలతరబడి గడిపేస్తున్నాను. చదువుదాం అని పుస్తకం తీసాను కాని మూడుపేజీలు తిప్పేసరికి చెయ్యి నొప్పి. కథమీద దృష్టి నిలవడంలేదు. బల్లమీద పుస్తకం పెట్టబోతూంటే జిలుగువస్త్రంలా పల్చగా పరుచుకున్న ధూళీ, ధూసరం …. మళ్లీ లేచి వెళ్లి, డస్టరు తెచ్చి డస్టు చేసి, డస్టరు క్లాజటులో పెట్టి వచ్చి కూర్చున్నాను. దుప్పటి కప్పుకు కూచోబోతుంటే తలవెంట్రుక కనిపించింది. ఆ వెంట్రుకని జాగ్రత్తగా తీసి లేచి వెళ్లి చెత్తబుట్టలో పడేసి వచ్చి కూచున్నాను. కార్పట్‌మీద నిన్నటి పొటెటోచిప్ తునక. అది జాగ్రత్తగా తీసి ….

ఈ లెక్కన మరి వారాంతం వేరే క్లీనింగంటూ పెట్టుకోనక్కరలేదు. ఎంతసుఖమెంత సుఖమూ …

మరో రెండు వారాలు గడిచేయి. ఓరోజు ఆదమరిచి పంచదారడబ్బా తీసాను. తీయగలిగాను. నొప్పి తెలీలేదు. ఆశ్చర్యమ్. నిన్నటివరకూ కాఫీడబ్బా మూత తియ్యలేకపోయాను. ఈరోజు సునాయాసంగా అయిపోయింది.

నిన్నటివరకూ పాలసీసా  పట్టలేకపోయాను. ఈరోజు కొండ వేలనెత్తినట్టు ఎత్తేశాను. నిన్న కుర్చీ జరపలేకపోయాను . ఈరోజు …. ఇలా నేను చేయగలిగిన పనులు రోజుకి రోజు పేట్రేగిపోతుంటే వెండికొండని అందుకున్నట్టు మురిసిపోతున్నాను,

ఎనిమిది వారాలయింది. సింకులో పొద్దుటి కాఫీకప్పూ, మధ్యాన్నం లంచికంచం అలాగే వున్నాయి. ఇప్పుడు కడగనా, ఏకంగా రాత్రి అన్నం కూడా తిన్నతరవాత ఒకేసారి కడుక్కోనా అని ఆలోచిస్తున్నా …

ఫోను రింగ్‌టోనులు పాడుతోంది. దానివేపే చూస్తూ కూచున్నాను కదలకుండా.. మెసేజిలోకి వెళ్లింది..

"హలో, మాలదీ!"  ఏమైనా కావాలా అని అడగడానికి పిలుస్తోంది పొన్నమ్మాళ్..

నేను ఫోనెత్తలేదు. ఎత్తడానికి చెయ్యి రావడంలేదు. మనసు ఇప్పుడొద్దులెద్దూ అంటూ మొరాయిస్తోంది.

(15 మార్చి 2008)

# 5. వినదగు నెవ్వరు చెప్పిన

వినదగు నెవ్వరు జెప్పిన
విని నంత వేగిరపడక వివరింపం దగు
కని కల్లనిజము దెలిసిన
మనుజుడె పో నీతిపరుండు మహిలో సుమతీ.

నేను నాచిన్నప్పుడూ, బహుశా మీరు ఈమధ్యనా, చదివిన సుమతీశతకంలోని ఈపద్యం నాకంటే మీకే ఎక్కువ గుర్తుండొచ్చు. ఎవరు చెప్పినా వినాలి. నాజీవితంలో మొదటిసగం మాఅమ్మమాట వింటూ వచ్చేను. తరువాతిసగం మాఅమ్మాయిమాట వింటున్నాను. మా అమ్మా, నాన్నగారూ, అక్కయ్యా, అన్నయ్యా, ఇరుగూ, పొరుగూ, క్లాసుమేటులూ, కూరగాయలమనిషీ .. ఎవరు చెప్పినా వింటూనే వచ్చేను. అదేం అని అడిగేదాన్ని కాను, కళ్లప్పగించి చూస్తూ వూరుకోడమే. అంటే వాళ్లు చెప్పినట్టల్లా, ఆడించినట్టల్లా ఆడేనని కాదు.

అలా వింటుంటే ఏం జ్ఞాపకం వుండిపోతాయో, ఏవి మన మనసుల్లో శాశ్వతముద్రలేస్తాయో తెలుసా? నాచిన్నతనంలో సిలోను రేడియోలో శ్రోతలు కోరినపాటలు అని రోజు సాయంత్రం ఓ గంటసేపు శ్రోతలు కోరిన పాటలే వేసేవారు. నేను ప్రతిరోజూ వినేదాన్ని ఎంతో శ్రద్ధగా. కాని ఇప్పుడు ఆ విన్నపాటలేవీ గుర్తులేవు. గుర్తున్నదల్లా "జంతువులలో అందమైనవి గుర్రాలు. బీడీలలో శ్రేష్ఠమైనవి మూడుగుర్రాలబీడీలు" అన్న ప్రకటన మాత్రమే. చూసారా, ఏది ఎంతబలంగా నాటుకుందో. .. సినిమాలో శ్రీరాముడు వేషం వేసిన ఏ యంటీయారో టీవీలో సిగరెట్టువల్ల పొందగల ఆనందం చెప్తే నిజమే కాబోలు అనిపిస్తుంది.

టీవీలో ఈమధ్య ప్రకటనలు ఎక్కువయిపోయేయి. నేను ఇక్కడికి వచ్చిన కొత్తలో 20 సెకనులుండేది ఒక్కో ప్రకటన. ఇప్పుడు 90 అయిపోయింది. ఎంత వినేదాన్ని అయితే మాత్రం ఎంతకని వినగలను? అందులోనూ మందులకంపెనీలవాళ్లవి నాకు మరీ చిరాగ్గా వుంటాయి. నేనేదో కాలక్షేపంకోసం, మనశ్శాంతికోసం టీవీ పెట్టుకుంటే, సుఖంగా వున్నప్రాణాన్ని ఈ అమ్మకాలవాళ్లు పనిగట్టుకు హింసిస్తున్నట్టనిపిస్తుంది..

ముందు నాకు ఏ లక్షణాలుంటే ఏ జబ్బు రావడానికవకాశం వుందో చెప్తాడు. తరవాత దానివల్ల రాగల ఇతరబాధలు చెప్తాడు. ఆతరవాత నా చావుకి అవకాశం ఎన్నిపాళ్లో చెప్తాడు. ఇంకా జీవితంమీద ఆశేమైనా వుంటే డాక్టరుని అడగమంటాడు. నాకు అనుమానం కలుగుతుంది. డాక్టరుదగ్గరికెళ్లి, అయ్యా ఆ మందులకంపెనీవాడు చెప్పేడు ఫలానా మందు నన్ను రక్షించగలదని, అంచేత మీరో చీటీ రాసిచ్చెయ్యండి

అనడిగితే ఇచ్చేసే డాక్టరుంటాడా? అసలు డాక్టరుదగ్గరికి వెళ్లడమంటూ జరిగితే ఈ ఒకటిన్నరనిముషం హరికథంతా వినడం ఎందుకు? ఆ డాక్టరు ఎలాగా చెప్తాడుకదా. వాళ్లకి కదా తెలియాలీ ఏ రోగాలకి ఏ మందులు వాడాలో. నేను చేప్తే వినే డాక్టరుంటాడంటారా ముజ్జెగములందు? ఈ పనసంతా ఆ డాక్టరుదగ్గరే పెట్టొచ్చు కదా.

ఈ ప్రకటనలు 20 సెకన్లు వున్నరోజుల్లో వంటగదిలోకెళ్లి ఓ గ్లాసు నీళ్లు తాగి వచ్చేదాన్ని. ఇప్పుడు కప్పు కాఫీ పెట్టుకుని, తాగేసి, కప్పు కడుక్కోడానికి కూడా సరిపోతోంది ఆ 90 సెకనులు. ఎంచేతంటే టీవీలు ఒక్క ప్రకటన వేసి వూరుకోవు కదా. మూడో, నాలుగో పెడతాయి. అంచేత పొడుగుపాటి ప్రకటనలవల్ల నాకు సుఖంగానే వుందని ఒప్పుకోవాలి.

మామూలుగా నేను వినీ, చాలాసేపో, చాలారోజులో ఆలోచించుకునీ కానీ ఏపనీ చెయ్యను. మనవాళ్లయితే పిచ్చిమాలోకం అంటారు కానీ అదే అమెరికాలో అయితే దానికో పేరెట్టేస్తారు. ఏడీడీ అనో స్లో అనో. ఇది నాకెలా తెలిసిందంటే, ఓరోజు కారు కొనడానికెళ్తే డీలరు ఓ పెద్ద పడవంత కారు చూపించి, ఆకారులో లెగ్రూమూ, హెడ్రూమూ చూడు చూడంటూ ఊదర పెట్టేశాడు. అప్పటికప్పుడు నిల్చున్నపాళాన ఆ కారు కొనేస్తే నాక్కనక మూడువందలు తగ్గించి కూడా ఇచ్చేస్తానన్నాడు రహస్యం చెప్తున్నట్టు ముందుకి వంగి.

''నాకెందుకు లెగ్రూము? నాకు గాస్‌పెడలూ, బ్రేకుపెడలూ అందితే చాలూ, ఎదురుగా రోడ్డు కనిపిస్తే చాలు, రోడ్డుమీద జనాలకి నేను కారు నడుపుతున్నానని తెలిస్తే చాలు'' అనాలి కాని అనను. కళ్లు పైకెత్తి అతని చొక్కాజేబూ, కాలరూ ఆపైన ఐఫిల్ టవరులా వున్న అతనిగడ్డంచివరా చూస్తూ, తలూపేను గంగడోలులా.

ఆ కచేరి అంతా ఆసాంతం విని, ఆ తరవాత, ఒంట్లో వున్న శక్తినంతా కూడగట్టుకుని, ''నేను అలా నిల్చున్నపాళాన నిర్ణయాలు తీసుకోలేన''న్నాను. నిజానికి ఇంగ్లీషులో ''ఐయాం స్లో'' అన్నాను. దాంతో ఆ అబ్బాయి మొహం దమ్మిడీకాసంత చేసుకుని, అత్యంత జాలిగా మొహంపెట్టి ఓ అని, ''తొందరలేదు, ఆలోచించుకో, దా, ఇక్కడ కూర్చో, కాఫీ తేనా'' అంటూ నన్ను బుజ్జగించడం మొదలెట్టాడు. నేను మరీ అంత స్లో కాదనీ, హాస్యానికన్నాననీ, షాపింగ్ ఎరౌండనీ సకలవిధాలా ప్రత్యామ్నాయ జవాబులు చెప్పుకుని అతన్ని వదిలించుకున్నాను.

ఆతరవాత ఎవరు చెప్పినా వినదగదు అని తెలిసిపోయింది. 'ఏప్రకటన చూసినా, ఏటెలిమార్కెటరుమాట విన్నా అదే మాట. ''మీమేలు కోరే, మీకు డబ్బు ఆదా చెయ్యడానికే'' అని హామీలమీద హామీలిచ్చేస్తారు. కల్లనిజము తెలుసుకోడానికంటూ వివరించుకోడానిక్కూడా అట్టే టైము లేకుండా. నిజంగా ''వినదగు నెవ్వరు చెప్పిన ... ''అన్నమాట వినరాదు.

ఇంతరాసినతరవాత నాకు మరో సందేహం వస్తోంది. వినరాదన్న నామాట మీరు వింటారా?

(30 ఏప్రిల్ 2008)

## 6. ఏపేరెట్టి పిల్చినా …

"ఏ పేరుతో పిలిచినా రోజాలు విరజిమ్మునవే పరిమళమ్ములు" అన్నాడు ఇంగ్లీషుకవి. కాని పేరులు పేరులయినప్పుడు రాగల తికమకలు ఆయన గుర్తించినట్టులేదు.

నాలుగురోజులకిందట సాటిబ్లాగరులలో ఒకరు పొరపాటున నాపేరు రవంత సవరించి, నన్ను లలితమ్మ అంటేనూ, మరొకరు అది ఎత్తి చూపితేనూ, నాకు కొన్ని పాతసంగతులూ, మరిన్ని కొత్త ఆలోచనలూ వచ్చేయి.

అందులో మొదటిది అమెరికాలో అడుగెట్టగానే తెల్లవారి నాలుకలమీద మాఅమ్మా నాన్నగారు బారసాలనాడు పెట్టినపేరు పొందగల రూపాంతరాలు - మానికా, మెలనీ, మేరీ, మలాతీ, మరాతీ, మెలథై -- ఇలా నాపేరుని నానావిధాలా క్రూరహింసలపాలు చేస్తుంటే, చూడలేక, నేను అన్నివిధాలుగానూ వారికి సరైన ఉచ్చారణ చెప్పడానికి తంటాలు పడ్డాను. "నువ్వు బోలెడు కారం తింటావు కనక నీకు నాలుక అలా తిరగగలదు" అందొకావిడ ఆఖరికి. ఇంగ్లీషులో పేర్లు చూడండి - మెలనీ, డోరతీ, మెరీనా, -- ద్విత్వాక్షరాలు లేనిపేర్లు బోలెడు వున్నాయి. ఉచ్చారణరీత్యా నాపేరుకీ వాటికీ పెద్ద తేడా కనిపించదు మరి. అయినా నాపేరేదో అవాచ్యం అన్నట్టు చూస్తారు వీళ్లు.

ఇహ పోతే. ఇతరత్రా కలిగిన అనుభవాలు. అమెరికనులకి నాపేరు చెప్పుకోడానికి అక్షరాలా టాటాలు గుణించాలి. మొదట మన తెలుగుపేర్లు వినగానే వాళ్లు అయోమయంలో పడతారు అసలు అర్థం అయిందో లేదో, చెప్పొచ్చో చెప్పకూడదో నిర్ణయించుకోలేక. ఆతరవాత స్పెల్లింగడుగుతారు.

ఆ కథావిధానం ఎట్టిదంటే మొదట మాలతి అని చెప్తాను కదా. వాళ్లు "మానికా?" అంటారు. నేను కాదంటాను. "ఎలా స్పెల్చేస్తావు" అని అడుగుతారు వాళ్లు మర్యాదాగానే.

అప్పుడు నేను గుణించాలి నాపేరు. ఎలా అంటే

m as in mother
a as in adam
l as in love
as in adam

t as in tom

h…

ఇక్కడ తంటా మొదలవుతుంది. మనం హెచ్ అంటాం, వీళ్లు ఎచ్ అంటారు. పైగా ఈగుణింతాలు నాకు అలవాటు లేకపోవడంచేత కూడా ఎచ్‌కి ఏం చెప్పాలో చప్పున తట్టదు.

నేను ఆగడం చూసి అవతలిమనిషి ఎదురుగా వుంటే, అర్థం అయిపోయిందంటారు. ఫోనులో అయితే, నేన్చప్తానంటూ మొదలెడతారు.

m as in mother

o as in opal

n as in nancy

నేను, నో, నో, నో, నో … అంటూ అడ్డుపడతాను. ఏమయి వుంటుందంటే, నేను మాలతికి గుణింతాలు చెబుతుంటే, ఆవిడకి మొదట వినిపించిన మానికాయే గుర్తుండి వుంటుంది. నామాట వినరో, వినిపించలేదో, వినిపించుకోరో …

అదే లాజిక్కుతో మాలతి అని ఎదురుగా వున్నప్పుడు గుణింతాలన్నీ అయేక, ఐ గాటిట్ అని, ఓకే మాలథై అంటారు. ఇంకా కావలిస్తే ఓకాయితమ్మీద తమ మనసులో నాటుకున్న నామవాచకానికి అనుగుణంగా malathai అని రాసుకుంటారు.

నేను యూ.యస్.కొచ్చిన కొత్తలో మాలతీరావుగా చలామణీ అయేను. (కనీసం అవడానికి ప్రయత్నించేను) కొంతకాలం. ఆరోజుల్లోనే ఓవెబ్ పత్రికకి "నేనోకథ రాసేను, వేసుకుంటారా" అని మెయిలిచ్చేను. తిరుగుటపాలో "నువ్వెప్పుడయినా కథలు రాసేవా?" అన్న ప్రశ్న వచ్చింది.

అప్పుడు నేను చాలా వినయవిధేయతలతో, "రాసి వున్నాననీ, అప్పట్లో నాపేరు నిడదవోలు మాలతి" అని చెప్పుకున్నాను.

వెంటనే, "అయ్యొయ్యో మిమ్మల్ని తెలియకపోవటమేమిటి, …" అంటూ అమితోత్సాహం చూపించారు ఆయన. అప్పుడు తెలిసింది నాపేరులోనున్న పవరు నాకు.

ఇక్కడే మరోప్రశ్నకి కూడా జవాబిచ్చేస్తాను. ప్రముఖసాహితీ వేత్త, పండితులూ, సాహిత్యచరిత్రకారులూ అయిన నిడదవోలు వెంకటరావుగారు నాకు ఏమవుతారన్నది. ఈసందర్భంలో నేను విన్న ఒక చిన్నకథ - నేను కథలు రాయడం మొదలుపెట్టిన తొలిరోజుల్లో ఆయన్ని ఎవరో అడిగారట, "ఎవరండీ ఈ మాలతి, మీ అమ్మాయా?" అని. ఆయన, "ఆఁ, మాఅమ్మాయే" అన్నారట. ఆరోజుల్లో వుండే అభిమానాలు అలాటివి. ఈవిషయం చాలాకాలంతరవాత మరెవరో చెప్పారు నాకు. నన్నెవరూ ఆ రోజుల్లో అడగలేదు కాని ఇప్పుడు

అడుగుతున్నారు. అంచేత ఇప్పుడు ఇక్కడ విశదం చేసేస్తాను. వెంకటరావుగారూ, మానాన్నగారూ అన్నదమ్ములపిల్లలు. ఆయన్ని కలుసుకునే భాగ్యం కలగలేదు నాకు.

ఇంతకీ, ఆ వెబ్‌పత్రికవారు అలా అన్నతరవాత, నేను కొంతకాలం నాతెలుగురచనలకి మాలతి నిడదవోలు అనీ, ఇంగ్లీషురచనలకి మాలతీరావు అనీ వాడుతూ వచ్చేను. అలా వుండగా, కొండొకరోజున ఒక ఇంగ్లీషుసైటులో నాకథ ఒకటి పడింది. ఆవెంటనే మరో మెయిలొచ్చింది, "ఈకథ రాసింది నేను కాదు. నాపేరు ఎవరో వాడేసుకుంటున్నారు. ఇంకమీద ఈపేరుమీద వచ్చినకథలు చదవకండి" అంటూ.

నాకు కళ్లు తిరిగేయి. ఎవరో మరో మాలతీరావుట, మద్రాసులో వుంటున్న, కాబోయే మహానటిట. నాకథ చదివి ఎవరో ఆ పిల్లకి అభినందనలు చెప్పినట్టున్నారు. దానికి జవాబు అది. మీకిప్పుడు తికమకగా వుందా? నేనూ సరిగ్గా అలాటి అయోమయంలో పడిపోయాను. తాను రాయలేదని చెప్పడం ఒకదారి. ఇంకెప్పుడు ఈపేరుమీద వచ్చినకథలు చదవకండి అంటూ హోల్ మొత్తం పేరుని వెలేయడానికి ఎన్ని గుండెలుండాలి? పైగా, ఆఊపులో తనే నిజంగా రాసినకథలు కూడా చదవకుండాపోతారన్న బుద్ధి కూడా లేకపోయిందే ఆపిల్లదానికి అని కూడా విచారించేను. ఆతరవాత ఆసైటువారిని అడిగాను అలా ప్రకటించవచ్చా అని. వారు జవాబుగా అది సమంజసం కాదని ఒప్పేసుకుని, ఆ పిల్ల సభ్యత్వం మాపు చేసేసినట్టు నాకు తెలియజేసారు.

ఎందుకొచ్చిన బాధ అని అప్పట్నుంచీ ఇంగ్లీషులో కూడా మాలతి నిడదవోలు అనే రాయడం మొదలుపెట్టేను. మాలతి అని పలకలేనివాళ్లు నిడదవోలు పలకగలరా అని అడగకండి. ఇప్పుడు నేను ఏదేనా ఫారం నింపితే, అవతలివారు ఆ కాయితం అందుకుని, తేరిపార చూస్తున్న సుందరదృశ్యం చూడాలే గానీ చెప్పనలవి గాదు.

ఇంకా చెప్పుకోవలసినవిః "నాపేరు మాలతి, నేను కథలు రాస్తాను" అనగానే, "అయ్యో మీరు తెలీకపోవడం ఏమిటి? మీప్రమదావనం కాగితాలు చింపి, పుస్తకంగా కుట్టి, అందమైన అట్టవేసి, ఎంతో పదిలంగా దాచుకున్నాను. ఇప్పటికీ చదువుకుంటుంటాను." (నేను చెప్పుకునే జవాబుః ఆమాలతిని కాదండీ, ఆవిడ మాలతీచందూర్,).

"అమెరికా మాలతి పేరుతో మీరు రాస్తున్న ఆధ్యాత్మిక వ్యాసాలు ... ప్రముఖ పత్రికలో ఎంత బావున్నాయో మాటల్లో చెప్పలేను" (మళ్లీ, నేనుః ఆమాలతిని కాదండీ.)

"మీకు కేంద్ర సాహిత్య ఎకాడమీ బహుమతి వచ్చిందని ఇప్పుడే పేపరులో చూశాను. నామనఃపూర్వక అభినందనలు అందుకోండి" (నేనుః ఆ మాలతీరావుని కానండీ).

ఇలా పేరుమూలంగా వచ్చే పాటులు చాలా వున్నాయి కనక మాలతి అనగా నేను మాత్రమే అనుకోలేను, మరియు విప్రతిపత్తి కూడా సత్యమేనని ఒప్పుకుతీరాలి. అంటే ఏపేరెట్టి పిలిచినా నేను నేనే. చివరిమాటగా, మాలతి, లలితలలో శబ్దమైత్రి వుంది కనక. కావలిస్తే ఈమెలికమాట, మాలలితమ్మ, లలితమ్మ, మాలతమ్మ.. ఒక్కగుక్కలో రెండుసార్లు చెప్పండి చూద్దాం.

(30 మార్చి 2008)

# 7. ఉగాది కోరిక

అమరావతీపట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించునాడు

ఓరుగల్లున రాజవీరలాంఛనముగా పలుశస్త్రశాలలు నిలుపునాడు

విద్యానగరరాజవీధుల కవితకు పెళ్లిపందిళ్లు కప్పించునాడు

పొట్నూరికి సమీపమున ఆంధ్రసామ్రాజ్య దిగ్జయస్తంభమెత్తించునాడు

ఆంధ్రసంతతికి ఏమహితాభిమాన దివ్యదీక్షా సుఖస్ఫూర్తి తీవరించె

ఆ మహావేశమర్థించి ఆంధ్రులారా, ఆంధ్రులారా

చల్లుడు చల్లుడాంధ్రలోకమున అక్షతలు నేడు.

నాకు తెలుగుబ్లాగులగురించి తెలిసి ఆరునెలలు అయింది. అంతకుముందు, చాలామందిలాగే నేను తెలుగుభాష, సంస్కృతి, తెలుగు ప్రతిభగురించి తెలిసినవారు ఈ తరంలో లేరనే అనుకున్నాను. చాలామందిలాగే ఈ తరం తెలుగువారికి ఏం తెలీదు అనుకునేదాన్ని. అంచేత ఆరునెలలకిందట నేను పై పద్యంగురించి రాస్తే, బహుశా ఇలా మొదలుపెట్టి వుండేదాన్ని. "చాలామందికి తెలియకపోవచ్చు కానీ టంగుటూరి సూర్యకుమారి అని తెలుగుదేశంలో చాలాగొప్ప గాయని వుండేవారు. రాయప్రోలు సుబ్బారావుగారని ఒక గొప్పకవి వుండేవారు ..." అంటూ.

ఈనాటి యువతరానికి తెలుగు రాదనీ, అంచేత తెలుగుభాష కృశించి, నశించిపోయే ప్రమాదం వుందనీ అని అనుకున్న మాట కూడా నిజమే. ఆ మధ్య ఉష్ట్రపక్షుల దేశసేవ అన్న ఒక వ్యాసం చూసేను. అందులో వున్నట్టే తెలుగుని పరిరక్షించుకుందాం అన్న తపన నాకు కూడా వుంది. ఈనాడు సరేనండీ అనడానికి బదులు ఓకేనండీ అని ఎందుకంటారో, అమ్మా నాన్నలని వదిలేసి మమ్మీ, డాడీ అనడంలో సౌలభ్యం ఏమిటో నాకూ అర్థం కాదు. కాని, ఈబ్లాగులలోనే తెలుగులో రాయడం ఎలాగో చెప్పండని తెలుగురాని తెలుగువాళ్లు అడగడం చూశాను. మేం చెప్తాం అని ముందుకొచ్చినవాళ్లను చూశాను. అంచేత, సూర్యకుమారిగారిలాగే మరోసారి అడుగుతున్నాను. ఆ మహాదివ్యదీక్షాస్ఫూర్తి మరోసారి తలుచుకుని పలుకండి తెలుగు పదాలు.

ఇంతకీ, ఇప్పుడు, అంటే ఈ బ్లాగులలోకంలో ప్రవేశించినతరవాత, పైన చెప్పినట్టు సూర్యకుమారి గొప్ప గాయని అనీ, సుబ్బారావుగారు గొప్ప రచయిత అనీ నేను చెప్పక్కర్లేదని అర్థమయింది. ఎందుకంటే ఈబ్లాగరులలో తెలుగుభాష, సాహిత్యం, సంస్కృతి, సంగీతం క్షుణ్ణంగా తెలిసినవాళ్లు చాలామందే వున్నారు. నిజానికి నావయసులో సగం లేనివాళ్లు నాకంటె ఎక్కువతెలిసినవాళ్లు - వీళ్లని చూసి నేను నేర్చుకోవలసింది ఎంతో వుందని ఇక్కడే తెలుసుకున్నాను. నేను మర్చిపోయిన పాటలు, ఆటలు, పిండివంటలు, … ఇలా ఎన్నెన్నో… తెలుగుబ్లాగులలో కనిపిస్తున్నాయి.

ఏకారణంగానైతేనేం, మననోట ఇంగ్లీషుపదాలొచ్చినంత తేలిగ్గా తెలుగుమాటలు రావడంలేదు. కనీసం రాతల్లోనైనా మరొక్క క్షణం ఆగి, ఆలోచించి, తెలుగు పదాలు వెతుక్కుని రాయమని నా కోరిక. తెలుగువాళ్లు మళ్లీ తెలుగుని ఎంతో ఆప్యాయంగా ఆదరిస్తారని నాకు నమ్మకం కలిగించిన బ్లాగరులకి నా అభినందనలు.

కొన్నిచోట్ల సందర్భానుసారం ఇంగ్లీషు మాటలే నప్పుతాయి. కాని చాలాచోట్ల మంచి తెలుగునుడికారానికి స్పందిస్తాం అనడానికి పైపద్యమే సాక్షి. నిజానికి, నామటుకు నాకు అట్టే దేశభక్తి లేదు. దేశభక్తిగీతాలమీద ప్రత్యేకాభిమానం అంటూ లేదు. అయినా పైపద్యం విన్నప్పుడు నాగుండె రవంత వేగంగా కొట్టుకుంటుంది. కారణం రాయప్రోలువారి సాహిత్యానికి సూర్యకుమారిగారు తనకంఠంలో చొప్పించిన ఆత్మాభిమానం, దేశాభిమానం అనుకుంటాను.

(1 మే 2008.)

# 8. నా దినము

రానున్న ఆదివారం అమ్మదినం. ఆ శుభసందర్భంలో నాదినం ఎలా వుంటుంది అన్న ఆలోచన వచ్చింది. ఎందుకంటే కొత్తగా పరిచయం అయినవాళ్లు నన్ను సాధారణంగా అడిగే మూడవ లేక నాలుగవ ప్రశ్న "రోజంతా మీరేం చేస్తారండీ" అని. ఎందుకంటే మొదటి రెండో లేక మూడో ప్రశ్నల్లో విశదమయే విషయాలు - నాకు ఉజ్జోగంలేదు సజ్జోగం లేదు. సాకడానికి చిన్నా పొన్నా పిల్లల్లేరు. (మా అమ్మాయి సరయుని నావంతు సాకడం అయిపోయిందిలెండి). వారితో వీరితో కబుర్లాడుకునే కలుపుగోల్తనం లేదు. మరి పొద్దెలా పోతుందనీ, ఏంచేస్తున్నానా అనీ రోజులతరబడి ఆలోచించగా తేలిన సంగతి ఇదీ.

నాదినం దానంతట అదే గడుస్తుంది. మామూలుగా నిత్యనైమిత్తికాలు రోజుకి నాలుగో అయిదో వుంటాయి. లేస్తూనే ఓ చిన్న జాబితా రాసుకుంటాను. రెండో మూడో అనుకున్నట్టు అవుతాయి. కానివి మర్నాటికి వాయిదా. అది కాక నాకు ముగ్గురు స్నేహితులున్నారు. నెలకోసారీ, మూడునెలలకోసారీ, ఆరునెలలకోసారీ పిలిచేవారు. (గమనికః వెబ్ సైటులద్వారా నీలితెరమీదకొచ్చి కబుర్లు చెప్పేవారు ఈలెక్కల్లోకి రారు)

ఇంతకీ పైన చెప్పిన మూడో కేటగిరీకి చెందినావిడ పిలిచారు పావుగుంట క్రితం. వారు దేశంలో కులపెద్దలు. అంటే కాస్త రాజసం గలవారు అంటే అపార్థం చేసుకోకండి. సాంప్రదాయకమయిన మర్యాదలూ, మన్ననలూ తెలిసినవారు అన్న అర్థంలో చెప్తున్నా. నేను సాంప్రదాయకురాలినని ఆవిడ నమ్మకం. నా నిజరూపం ఆవిడకి తెలీదని నా అభిప్రాయం. ఆవిడకీ నాకూ మాటాడుకోడానికేం వుండవు కానీ ఆ సాంప్రదాయక మర్యాదల ప్రకారం ఠంచనుగా ఆరునెలలకోమారు హలో చెప్పి హలో చెప్పడానికి పిలిచానని చెప్పుతుంటారు.

"హలో"

"హలో"

"ఏం చేస్తున్నారండి?" అన్నారావిడ.

"ఏంలేదండి. కంప్యుటరు పడుకుంది. ఏమైందా అని చూస్తున్నాను" అన్నాన్నేను.

"అంతేనండీ ఈమెషీనులూ ... ఈరోజు మా ఫాక్స్ రింగవడంలేదు. పని చేస్తోంది కాని రింగవడంలేదు."

"ఆహా, అలాగా."

ఆవిడ కొంచెం సందేహిస్తూ, "చూస్తారా?" అని అడిగేరు.

నేను, మర్యాదగానే, "వద్దులెండి. నాకంప్యూటరు అయితే ఏదో చేస్తాను కానీ …. వేరేవాళ్ల మెషీనులంటే …" అన్నాను నేను కూడా సాగదీస్తూ.

"అవునులెండి. అదే మరి … చెప్పలేం కదా."

అలా సుమారుగా అదే అర్థం వచ్చేమాటలలో మరో పదినిముషాలు హాలోలాడుకుని శలవు పుచ్చుకున్నాం ఈపూటకి.

టైము చూశాను. చూస్తుండగానే పదకొండవుతోంది. ఏదేనా తింటే బాగండు అనుకుంటుండగానే మళ్లీ ఫోను. నాఋణభారం తగ్గిస్తాం అంటూ ఓ టెలిమార్కెటరు. ఇదో బాధ. నాకు లేని ఋణాలు, అక్కరకు రాని వారంటీలూ, అవసరంలేని లాంగ్ డిస్టెంటు సర్వీసులూ  నామంచి కోరే ఇచ్చేస్తున్నాం అంటూ ఒకటే పోరు. నాకు లేనిఋణం వాళ్లెలా తగ్గించగలరో నాకు అర్థం కాదు.  మహ చిరాకేస్తుంది.

సరి. వాడిని వదిలించుకుని వంటగది ప్రవేశించేను. క్షణాలమీద అయిపోయే టిఫినులకిది సమయం కాదు. నాలుగు పచ్చి మిరపకాయలో గుప్పెడు కాకరకాయలో కసిక్ కసిక్‌మని నరికేస్తే తప్ప మనశ్శాంతి లేదు. సుతారంగా కొత్తిమీర తరగడంనుంచి ఠప్పుమని కొబ్బరికాయ కొట్టడం వరకూ ఏరోజు ఏంచేస్తానన్నది ఆనాటి చిరాకుస్థాయిని బట్టి వుంటుంది. వేరు చెప్పనేల, చిరాకు పైస్థాయిలో వున్నరోజున మాంఛి టిఫిను! అది టెలిమార్కెటర్లు చేసే సంఘసేవ అనుకుంటాను.

ఆ తరవాత  …

నా లాప్టాప్ మళ్లీ తీసి ఇందాక ఆపేసిన రిపేరు మొదలెట్టాను. అది ఒకటే నస ఓపెనవనని. ఏదో సిస్టమ్ ఫైలు డిలీట్ చేసేసేను కాబోలు నిన్న. టెక్ సపోర్టుని పిలవడమా, స్టోరుకి తీసుకెళ్లడమా అని ఆలోచించాను కొంచెంసేపు. వారంటీకి కాలదోషం పట్టింది కనక ఎలా చూసినా గుప్పెడు డాలర్లు గుప్పించక తప్పదు. చెడినకాపురం చెడనే చెడిందన్న సామెత వుంది కదా. అలా, నేను చెయ్యగలిగిందేమన్నా వుందేమో ముందు చూసి తరవాతే వాళ్లకి అప్పజెప్పేయొచ్చు అనుకుని, సిస్టమ్ రెస్టోరు చెయ్యడం మొదలెట్టాను. ఓపూటంతా కుస్తీ పడితే రెస్టోరయింది కాని ''లాగ్ ఆను'' అవనివ్వడం లేదు. ''తప్పదేమో దాన్ని పుట్టింటికి తోలీడం'' అనుకుంటూంటే ఎప్పుడో మా డిపార్ట్‌మెంటువాళ్లు ఇచ్చిన frontpage ప్రోగ్రాం గుర్తొచ్చింది. సరే పెట్టి చూద్దాం అని అది తీశాను. ఆ సిడిలో మొత్తం సిస్టమ్ అంతా వున్నట్టుంది. అప్పుడే గద్దెనెక్కిన కుర్రబాసులా కొంత బెట్టు చేసి దారిలోకి వచ్చేసింది నా కంప్యూటరు. హా. హా అనుకుని పొంగిపోయేను.

అలా దానికి ప్రాణం పోసేక, ఏ ప్రోగ్రాములున్నాయో, ఏవి మట్టి కరిచేయో చూడ్డం రెండో మెట్టు. Scrabble ఆట ఎక్కించేను. మరి ఎక్కించిన తరవాత ఆడాలి కద. లేకపోతే మావన్ (కంప్యూటరు ఈ ఆటకోసం తనకి తాను

ఇచ్చుకున్న పేరు) నొచ్చుకోవచ్చు. ఆడుతుంటే అది నన్ను మోసం చేస్తోంది అనిపించింది. ఆటలో నామాటలని అది ఛాలెంజి చేయొచ్చు కాని నేను దాన్ని ఛాలెంజి చేసే వసతి లేదు. ఆప్రోగ్రాం రాసినవారు నిఘంటువు దగ్గరపెట్టుకుసే చేసారనే అనుకుందాం. కాని కొశ్చెను చేసే వసతి నాకు వుండాలా, అఖ్కర్లేదా? మాటవరసకి, నేను jew అని పెడితే, కొట్టిపారేసింది. taj అని పెడితే ఒప్పుకుంది. రెండూ సర్వనామాలే కద. ఇది అన్యాయం, అక్రమం, ప్రజాస్వామ్యసిద్ధాంతాలకి విరుద్ధం. … ప్చ్. ప్చ్.. అని కొంచెంసేపు అరుచుకుని ఆట ఎత్తిపెట్టేశాను.

ఆతరవాత, మూవీమేకరు తీసి చూశాను. చూస్తుంటే ఆమధ్య నాకు వచ్చిన మెయిలొకటి గుర్తొచ్చింది. ఎవరో ఔత్సాహిక మూవీమేకరు, “నాకు మీకథలు చాలా ఇష్టం, ఓ ప్రేమకథ రాసివ్వండి. సినిమా తీద్దాం” అని రాశాడు. నాకు నవ్వొచ్చింది. ఆయనగారు నిజంగా నాకథలు చదివుంటే, ప్రేమకథలు అడిగేవాడా, హాహాహ్. మరి నేను సినిమా తీస్తే ఎలా వుంటుందో!

మామూలుగా నేను రోజు వాక్కెళ్తాను. ఉద్యోగాలున్నవారు ఉద్యోగాలకీ, పిల్లలు స్కూళ్లకీ, తదితరులు మాలులకీ చేరుకున్నాక, వీధులు గొడ్డుపోయి ఉంటాయి. అప్పుడు నాకు నడవడం ఇష్టం. రోజు నడిచేదారే … నాలుగేసి నెలలకోమారు చెట్లు కొత్తరంగులు పులుముకుని వింతశోభలు వెదజల్లుతూ చూపరుల నలరిస్తుంటాయి.. నిన్న వచ్చింది ఈదారేనా అనిపిస్తుంది.

అలాగే ఈనాడు కూడాను. నిన్నటివరకూ అస్థిపంజరాల్లా వున్న కొమ్మలు కొత్తచివుళ్లు తొడుక్కుని, వర్ణించనలవిగాని వర్ణాలతో కనులపండువుగా శోభాయమానంగా వున్నాయి. అలవాటుప్రకారం బయల్దేరుతూ, కెమెరా, డిజిటల్ రికార్డరూ కూడా తీసుకుని దిక్కులు చూస్తూ నడుస్తున్నాను. పక్షులు తీవ్రంగా తారస్థాయిలో చర్చించుకుంటున్నాయి.. నాకు పూర్తిగా అర్థం కాలేదు కానీ “గింజలు పిండుకు కారుల్లో పోసుకుంటున్నారు, చెట్లు కొట్టి కాయితాలూ, సంచులూ చేసుకుంటున్నారు … మనంవిప్పుడు తీసుకోవాలిసిన చర్యలేమిటీ …” అనేమో… . మన యువక కవి బ్లాగరులనందరినీ తలుచుకున్నాను. వారిలో ఒక్కరయినా ఇప్పుడు ఇక్కడుంటే ఎంత మంచికవితలు వచ్చేవో అని కొంచెసేపు బాధ పడిపోయేను. అలా అనుకుంటూ నేనో మినిటుంబావు మూవీ షూట్ చేసేను నాగాజుకన్ను సంధించి. నేను నడిచినదారి మీకు నెట్ అందుబాటులో వుంటే ఈ లింకు చూడండి. ttp://thulika.net/temp.vyahaali.wmv.

ప్రతిరోజు ఇలాగే గడుస్తుందని కాదు. రోజు ఏదో వోటి వుంటుందనే. ఇన్ని వ్యాపకాల మధ్య అంతర్జాలంలో ఈనాటి సాహిత్యావలోకనం చేస్తాను, ఇంకా మధ్యలో, చాటుల్లోనూ ఈమెయిలుల్లోనూ నాబాత్‌చీత్ సమాంతర పట్టాలమీద సాఫీగా సాగిపోయే హౌరా ఎక్స్ ప్రెస్. సమాంతరాలు ఎందుకంటే వారికీ నాకూ వయసులో అభిరుచుల్లో ఏనాటికీ కలవని రైలుపట్టాలలాటివే కనక. నాకు ఇలాటి స్నేహాలే ఎక్కువ. వీటన్నిటిమధ్యా

రాయడమో, ఏంరాయనా అని ఆలోచించుకోడమో కూడా చేస్తుంటాను. అన్నట్టు టీవీకూడా సరదాగానే వుంటుంది. హుమ్. టూమెనీ "మధ్య"లు … ఇన్ని మధ్యలమధ్య తోచదనుకునే తీరికేదీ! మరో గమనిక - మధ్య మధ్యలో డి.యన్.డి రోజులు (do nothing days) కూడా వుంటాయి.

ఇంతటితో నాదినం సమాప్తం.

శ్రీశ్రీశ్రీ మంగళం మహత్.

(6 మే 2008. ).

# 9. దీపాలార్పు దినం

హైదరాబాదులో జూన్ 15న దీపాలార్పుకోండని జనులకి జనులు తాఖీదులు ఇచ్చేసుకున్నారు. ఇది ఎవరికి వారే ఆర్పుకునేదీపం కనక తప్పులేదు సరికదా ఒప్పూ, మెప్పూను. ఎలాగంటారా, ఓపూట భోజనం మానేసినట్టే ఓగంటసేపు దేశం మొత్తం దీపాలుపవాసం వుంటే, మీకు ఆరోగ్యం, మీపిల్లలకి మంచి భవిష్యత్తు. విద్యుత్ బిల్లులో ఆదా యింటింటికి విడివిడిగా తెలీకపోవచ్చు కానీ మొత్తం లాభం చూస్తే విస్మయపోతారు మీరే.

చెప్పడం సుళువే కాని చెయ్యడంలోనే తిప్పలన్నీ అని నేనూ ఒప్పుకుంటాను. అంతెందుకూ, తిండి మానేసినరోజున చూడండీ - ఆ రోజే పొరుగింట్లో భారీఎత్తున వంటకాల మసాలా ఘుమఘుమలు మూడిళ్లవతలికి విస్తరిస్తాయి. ''ఊరికే నిన్ను చూడాలనిపించి ఒచ్చేను, నీకిష్టం కదా అని పూర్ణంబూరెలు తీసుకొచ్చాను'' అంటూ సాక్షాత్కరిస్తారు అమ్మమ్మగారు బూరెలబుట్టతో. సరిగ్గా అప్పుడే వంటావార్పుల ఛానెల్లో నోరూరించే వంటకాలు పరిచయం చేయబడతాయి. జ్యోతిగారు తమ సైటులో పుణుకులు విసురుతారు నసాళానికంటేలా.

ఆఁ అన్నట్టు విద్యుత్ వాడకంగురించి కదూ మొదలెట్టేను. మనం ఈవిద్యుచ్ఛక్తిని మంచినీళ్లలా వాడి పారేస్తున్నాం. తాగుడు తరవాత అంతటి వ్యసనం అయిపోయింది ఇదేనేమో. లేక ఇదే ఫస్టూ, తాగుడు రెండోదీనేమో కూడా. ఎలెట్రీ దీపాలు లేని వూళ్లో నేను ఒక యేడు గడిపేను నా హైస్కూలు రోజుల్లో. ఇప్పుడు ఎలెక్ట్రిక్ దీపాలు లేని పల్లె లేదేమో నాకు తెలీదు కానీ నామటుకు నాకు ఈ మాయవెలుగు అంటే ఇప్పటికీ చిరాకే. మాయింట్లో ఎనిమిదిగంటల తరవాత దీపం వుండదు, ఇంటికెవరైనా వస్తే తప్ప. కారు వీధికెక్కడం కూడా తక్కువే. వారానికోమారు బజారు, రెండో మూడో నెలలకోమారు లైబ్రరీ. అంతే. ఇదివరకు కార్లో నాలుగు టేపులు పడేసుకుని పల్లె దారులంట రెండుగంటలసేపు తిరిగేదాన్ని కాని ఇప్పుడు అలా వెళ్లడం లేదు. ఇంతకంటె నేను చెయ్యగల పొదుపు ఏంవుందీ? కానీ మీకెవరికీ జీవితం ఇంత నిస్సారం కాదు కదా. అంచేత … మీరు కూడా యథాశక్తి దీపాల వెలుగు పొదుపు  చేయడానికి యత్నించొచ్చు అంటున్నాను. ఏమంటారు?

సమస్త ప్రపంచానికీ నేను గట్టిగా చెప్పుకోవాలనుకున్నది ఒకటుంది. నాకు మహా చిరాకు కలిగించే బాధ ప్రకటనలపేరుతో వచ్చే చెత్త. ముఖ్యంగా మూడు మణుగులుండే టెలిఫోనుబుక్కులు. ఇందులో గ్లోబల్

వార్మింగేముంది అనకండి. అడవిలో చెట్లు మాగుమ్మంలో చెత్తగా అవతరించడానికి చాల ప్రాసెసింగ్ వుంది. దానికి బోలెడు విద్యుచ్ఛక్తి ఖర్చవుతుంది. ఆ కంపెనీలవారు ప్రతి వాకిటా విసిరేసే ఈ బృహద్గ్రంథాలు ఎన్ని తిన్నగా చెత్తబుట్టలోకి వెళ్లిపోతున్నాయో చూస్తే వారు సిగ్గుపడాలి. దానికి ఎంత ఎనర్జీ మరియు నేచురల్ రిసోర్సులు తగలేస్తున్నారో! పూర్వం పాతకాగితాలు పకోడీలు పొట్లాలు కట్టుకోడానికీ, పొయ్యి అంటించుకోడానికీ వాడేవాళ్లం. ఇప్పుడు అమెరికాలో రిసైకిలింగు అంటారు కానీ అది కూడా ఓ వ్యాపారమే. నిజంగా దానివల్ల ఎంత ఆదా, ఎవరికి ఆదాయం అన్న విషయంమీద చర్చలు ఇంకా జరుగుతూనే వున్నాయి.

నేనిలా అన్నానని మరోలా అనుకోకండి. ఈ యేడాదికోమారు "తత్‌దినాలు" బాగానే వున్నాయి. అయితే ఈ సింబాలిక్ దినాలతో ఆపేయక, మన రోజువారీ పనుల్లో ఏది తగ్గించుకోగలం అన్న దృష్టి అలవర్చుకుంటేనే మనం తలపెట్టిన పనికి సాఫల్యం. టీవీ, కంప్యూటరూ, బద్ధకించో మళ్లీ ఇటొస్తాను కదా అనో ఆర్పేయని గదిగదికొక దీపం ... చూడండి ఎక్కడ వృథా అవుతోందో, ఎక్కడ కాస్త కట్ చేసుకుని మొత్తం లోకానికే మేలు చెయ్యగలరో...

చుక్క చుక్క నీరు చెరువు నిండు

రెప్పపాటు తరుగు రేపటి వెలుగు.

----

(ఈ దీపాలార్పుదినం గురించి ఓ ముక్క రాయమని నారాయణస్వామి నన్ను అడిగారు. ఇది ప్రశాంతికి వచ్చిన ఆలోచన అని కూడా చెప్పారు. వారిద్దరి కృషి జయప్రదం కావాలని కాంక్షిస్తూ .. మాలతి)

(18 మే 2008.)

# 10. మీరూ టెల్గూలో టాకితే, మాకీ బహుత్ ఖుషీ!

నాస్నేహితురాలు సౌమ్య (http://vbsowmya.wordpress.com) తన బ్లాగులో "పుస్తకాలు చదవడం ఎందుకు" అని ఒక టపా రాసింది. దానిమీద కొందరు పాఠకులు మరొక ఉపప్రశ్న "ప్రత్యేకించి **తెలుగుపుస్తకాలు** చదవడం ఎందుకు?" లేవదీశారు. ఆసందర్భంలో సౌమ్య నన్ను అడిగింది, "మీరు తెలుగు పుస్తకాలు ఎందుకు చదువుతార"ని, సర్వే చేస్తున్నట్టు ☺.

"అలా అడిగితే నేను చెప్పలేను, తరవాత వివరంగా రాస్తాలే" అన్నాను. తీరా మొదలు పెట్టింతరవాత, చదవడంకంటె మాట్లాడడంగురించిన ఆలోచనలే రేగేయి నాతల్లో. అంచేత అక్కడే మొదలుపెడతాను.

ఎవరికైనా తల్లిభాష ఎలాంటిది? అంటే ఏమిటి? నాచిన్నప్పుడు ఒక కథ చదివేను. తెనాలి రామకృష్ణుడికథ అనే జ్ఞాపకం. అదేమిటంటే -

ఒకరోజు ప్రభువులు కొలువు తీరి వున్నసమయంలో ఒక పండితుడు సభకి వచ్చి తనకి అనేక భాషలలో అసమానపాండితి వుందనీ, అసలు తన మాతృభాష ఏమిటో ఎవరూ కనుక్కోలేరనీ చెబుతాడు. పండితులెవరైనా సభలో వుంటే తనని పరీక్షించి, తన తల్లిభాష ఏదో చెప్పమని సవాలు చేస్తాడు.

ఆస్థానపండితులు వివిధభాషల్లో అనేక ప్రశ్నలు వేస్తారు ఆపండితుడిని. ఆయన అన్ని భాషల్లోనూ తగు సమాధానాలు ఇస్తూ సభికులని చకితులని చేస్తాడు. ఆస్థానకవులు చిక్కులో పడతారు. మధ్యాహ్నం అయింది. రాజుగారు ఈనాటికి సభ ముగించి మరునాడు చర్చలు కొనసాగిద్దాం అంటారు.

ఆసాయంత్రం ఆ భాషాకోవిదుడు రామకృష్ణుడికి వీధిలో తారసపడతాడు. వెంటనే రామకృష్ణుడికి ఒక ఆలోచన వస్తుంది. ఆభాషాకోవిదుడిని పలకరించి ఆమాటా ఈమాటా మాటాడుతూ ఆయనకాలు తొక్కుతాడు గట్టిగా. దాంతో ఆపండితుడు "అమ్మో నొప్పి" అని అరుస్తాడు.

మర్నాడు సభలో రామకృష్ణుడు అతడిభాష తెలుగు అని చెబుతాడు. "ఎలా కనుక్కోగలిగేవు" అంటే, ముందురోజు జరిగినసంగతి చెప్పి, ఎవరైనా నొప్పి కలిగినప్పుడు తల్లినే తలుచుకుంటారు, తల్లిభాషే నోట వస్తుంది అంటాడు.

అదే ఈనాడయితే ఈకథ చెల్లదు అనుకోండి. ఇప్పుడయితే, ఆభాషాకోవిదుడు "యూ ఇడియట్" అంటాడేమో. కాని నాచిన్నప్పటిరోజులు వేరు. పైకథలో నాకు నచ్చిన అంశం - నొప్పికలిగినప్పుడు నోట తల్లిభాష వస్తుందన్నది. అలా అనుకోడంలో ఒక ఆనందం వుంది. కొంతవరకూ నిజం కూడాను.

నేను ఇంగ్లీషుపుస్తకం చదివినా, ఇంగ్లీషులో మాటాడినా అంతరాంతరాల అట్టడుగుపొరల్లో ఆవాక్యాలు తెలుగులోకి అనువదించుకోడం జరుగుతుంది నాప్రమేయం లేకుండానే. ఎవరికైనా ఏవిషయమయినా స్పష్టంగా అర్థం కావాలంటే ఈ దుబాసీబుర్ర అవసరం.

నామరో స్నేహితురాలి నాన్నగారు డాక్టరు. ఆయన ఓరోజు జ్వరంవచ్చినపిల్లని పరీక్షించి, రోజూ పాలూ రొట్టే ఇయ్యి అని ఆ పిల్లతల్లికి చెప్పారుట. దానికి ఆతల్లి "మరి గయితె మిలుకీవొద్దంతర?" అని అడిగిందిట అమాయకంగా.

అమెరికాలో ఏకూరలబజారులోనో "ఇంట్లో పాలున్నాయా, తీసుకుందామా" అన్నమాట వినిపిస్తే మరోమారు అటుతిరిగి చూస్తాన్నేను. అదే హైదరాబాదులోనో విశాఖపట్నంలోనో అయితే అది విచిత్రం కాదు. తమాషా ఏమిటంటే హైదరాబాదులోనూ, విశాఖపట్నంలోనూ కూడా పాలు అన్నమాట వినిపించడంలేదు. "ఇరవైరూపాయలివ్వండి" అన్నమాట తెలుగుదేశంలో ఎక్కడా వినబడడంలేదు. హైదరాబాదులో అయితే బీస్ రుప్యే అంటారు, విశాఖపట్నంలో ట్వంటీ రుపీసు అంటారు. అది వింటే నాకు దిగులేస్తుంది.

ఇక్కడ అమెరికాలో ఓసారి ఎవరింటికో వెళ్లినప్పుడు, మాసరయు ఏదో కావాలంటే, "అత్తని అడగు" అన్నాను. వెంటనే ఆవిడ, "ఏమన్నారూ, అత్త అనా? ఎన్నాళ్లయిందో ఆమాట విని. అలా అంటే బాగుందండీ" అంది ఆనందపడిపోతూ. ఆవిడ చేత ఆమాట అనిపించింది రక్తంలో జీర్ణించిపోయిన తెలుగునుడికారం సొగసులు. అంటే ఆవిడ చక్కని జానుతెలుగు మాట్లాడతారని కాదు. ఆవిడ మాటల్లో మూడొంతులు ఇంగ్లీషే వుంటుంది. కాని ఆక్షణంలో అలా స్పందించడమే భాషాభిమానం అంటే అని మాత్రమే చెప్తున్నాను.

మాఅమ్మాయిని నేను రెండుసార్లు దేశం తీసుకొచ్చాను. ఆరేళ్లప్పుడొకసారీ, పన్నెండేళ్లప్పుడొకసారీ. రెండుసార్లూ కూడా అక్కడున్న రెండు వారాలు తను ఒక్క ఇంగ్లీషుమాట వాడకుండా జరుపుకొచ్చింది. గుంటూరులో నాస్నేహితురాలు విజయలక్ష్మి యింటికి వెళ్లాం. అక్కడ వాళ్లాయన జార్జి మాపిల్లచేత ఇంగ్లీషు మాటాడించాలని పట్టుదలగా ఇంగ్లీషులోనే మాటాడడం సాగించేరు. మాసరయు అంతపట్టుదలతోనూ తెలుగులోనే జవాబులు చెబుతోంది. ఆఖరికి ఆయన నావేపు తిరిగి, "what is she talking. I don't understand," అన్నారు. సరయు నావేపు తిరిగి, "ఆయన ఏం అంటున్నారు. నాకు తెలీదు" అంది.

ఆస్ట్రేలియాలో వుంటున్న మరో స్నేహితురాలు తనపిల్లలకి సంగీతమూ, సంస్కృతమూ నేర్పుతున్నానంటే నాకు పరమానందమయింది. అమెరికాలో కూడా చక్కటి తెలుగు మాటాడుతున్న పిల్లలు వున్నారు. కారణాలేవైతేనేం, అందరికీ అలా జరగదు. మాఅమ్మాయికి ఇప్పటికీ తెలుగు ఇష్టమే కానీ మాటాడదు. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే ఇష్టాయిష్టాలు వేరూ, నిజంగా జీవితంలో జరిగేది వేరూ.

నేను చిన్నతనంలో తరుచూ రేడియోలో వింటుండే పాటలు, “శ్రీలు పొంగిన జీవగడ్డయి”లాటివి ఈనాటికీ నా మనసులో మెదులుతూనే వున్నాయి. ఈరోజు నా మామూలుదారిలో నడస్తుంటే గుర్తొచ్చింది ఏకారణం లేకుండానే. ఇది దేశభక్తిగీతమే కానీ నన్ను ఆకట్టుకున్నది మాత్రం అందులోని పదసౌందర్యమే.

శ్రీలు పొంగిన జీవగడ్డయి పాలువారిన భాగ్యసీమయి

వ్రాలినది యీ భరతవర్షమ్ము భక్తి పాడర తమ్ముడా!

వేదశాఖలు వెలిసెనిచ్చట, ఆదికావ్యంబమరె నిచ్చట

బాదరాయణ పరమఋషులకు పాదు సుమ్మిది తమ్ముడా!

… … (ఇక్కడ మరో పాదం వుండాలి)

పాలతీయని బాలభారతపదము పాడవె చెల్లెలా

ఇలా సదా నేను లలితగీతాలూ, పద్యాలూ గుర్తు తెచ్చుకుంటూ నాతెలుగు నిలబెట్టుకుంటున్నాను. ఎందుకు అంటే that is who I am. (ఇది కూడా ఆవరణ ప్రభావమే. తెలుగులో ఈ నుడికారం వాడం.)

నేను అమెరికాకి వచ్చినతరవాత కొంతకాలం ఇంగ్లీషు విన్నప్పుడూ చదివినప్పుడూ అప్రయత్నంగానే తెలుగులోకి తర్జుమా చేసుకోడం జరుగుతూ వచ్చింది. (నాకథ “ఉభయభాషాప్రవీణ”లో ఈబాధ కొంత వ్యక్తం చేసుకున్నాను). తరవాత్తరవాత తెలుగులోంచి ఇంగ్లీషులోకి మార్చుకుంటున్నానని తెలిసింది. అంటే అదేపనిగా తెలుగుకి కానీ, ఇంగ్లీషుకి కానీ అంకితం అయిపోయానని కాదు.

సందర్భాన్నిబట్టి, విషయాన్ని బట్టీ భాష మారుతుంది. తెలుగులో వాతావరణం ఎలావుందని అడగం. “వెదరెలా వుంద”నే అంటాం. ఇండియాలో అయితే, “ఎండలు మండిపోతున్నాయి,” “అబ్బ కుండపోతగా ఒకటే వానలూ ఒదలకుండా” (చాదస్తపు బ్రాహ్మడిలా.. ) ఇలా వర్ణనలలో వ్యక్తం చేస్తాం మన తలపులు. దీన్నే, “తెలుగు వర్ణనాత్మకభాష” అన్నారు నాయని కృష్ణకుమారిగారు. కానీ, “ఆదివారం నాలుగ్గంటలకి రానా, మీకు వీలేనా” అనడానికి బదులు “సన్డే ఫోరోక్లాక్కి మీకు కన్వీనియంటేనా” అంటే నాకు కర్ణపేయంగా వినిపించదు. ఇంకా హీనం “బాత్ టేక్ చేసారా” లాటి పదగుళికలు!

తెలుగూ, సంస్కృతమూ, ఇంగ్లీషూ, ఉర్దూ, కలిసిన సంకరభాష ఎంత ప్రాచుర్యంలోకి వచ్చిందో చూడాలంటే బ్లాగులు చాలు. (బ్లాగరులకి క్షమాపణలతో). ఇంగ్లీషులో మళ్లీ బ్రిటిష్ ఇంగ్లీషూ, అమెరికనింగ్లీషూ, ఇండియనింగ్లీషే కాక ఇప్పుడు హింగ్లీషు (హిందీ+ఇంగ్లీషు) తెంగ్లీషు (తెలుగు+ఇంగ్లీషు) - వీటిలో విలక్షణమైన నుడికారాలు. తెలుగు అభిమానులు, తెలుగులో చక్కగా మాటాడగలవారూ, అంత చక్కగానూ రాయగలవారూ, చక్కని తెలుగు చదివి ఆనందించగలవారూ ఎందుకు ఈ సంకరభాష వాడుతున్నారు అంటే తామున్న ఆవరణ ప్రభావం (అంటే సంఘంలో వస్తున్న అన్ని రకాలమార్పులూనూ) అని చెప్తారు. (ఇది నిజానికి కుంటిసాకు. ఏంచెప్పాలో తెలీనప్పుడు చెప్పే రాజకీయ చతురోక్తి అని మీరంటే ఒప్పేసుకుంటాను ☺.)

మరి తెలుగు అభిమానులు, తెలుగులో చక్కగా మాటాడగలవారూ, అంత చక్కగానూ రాయగలవారూ, చక్కని తెలుగు చదివి ఆనందించగలవారూ ఏం చెయ్యాలంటే తెలుగు పుస్తకాలు చదివితేనే ఆమాటలు మాటాడడానికీ, రాయడానికీ, మళ్లీ తెలుగులోనే ఆలోచించుకోడానికీ, తడుముకోకుండా మాటాడడానికీ సమయానికి గుర్తుకొస్తాయి. ఇవన్నీ మాట్లాడడం, రాయడం, చదవడం, తెలుగులోనే ఆలోచించుకోడం - వీటికి విడివిడిగా అస్తిత్వం లేదు. ఇవన్నీ పరపస్పరాశ్రయాలు.

నేను అమెరికాలో ఇంగ్లీషు ఇంగ్లీషులోనే అర్థం చేసుకునేస్థాయికి వచ్చేసరికి తెలుగు మర్చిపోవడం కూడా అదే స్థాయిలో అంత వేగంతోనూ జరిగిపోతోందని అర్థమయింది. తెలుగు మాటాడడానికి తడుముకోడం మొదలయింది. ఏతావాతా నాకథలే చదువుతుంటే అరే నాకు ఈమాట కూడా తెలుసన్నమాట అని విస్తుపోయే స్థితికి వచ్చేసేను. అది తెలుసుకున్నతరవాతే తెలుగు పుస్తకాలు చదవాలన్న కోరిక పుట్టింది. కొత్తగా అక్షరాలు నేర్చుకున్నట్టు పట్టి పట్టి ఒకొక మాటా చూసుకుంటూ చదవవలసివస్తోందని కూడా అప్పుడే గ్రహించేను.

అప్పుడే ఈ భాషాదాస్యంనుండీ విముక్తికోసం తూలిక మొదలు పెట్టేను (తూలిక ఆవిర్భావానికి ఇది అసలు నిజమైన కారణం. తూలిక జన్మరహస్యం). ఎందుకంటే అనువాదం చేస్తున్నప్పుడు తప్పనిసరిగా ప్రతిమాటా, ప్రతివాక్యం జాగ్రత్తగా ఒళ్లు దగ్గర పెట్టుకుని చదవాలి. ఇది నాకు నేను ఇచ్చుకున్న శిక్షణ.

ఒక్కమాటలో, నేను తెలుగుపుస్తకాలు ఎందుకు చదువుతున్నానంటే చెప్పలేను కానీ అనువాదాలు ఎందుకు చేస్తున్నానంటే తెలుగు పుస్తకాలు చదవడం కోసం, తడుముకోకుండా తెలుగులో మాటాడడంకోసం అని గట్టిగా చెప్పగలను. అందుకోసమే నా నెట్ స్నేహాలు కూడాను. నాకొచ్చిన నాలుగు తెలుగుముక్కలూ పొదివి పట్టుకుని పదిలంగా దాచుకోడానికి.

(25 మే 2008.)

## 11. కలగంటి, కలాగంటి ...

కలగంటీ కలాగంటీ ... కమలారేకులవంటి కన్నులూ గలా స్వామిని కాదులెండి.

మామూలుగా నాకు కలలు రావు. అంచేత ఈ కల ఎందుకు వచ్చిందా అని చర్చ మొదలుపెట్టుకున్నాను నాతో నేను. .. ఇంటర్నెట్ చూతాం అనుకున్నా గానీ ఈ ఇంగ్లీషువాళ్లతో చిక్కు. నదులన్నీ సాగరంలో కలిసినట్టు, ఏవస్తువూ, ఆలోచనా అయినా అటు తిప్పి, ఇటు తిప్పి ఏ ఫ్రాయిడుదరికో ఎంగిలుదరికో చేరుస్తారు. అణగారిపోయిన కోరికలే కలలై కనిపిస్తాయని ఈ విజ్ఞులసుభాషితం. అంతకుమించి ఇంకేమైనా ఆలోచనలకి తావుందా అంటే నాకు నేనే ఆలోచించుకోవాలి.

నా కలలో రాజీవ్ గాంధీవో, రావణుడో రాలేదు. రాజీవుడెందుకంటే అదే హైదరాబాదు ఎయిర్పోర్టుకి ఆ పేరు పెడతారని విన్నాను. రావణుడెందుకంటే, నా తొమ్మిదోక్లాసు స్నేహితురాలు తాను రామాయణం, భాగవతం అవీ చదువుతానని చెప్పింది. అంచేత అంటున్నాను. వాళ్లిద్దరూ నా కలలోకి వచ్చే అవకాశాలున్నాయని. ఏమైనా సదరు ఘనాపాఠీల దర్శనాలు కాలేదు. చివరాఖరికి లింకనునైనా కలగన్నాను గాను. ముప్పైమంది ఉత్తరాలు గుప్పించేస్తారని ఆశ పడ్డానికి. (వివరణః నాస్నేహితురాలు సౌమ్య తాను లింకనుని కల గన్నట్టు కథ రాస్తే కుప్పలు తిప్పలుగా వ్యాఖ్యలు వచ్చేయి). ప్చ్.

అసలు ఏంజరిగిందంటే, నిన్న వైదేహి హడావుడిగా వెళ్లి వంద మొక్కలు కొనుక్కొచ్చేశానని చెప్పింది. "వందమొక్కలే!" అన్నాను బెదిరిపోతూ. నాబెదురుకి కారణం తరవాత చెప్తాను. అంతకుముందే మాఅమ్మాయితో కొంచెంసేపు మాటాడేను. ఆరెండూ అయేక మామూలుగానే పడుకున్నాను. ఆపకుండా రాత్రంతా కలలే.

ఇంతకీ కల ఏమిటంటే, మాఇంటినిండా మొక్కలు. మాఅమ్మాయీ వైదేహీ ఆమొక్కలన్నీ మాఇంటినిండా అమర్చేస్తున్నారు బహుసుందరంగా. (అవునూ, నేను వైదేహిని చూడలేదు కదా, ఆవిడే అని ఎలా తెలిసింది చెప్మా). వాళ్ల హడావుడి చూస్తుంటే, నాకేమో అదే స్థాయిలో దిగులు పొగిలిపోతోంది.

ఇంతకుముందు నాకు ఎంతో ప్రేమగా మొక్కలిచ్చిన మిత్రబృందం అంతా స్లైడుషోలో కనిపించేస్తున్నారు వరసగా. మామూలుగా అమెరికాలో మొక్కలని చక్కగా పెంచుకోగలవారికి green thumb వుంటుంది

అంటారు. నాకది లేదు. మాయింట్లో ఎండ బాగా వస్తుంది. సకలప్రజలూ ఆమోదించే రూలులప్రకారం మొక్కలు బాగా నవనవలాడుతూ పెరుగుతూ నేత్రోత్సవం చెయ్యాలి మా నట్టింట. ఆయువున్నంత కాలం చేస్తాయి కూడాను.

కానీ ఎంతోకాలం అలా జరగదు. నిదానంగా, చాపకింద నీరులా కనిపించకుండానే నీరుగారిపోతాయి. ఆకుల నిగ్గు తరుగుతుంది. కొమ్మలు తలలు వాల్చేస్తాయి. నీళ్లు చాల్లేదేమో అనుకుని నీళ్లు కుమ్మరించేస్తాను. కాస్త ఉషారుంటే బజారుకెళ్లి ఏ మిరకిల్ గ్రోలాటి మొక్కలమందో కొనుక్కొచ్చేసి, ఎంతో ప్రేమగా  వాటికి మేపేస్తాను. అప్పుడు ఎవరేనా చెప్తారు, లేదా నాకే తెలుస్తుంది నీళ్లూ, తిండీ ఎక్కువయితే మొక్కలికి ఆరోగ్యం కాదని. అధికస్య అధికమ్ బలమ్ అన్నది ఇక్కడ వర్తించదుట. హుమ్.

అలా చాలా మొక్కలని ఖననం చేసేయాల్సొచ్చింది అయిష్టంగానే.

నాలుగేళ్లకిందట మాకాండో ఎసోసియేషను ప్రెసిడెంటు నన్ను పిలిచి, ‘‘నాతో బజారుకి రా. నీకు ఇష్టమైన మొక్కలు ఎంచుకో. మీబిల్డింగుముందు వేసుకో’’ అంది. నేను మురిసిపోతూ ఆవిడతో వెళ్లి నాకు నచ్చిన చిన్నపువ్వులమొక్కలు రెండు ఎంచుకున్నాను. ఇద్దరం మాసింహద్వారానికి రెండువైపులా నాటేం ముచ్చట పడిపోతూ.

ఆతరవాత మాకు ప్రొఫెషనల్ మేనేజరు వచ్చేడు. ప్రొఫెషనల్ కదా. అతని డ్యూటీ ప్రకారం నెలరోజులకిందట ప్రూనింగంటూ నారెండు మొక్కలకీ తిరుక్షవరం చేసేశాడు. నిన్న మా ఎక్స్-ప్రెసిడెంటు కనిపించి, ‘‘అయ్యో, ఈమొక్కలు ఇప్పుడు ప్రూను చెయ్యకూడదు. వసంతకాలం చివర్లో చెయ్యాలి. ఇప్పుడు చేస్తే చివుళ్లన్నీ సీదాగా తుడిచిపెట్టుకుపోతాయి. ఇహ ఈయేడు నీకు పువ్వులు రావు’’ అంది.

అంటే మొక్కలగురించిన మెళుకువలు చాలా వున్నాయి. అవి మనకి తెలియాలి. నాకు తెలీవు.

మొక్కలకి చాలా సేవలు చెయ్యాలి. నేను చెయ్యను.

ఒకొక ఆకునీ తీరిగ్గా ఓ రుమాలు తీసుకుని తుడిచేవాళ్లనీ, లానులో చతికిలబడి ఒకొక గరికపోచనీ చిన్న కత్తెరతో కత్తిరించేవాళ్లనీ కూడా చూశాను నేను. నాకు అంత ఓపిక లేదు.

అందుకన్నమాట నాకల చూసి నేను ఝుడుసుకున్నది.  మామూలుగా నాకు సంబంధించినంతవరూ మొక్కలకీ పిల్లలకీ నాకు తెలిసిన రూలు ఒకటే. Let them grow. వాటిమానాన వాటిని పెరగనివ్వాలనీ వాళ్లు-మరియు-అవి ఎదుగుతుంటే చూసి ఆనందించాలనీ నా అభిమతం.

మాఅమ్మాయివిషయంలో నారూలు చక్కగా పని చేసింది కానీ మొక్కలవిషయంలో అలా కాలేదు.

# 12. అప్పులూ ఆప్తులూ ..

"హలో అంటే ఐదూ","హలో కులాసా అంటే పదీ", .. "అఋణ", "కఋణ" .. లాటి వాక్య మరియు పదవిన్నాణంతో ముళ్లపూడి వెంకటరమణగారు ఋణాలనందలహరి అనబడే ఋణవేదం రాసి తెలుగుపాఠకలోకాన్ని శాశ్వతంగా తమకి ఋణగ్రస్తుల్ని చేసేసుకున్నారు. మరింక ఆ అప్పులగురించి మనం రాయలేం. "ఆఋ" యోజనాల దూరంనుండి కూడా ఆయనవేపు కన్నెత్తి చూడలేం.

డబ్బుమాట వచ్చింది కనక చెప్తున్నా. సుమతీశతకం రాసినాయన "అప్పిచ్చువాడు, వైద్యుడు ఎప్పుడు నెడతెగక పారు యేరును చొప్పడిన వూరు"లోనే వుండమన్నాడు. కానీ అమెరికాలో అలా మనం అప్పిచ్చేవాళ్లని వెతుక్కుంటూ వెళ్లక్కర్లేదు.

అమెరికాలో కూడా వెంకటరమణగారు చెప్పినట్టే "హలో కులాసేయేనా" (How're you today?) అనే మొదలు పెడతారు. కానీ ఆ తరవాత మాత్రం పద్ధతిలో తేడా వుంది. ఋణదాతలు వాళ్లకి వాళ్లే మనని వెతుక్కుంటూ వచ్చి, "ఉచ్చుకోండి, ఉచ్చుకోండం"టూ "అమ్మా, బాబూ" అంటూ బతిమాలి, అవసరమయితే కాళ్లో గడ్డమో పట్టుకుని, మరీ అప్పులిచ్చేసి కానలేని ఉచ్చులు తగిలించేస్తారు. మనం ముచ్చటపడి పుచ్చేసుకుంటాం.

ప్రారంభదశలో రెండువేలు లిమిటు పెడతారు. మనం ఆతీరం చేరకముందే, "అయ్యో మొహమాట పడకండి, మీ అప్పు పరిమితి ఐదువేలకి పెంచేస్తాం" అంటారు ఎంతో పెద్దమనసుతో - వెనకటిరోజుల్లో చూడండి భోజనాలదగ్గర "ఒక్కటేస్తాను బాబూ", "మరో రెండెయ్యనా అమ్మా" అంటూ వడ్డించేసేవారు - అలాగన్నమాట. అలా ఇచ్చేవాళ్లు అమితోత్సాహంతో ఇచ్చేస్తుంటే మనం "అబ్బ మనస్థాయి ఎంత వేగంగా పెరిగిపోతోందో" అనుకుంటూ ఉప్పొంగిపోతాం.

ఆతరవాత దాతలు వడ్డీలకి వడ్డీలు కడతారు. అట్టి శుభసమయంలో మనకి ఏఋణగుణధ్వనులూ వినిపించవు. ... ఇంకా కొంతకాలం అయేక, కొంపలు ములిగేసమయం ఆసన్నమయేక చెప్తారు చల్లగా "మీకొంప ముంచేస్తున్నామోచ్" అని. సూక్ష్మంగా ఇదీ అమెరికాలో అతిగోప్యమయిన ఆర్థికసూత్రం.

ఇంతకీ నేను ఇక్కడ చెప్పబోయేది డబ్బప్పు కాదు. ఐడియాలఅప్పు మాత్రమే. కిట్టనివాళ్లు గ్రంథచౌర్యం అంటారనుకోండి. ఆళ్లకేం తెలుసు మన కల్చరు.. నిన్ననే విన్నాను ఏదో నాకథ ఒకటి ఏదో సంకలనంలో

వచ్చిందని. అంటే ఆ సంకలనకర్త ఉచితంగా నాపేరు "ప్రమోషను" చేస్తున్నట్టే కద. అంచేత వారికి నేనెంతో ఋణపడి వున్నాను అన్నమాటే కద. (అసందర్భంగానే అయినా చెప్పుతున్నా, బ్లాగురులు 'ఋ' కి బదులు 'రు' వాడుతున్నారు. వారు తమ కీబోర్డులలో 'ఋ' ఎక్కడుందో వెతుక్కుని వాడడం మొదలుపెడితే బాగుంటుంది. అదీ మన తెలుగుదనం నిలబెట్టుకోడం అంటే.)

ఇంతకీ నేను చెప్పబోయేది (హమ్మయ్య ఇప్పటికొచ్చింది అసలిసయానికి అనకండి మరి.) నా ఐడియాదాతలకి నేను అప్పు చెల్లు పెట్టుకోడంగురించే ఈకథంతా. "మీగూట్లో మీరు ముడుచుక్కూచుంటే మరి కథలెక్కడినించి వస్తాయి" అన్నప్రశ్నకి కూడా ఇదే జవాబు.

నేను కుప్పలు తిప్పలుగా రాయడంలేదు, బరువైన, హృదయవిదారకమైన, మహోదగ్రభీకరమైన సాంఘికప్రయోజనం గల, ప్రజలని పట్టి వూపేసే కథలు అసలే రావు నాకు. పోతే నేను రాయగలిగినన్ని కతలు రాయడానికి నాకు వున్న సాఢేతీన్ సెట్‌చెలులు సరిపోతారు. .. పోతున్నారు.

మాటవరసకి చూడండి, వైదేహి సూచించకపోతే "కథలఅత్తయ్యగారు" కనిపించేవారు కాదు. సౌమ్య అడక్కపోతే "టెగ్లూ టాకు" మాటేలేదు. నారాయణస్వామి కోరకపోతే "దీపాలార్పుదినము" రూపు దిద్దుకొనకపోను. ఇందులో ప్రశాంతిచెయ్యి కూడా వుందని తెలిసి మరింత హుషారొచ్చింది. ఇవి విరివిగా హిట్లందుకున్న సుబ్లాగులు. అంచేత వీరికి నేను అప్పున్నాను. ప్రస్తుతం నా దృష్టి అంతా యీ అప్పు ఎలా తీర్చుకోవడం అన్నదానిమీదే.

నిజానికి నా జీవనవేదాంతంలో ముఖ్యభాగం - అప్పు తీసుకోరాదు. అప్పెట్టుకోడం అంటే కొంపకి నిప్పెట్టుకోడమే.

అంచేత తీవ్రంగా ఆలోచించేను ఈఅప్పులు తీర్చేసుకునే మార్గాలు. కొన్ని ఐడియాలొచ్చాయి. ఆ వెంటనే నాలో ఋణ, గుణ (-, +) ధ్వనులు చెలరేగేయి. ఇదుగో మీముందు పెట్టేస్తున్నాను.

1. ఐడియాప్రదాతని సహరచయితని చెయ్యడం సంగీతకచేరిల్లో వంతపాటగాళ్లలాగా. ఇందులో -

- గుణధ్వని (లాభం). చిన్నవాళ్లు, వర్ధమాన రచయితలు, వారిని ప్రోత్సహించి నాఔదార్యం లేక హృదయవైశాల్యం (అట్టే లేదులెండి) ప్రకటించుకున్నట్టుంటుంది.

- ఋణధ్వని (నష్టం). వారికే ఎక్కువ నష్టం. ఎందుకంటే. నాహ్యూమరు సకల సజ్జన, సెట్‌జన మనోభిరామం కాదు. అయినా సాధారణంగా నాజోలికెవరూ రారు, కారణాలు అనేకం - underlying ప్రేమచేత, జాలిచేత, సౌజన్యముచేత, సాదరముగా, భయభక్తులతో, వినయమువలన, చిరాకు పడి, ఇంకా పరాకువల్ల , …. (నిజం చెప్పొద్దూ, మన సంస్కృతిలో ఇది నాకు చాలా నచ్చిన విషయం).

మరి నేను ఈ వర్ధమానరచయితని (వీరిలో కొందరు లబ్ధప్రతిష్ఠులు వున్నారు. వారు మన్నించాలి) నా సహరచయితగా చేస్తే, వారు పాఠకుల నిరసనలకి ఈజీ టార్గెటు అయిపోయే ప్రమాదం వుంది. నాకు పడాల్సిన అక్షింతలు వాళ్లకి పడతాయి. (పైకి రావలసినవాళ్లని, వస్తున్నవాళ్లని కిందకి దిగలాగడం పంచమహాపాతకాల్లో ఒకటిట.)

2. మనఇళ్లలో "చచ్చి నీకడుపున పుడతాం" అనడం మామూలు.. ప్చ్. ఇందులో

- గుణధ్వని - నాకేం తోచడంలేదు.

- ఋణధ్వని - ఇది దీర్ఘకాల ప్రాజెక్టు. కాలదోషం పట్టిపోయే ప్రమాదం వుంది. పైగా దీన్ని అమలులో పెట్టడం కూడా కష్టమే. ఇంతమందికి అప్పులున్నాను కదా, ఏయింట ముందు పుట్టడం? ఎంతకాలం ఆయింట తిష్ఠ వెయ్యడం? అసలు ఇది అప్పు తీర్చుకోడం ఎలా అవుతుంది? మనకి (నేనుగా పుట్టిన పిల్లకి) ఆతల్లి చేయ్యాల్సిన సేవలు తల్చుకుంటే అలా పుట్టడం నేరం అనిపించదా? ఏవ్యాసానికి ఎన్నిరోజుల్లో ఎలా లెక్క కట్టడం?

పైగా పైలోకంలో అకౌంటింగు ఎలా వుందో. అక్కడ ఖాతాలు సరిగ్గా జమ కాకపోతే (మన యాంత్రికలెక్కలు ఎవరెరుగరు కనక) నేను అనవసరంగా ఏ అప్పూ లేనివారి కడుపున పుట్టేనంటే మళ్లీ అంతకంత ఆలస్యం! అంతే కాదు. అసలు ఇప్పుడు నేను ఎవరికి అప్పు తీరుస్తున్నానో నాకు తెలీడం లేదు. పైజన్మలో పాతప్పులు తీరుస్తున్నానో కొత్తవి కూర్చుకుంటున్నానో ఎలా తెలుస్తుంది? ఇవన్నీ అసలు సదరు దాతలకి గుర్తుంటాయన్న హామీ ఏదీ? టూమెనీ క్రొశ్నలు.

3. మడతపేచీ. తరుచూ వూసులాడుకుంటున్నప్పుడు వారికి ఏవో ఐడియాలు ఇచ్చేను.

-- గుణధ్వని - నేను ఐడియాలు ఇచ్చేను. పనికొచ్చేవే ఇచ్చేను. నువ్వు వాడుకోపోతే నాతప్పేం లేదు. ఐడియాకి ఐడియా చెల్లు. (ఇవ్వలేదా? ఇచ్చేననుకున్నానే, ఇచ్చేవుంటాను, సరే, ఆదివారం సాయంత్రం ఆరుగంటలకి కనిపించు. ఓగుప్పెడు గుమ్మరించేస్తాను. .... )

-- ఋణధ్వని - ఇచ్చిన ఐడియాలు చెత్తగా వున్నాయి. పనికి రాలేదు. అవి వాడుకోడం నన్ను పుట్టించిన బ్రహ్మతరం కూడా కాదు. (ఈవిధంగా స్నేహాలకి ఎసరు కాగల ప్రమాదం వుంది.)

4. ఏంతెలీనట్టు నటించడం

-- గుణధ్వని - “నాఅంత మంచిది మరి లేదు భువిలో” అనిపించుకోడానికి గొప్ప సదవకాశం. ఎవరైనా పని గట్టుకుని, తవ్వి తీసి, ఇది ఫలానావారి ఐడియా అని చెప్పేవరకూ జరుపుకుపోడానికి అత్యుత్తమ సాధనం. తరవాత, అయ్యో అలాగా, నేను చూణ్ణేలేదు స్మీ ... అంటూ దబాయించడానికి వీలు.

-- ఋణధ్వని - ఇది హీనం, హీనాతిహీనం, ఇంకా చెప్పాలంటే చెప్పలేనంత హీనం.

5. నారచన అంకితమిచ్చి దాతని కృతిభర్తని చెయ్యడం.

-- గుణధ్వని - ఐడియారూపంలో కన్యాశుల్కం పుచ్చుకోడం జరిగిపోయింది కనక వేరే లావాదేవీలు లేవు. చెల్లు పెట్టేసినట్టే.

-- ఋణధ్వని - ఏమీలేవు.

ఉపసంహారం. నేను మొదటిసారి ఊసుపోక రాసినప్పుడు ఊసు “పోకే” మొదలుపెట్టేను, రెండో మూడో రాసేక, పాఠకులు చాలా వుత్సాహంగా చదువుతున్నారని తెలిసేక, కాస్త బెదురులాటిది కలిగింది దీన్ని పొడిగించడం ఎలాగా అని.

దరిమిలా అర్థమయిపోయింది నా నెచ్చెలుల ఐడియాలు నేను వాడేసుకుంటున్నానని.

అంచేత పైన చెప్పిన పంచరూళ్ల ప్రణాళికలో అత్యుత్తమంగానూ, ఆచరణీయంగానూ కనిపించిన ఐదో సూత్రమే ఎంచుకుని ఈ ప్రణాళికకి అంకురార్పణ చేస్తున్నాను.

నాకు ఒకటి కంటే ఎక్కువ ఐడియాలిచ్చిన ఆప్తురాలు వి. బి. సౌమ్యకి ఊసుపోక నెంబరు 12 అంకితం చేస్తున్నాను.

అప్పులుండరాదు అన్నరూలు ప్రకారం, పైన చెప్పిన, మిగిలిన ఐడియాదాతలకి కూడా సమయానుకూలంగా ఈ ఊసుపోకలు అంకితం చేస్తాను.

ఫలశృతిః  ఇంకా ఎవరైనా కూడా కన్యాశుల్కంగా ఐడియాలిచ్చి కృతిభర్తలు కావచ్చును. మీ ఐడియా తీసుకుని నేను రాసింతరవాత మాత్రం పిల్లికళ్లూ, పొట్టిజడా అంటూ వంకలు పెట్టడానికి వీల్లేదు. అలా వంకలు పెట్టమని హామీ జతపరచవలెను.

(9 జూన్ 2008.)

# 13. కథా? బ్లాగా?

సీరియస్‌గానే అడుగుతున్నాను.

ఈమధ్య కొన్ని బ్లాగులు చూసింతరవాత నాకు కొన్ని అనుమానాలొచ్చేయి. బ్లాగుకీ కథకీ తేడా ఏమిటి? ఎవరు కథలు రాస్తున్నారు? ఎవరు కతలు (సొల్లుకబుర్లు) చెప్తున్నారు? ఎవరు బ్లాగులు రాస్తున్నారు? అని.

బహుశా తేడా విషయంలోనేమో అనిపిస్తోంది. ఎలా రాస్తున్నారని కాక ఏం రాస్తున్నారన్నదానికే పెద్దపీట అనుకుంటాను. కథలో పేర్లు మార్చి, రూపురేఖలు మార్చి, స్థలాలూ కాలాలూ మార్చి, వున్నవి దాచి, లేనివి కల్పించి చెప్తాం. నేను "కాఫీ రంగూ రుచీ" టపా రాసినప్పుడు అలవాటుగా కల్పించి కాఫీ మానేసేనని చెప్పి, ఒక వ్యాఖ్య చూసి దిద్దుకున్నాను. వూరికే "కథ రక్తి కట్టడానికి" అలా రాసేను కానీ రక్తి కట్టలే. అబద్ధాలాడి పట్టుబడిపోయాను. ఇది ప్రమాదాలు తెచ్చే అబద్ధం కాదు కనక సరిపోయింది.

నేను కథలు రాస్తున్న కొత్తల్లో, 1952-53 ప్రాంతాల్లో ఓచిన్న కథలాటిది, "రాద్ధాంతం" అని రాసేను. తెలుగు స్వతంత్ర వారు దానికి గల్పిక అనో స్కెచ్ అనో పేరు పెట్టేరు కథ అనడానికి తగినంత సరుకు లేదని. మాపక్కింటావిడ పేరు చుక్కమ్మగారు. చుక్క అంటే ఫుల్‌స్టాప్ అన్న అర్థం సాగదీసి, మేడమ్ ఫుల్‌స్టాప్ అని ఒక పాత్రకి పేరు పెట్టేను. పేరు తప్పిస్తే ఆవిడకీ నాకథకీ ఏంసంబంధం లేదు. అయినా ఆవిడకి కోపం వచ్చిందిట. మాఅమ్మచేత చీవాట్లు తిన్నాను.

ఏతావాతా చెప్పొచ్చేదేమిటంటే కథల్లో బోల్డు కల్పనలుంటాయి. ఎవరేనా "నాకథ ఎందుకు రాసేవు" అంటూ తగువుకొస్తే మరో భాగం చూపించి "ఇదుగో, నువ్వు ఇలా లేవు కదా" అంటూ తప్పించుకోవచ్చు (చూ. పైన చెప్పిన మార్పుల లిస్టు).

నా (అనువాదాల) తూలిక తొలి రోజుల్లో ఎవరో ఒక అమ్మాయి రచన వేసుకున్నాను. తన ఫొటో కూడా పెట్టేను కళగల మొహం. మరో నెలరోజులకి కాబోలు నాకు ఒక మెయిలు ఫార్వర్డు చేసింది ఆ అమ్మాయి. అమెరికాలో వున్న ఒకాయన దగ్గర్నుంచి తనకి వచ్చిందని. అతను ఆవిడరచన చాలాబాగుందనే కాక, తాను అర్థరాత్రి కూర్చుని ఆరచయిత్రి వివరాలన్నీ తవ్వి తీసానని రాసేడు. నేను ఆ మెసేజి అంతా పెట్టలేదు కానీ "ఆరచన బాగుంద"న్న ఒక్క వాక్యం నా కామెంట్సు పేజీలో పెట్టేను.

వారం తిరక్కుండా మరో మెయిలొచ్చింది అతని దగ్గరనుండే. తాను ప్రైవేటుగా రాసిన మెయిలు ఆలా పబ్లిష్ చెయ్యడం అన్యాయం, అక్రమం. చట్టవిరుద్ధం, అని మాయాబజారులో రంగారావులా అక్షర కథకళి చేస్తూ! సరే నేను వెంటనే ఆమెయిలు తీసేసి, అతనికి క్షమాపణలు చెప్పుకున్నాను. దానికి సమాధానం రాసాడు,

ఆరచయిత్రి self aggrandizement అనే వ్యాధితో బాధ పడుతోందని చెప్పి, తాను అసలు ఎంతగొప్పవాడో, ఎన్ని పుస్తకాలు ప్రచురించుకున్నాడో, ఎన్ని కాన్ఫరెన్సులకి వెళ్లాడో ఓపేజీ రాసేడు. (మరి ఇది self aggrandizement కాదా? ఏమో మరి). ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే అతను మాయిద్దరికీ చేసిన మహోపకారం నన్ను, సదరు రచయిత్రినీ కోర్టుకి ఈడవకపోవడం.

అప్పుడప్పుడు నా కథలూ, వ్యాసాలు వేరే సైటులలో కనిపిస్తాయి. నాకది సంతోషమే. ఏమాటకామాట ఒప్పుకోవాలి. వాళ్లు నాపేరు తీసేయలేదు ఎప్పుడూను. అంచేత "పోస్లే పాపం అక్కడ కూడా నావే కదా చదువుకుంటున్నారు, అదీ ప్రచారమే" అనుకుంటాను. సాధారణంగా చాలా పత్రికలు తమకి క్రెడిట్ ఇవ్వమంటారు ఇతరచోట్ల ప్రచురించుకున్నప్పుడు.

ఈ కథాలోకానికి భిన్నంగా బ్లాగులు కథలు కావు. సొంత ఆలోచనలూ, సొంత జీవితాల సొంత డైరీ. మధ్యాన్నంపేళ భోజనాలయేక, పిట్టగోడమీంచి పొరుగమ్మతోనో, అరుగుమీద నిలబడి ఇరుగమ్మతోనో కబుర్లు చెప్పుకున్నట్టు, మంచీ చెడ్డా, ఇష్టాలూ, కోరికలూ, చిరాకులూ అన్నీ యథాతథంగా రాసేసుకోవచ్చు బ్లాగుల్లో. ఎవరికి తోచింది వారు, తోచింది తోచినట్టు, వాక్ లేక బ్లాగ్ స్వాతంత్ర్యం ప్రకటించి, రాసేసుకోవచ్చు కానీ ప్రతిఒక్కరూ గుర్తు పెట్టుకోవలసిన, అతి ముఖ్యమయిన విషయం - డైరీలు గుట్టు. బ్లాగులు రట్టు. అంచేత, ఏంరాసినా ఆపైన కందపిలకల్లా పుట్టుకొచ్చే ఉపకథలగురించి కూడా తెలుకోడం, వాటిని ఎదుర్కొనడానికి సన్నిద్ధులు కావడం కూడా బ్లాగురచనల్లో భాగమే అని గుర్తు పెట్టుకోవాలి.

అమెరికాలో అప్పుడప్పుడు కేసులు చూస్తూంటాను కనక చెప్తున్నాను. కేసు పెట్టడం చాలా తేలిక. అవతలివాడు తప్పు చేసేడు అనేయడం తేలిక. నేను తప్పు చెయ్యలేదు అని ఋజువు చేసుకోడం కష్టం. మన చట్టాలు అలా ఏడుస్తున్నాయి. "అందరూ చేస్తున్నారు కదండీ" అన్న వాదన చెల్లదు. "నాబ్లాగు, నాయిష్టం, నాయిష్టం వచ్చినట్టు రాసుకుంటాను" అన్న వాదన చెల్లదు కోర్టుల్లో.

కోర్టువారి నిజాలు వేరని "ముత్యాలమ్మ" చెప్పింది గుర్తుందా? రావిశాస్త్రిగారి "మాయ" కథ (ఆరు సారాకథలు) చదవండి. అందులో ముత్యాలమ్మ ఉపన్యాసం ఇక్కడ మళ్లీ పెట్టేద్దును కానీ వాళ్లబ్బాయి కూడా లాయరే. హక్కులంటూ నన్ను కోర్టుకీడ్చే హక్కు వారికుందని విరమించుకున్నాను ఆ ఆలోచన.

ఒకసైటులో ప్రచురించినంతమాత్రాన మరొక సైటులో పెట్టుకోవచ్చు అని అర్థం కాదు, ఆబ్లాగరు స్పష్టంగా "అందరూ వాడుకోవచ్చు" అని ప్రకటిస్తే తప్ప. ఇదంతా ఎందుకు రాస్తున్నానంటే, కొత్తబ్లాగురులు ఇలాటి విషయాలు కూడా తెలుసుకుని వుంటే మంచిదని.

విహారి కొన్ని సలహాలు ఇచ్చారు. కొత్తపాళీ అక్కడక్కడ సమయానుకూలంగా ఇస్తున్నారు. ఈమధ్య జ్యోతి బ్లాగులో యప్,మీ. అన్న వ్యాఖ్యాత విపులంగానే చర్చించారు. ఈసలహాలన్నీ ఒకచోట చేర్చి, కూడలీ, జల్లెడలాటి ప్రముఖబ్లాగులు ఒక వనరు ఏర్పాటు చేస్తే బాగుంటుంది. బ్లాగు ఎంత సొంతమైనా కొన్ని నియమాలు పాటించడం మనకే ఆరోగ్యం. వాక్‌స్వాతంత్ర్యం, బ్లాగ్‌స్వాతంత్ర్యం - రెండూ ఆచరణీయాలూ, అభిలషణీయాలే, అడుసు చూసుకుని అడుగుపెడితే తరవాత వచ్చే గాలిదుమారం తట్టుకోడానికి వీలుంటుంది.

(23 జూన్ 2008.)

# 14. అయ్యో నారాతా!

నాచిన్నప్పుడు నేను ఉత్తరాలు బాగా రాసేదాన్నిట. -ట అని ఎందుకంటున్నానంటే రాసిన మాట అది. అవి ఇంకా అణాలూ, కాణీలూ చెలామణీ అయేరోజులు. ఒకసారి తను నాకు రాసింది, "సత్తుఅణాలిచ్చి మల్లెపూలు కొనుక్కున్నట్టు నువ్వు రాసే వుత్తరాలకోసం నేను నీకు ఉత్తరాలు రాస్తున్నాను" అని. ఎంత మనోజ్ఞమయిన భావన! నిజంగా నేను అంత గొప్పగా రాసేనని చచ్చినా నమ్మను కానీ ఆ సున్నితమైన భావం, ఆభావంలో మంచిముత్యంలా పొదిగిన ఆ ఆత్మీయతా అంత చక్కనిదీ, చిక్కనిదీ కనుకనే నాకు ఇప్పటికీ మనసులో చెరగని ముద్ర వేసుకుని వుండిపోయింది.

ఇలా పూర్వం ఒకరికొకరు ఎంతో ఆత్మీయంగా రాసుకునే వుత్తరాలే కాలక్రమాన, చేత్తో రాసే రోజులు పోయి, ఫోనులూ, ఈమెయిలులూ అయిపోయేయి. దరిమిలా పత్రికలలో, అంతర్జాలంలో అభిప్రాయాలుగా కూడా అవతరించడానికి అదే మూలం కావచ్చు. ఎందుకంటే, బ్లాగులలో చూస్తున్నాను అంత ఆత్మీయంగానూ అక్కా, అమ్మా అన్న పిలుపులతోపాటు త్వం శుంఠః అంటే త్వం శుంఠః అని వేసి వేయించుకోడాలూను.

నేను నా నెట్టవతారం ఎత్తేక, "మీకథ బాగుందండీ"లాటి పొడిమాటలతో మొదలుపెట్టి, అలనాటి చెలులవలె ఆప్తులు అయిపోయిన వారు నాకు చాలామంది కాకపోయినా చాలినంతమంది వున్నారు.

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, నెట్పత్రికలలో కనిపించే వుత్తరాలు - వాటికి చాలా పేరులున్నాయి - మీ అభిప్రాయాలూ, మీమాటా, వ్యాఖ్యలూ, అక్షింతలూ, దీవెనలూ (చివరిరెండూ బ్లాగులలో ఎక్కువగా కనిపిస్తాయి.) - ఇలా. ఏపేరు పెట్టి పిలిచినా అవి వుత్తరాలే. అందులో ప్రకటితమయేవి రాసినవారి మనోభావాలే.

"కల్పనలకుండాలి బరువూ, లోతూ" అంటూ బోధనలు పాడే పండితులు వర్ధమానరచయితలకి తరుచూ తగులుతూంటారు. ప్రజాస్వామ్య పత్రికలయుగంలో పాఠకులే పాలకులు. వారిఅభిప్రాయాలమీద రచయితలకి గౌరవం వుండాలి. వుంటుంది కూడాను. కాని ఒక్కోప్పుడు మాత్రం గందరగోళంగా వుంటుంది.

ఆమధ్య ఒక యువరచయిత్రి కథకి వస్తువు ప్రధానమా? కథనరీతి ప్రధానమా? అని అడిగింది నన్ను. అపుడు నేను గంభీరంగా ఊపిరి తీసుకుని "కథలు రకరకాలు" అంటూ ఒక దంపుళ్లపాట అందుకోబోయాను.

వెంటనే గుర్తొచ్చింది నేను ఇంతకుముందు రాసిన వ్యాసమూ, తిన్నచీవాట్లూను. అంచేత, అలా విసిగించే వ్యాసాలు మానేసి, పోచికోలు కబుర్లు చెప్పి పబ్బం గడిపేసుకున్నాను. అదేమిటంటే -

ఓసారి నాకథ ఏపత్రికలోనో కనిపించినతరవాత నాకూ మామామయ్యకీ జరిగిన సంభాషణా, మాఅమ్మ తీర్పూనూ. అదేమిటంటే ...

''ఇదిగో కనకమహలక్ష్మీ, కథల్లో ఇన్ఫర్మేషను రియలిస్టిగ్గా వుండాలా అక్కర్లేదా?''

''వుండాలి.''

''మరి విశాఖఎక్స్‌ప్రెస్ పొద్దున్న పదిగంటలకి వస్తుందని రాసావేం? నీమాట నమ్ముకుని ఆరుగంటలకే వెళ్లి కూర్చున్నాను స్టేషనులో. అది మధ్యాన్నం నాలుగ్గంటలదాకా రాలేదు.''

''నాకథకోసం అలా రాయవలసివచ్చింది.''

''కావలిస్తే కథ మార్చుకోవాలి గానీ అలా తెలిసీతెలీని రాతలు రాయకు. రైల్వేగైడు చూసి సరిగ్గా రాయి నెక్స్ట్ టైము. అసలు మన రచయిత్రులింతే. సరిగ్గా ఏదీ తెలుసుకోరు.''

అప్పుడు మామయ్యకి మా అమ్మ ఇచ్చిన తీర్పు: ''నేనందుకే చెప్పేను, దానికథలు చదవకు. రైల్వేగైడు కొనుక్కు చదువుకో'' అని.

కిందటేడు ఇండియా వెళ్లినప్పుడు ఓపాత స్నేహితురాలు కమ్ రచయిత్రిని కలిసాను.

మాటలసందర్భంలో ''ఏమేనా కొత్తకథలు రాసావా?''అని అడిగాను.

''మొదలెట్టాను కాని సాగడం లేదు.''

''ఏం?''

''పాఠకుల ప్రశ్నలు చూస్తే భయంవేస్తోంది. నువ్వూ చూస్తున్నావు కదా. ఆయనెవరో ''నీకు ముగ్గురు పిల్లలు కదా, కథలో ఇద్దరే అని రాసావు. పాపం, పిల్లలు నొచ్చుకోరూ'' అని కోప్పడ్డారు. మరో కత. ఆవిడకి పచ్చచీరంటే ఇష్టం. ఆయనకి వంకాయకూరంటే ప్రాణం. ఓరోజు ఆయన చిలకాకుపచ్చ చీర తెచ్చాడు. ఆవిడ గుత్తివంకాయకూర చేసింది. చీర చూసి ఆవిడ మూతి ముడుచుకుంది. కూర పక్కకి తోసేసి ఆయన లేచిపోయాడు. మరి అది కథ అవునా కాదా?''

''బాగానే వుంది, భేతాళుడిప్రశ్నలా. దానికి ముందు, అంటే ఆయన అలాటి చీరలే అప్పటికే ముప్ఫై తెచ్చివుంటేనూ, అలాగే ఆవిడ వరసగా తొమ్మిదిరోజులు అదే కూర చేసివుంటేనూ కథ మనోహరంగా

వుంటుంది. పోతే ఎవరు చెప్తున్నారు అన్నదాన్నిబట్టి కూడా వుండచ్చు" అన్నాను గోడమీద పిల్లివాటంగా. ఆమీదట నేనే అడిగాను. "ఏం కథ రాద్దాం అనుకుంటున్నావు?"

"చావు గురించి."

"బాగానే వుంటుంది." అని మళ్లీ మా మామయ్యమాటలు గుర్తొచ్చి, "కాస్త రిసెర్చి చేసి రాయి," అని ఓసలహా ఇచ్చాను.

"నేనూ అదే విన్నాను, కాని రిసెర్చి అంటే వారూ వీరూ శలవిచ్చినవే కదా. వారు కూడా స్వానుభవంతో చెప్పినవి కావు కదా." అంది.

"లేదులే. రామారావుగారూ, సరస్వతీదేవిగారూ చావుమీద గొప్ప కథలు రాయలేదూ" అన్నాను.

"వారి కథలు పోయినవారు పోగా మిగిలినవారు పడే అవస్థలు. నేను రాయబోయేది చచ్చినాడికథ. అంటే చనిపోయినవాడు ఏం అనుకుంటున్నాడు, ఏంచేస్తున్నాడు లాటివి."

నాకేం తోచలేదు. గొప్పచిక్కే వచ్చిపడింది.

"మరేం చేస్తావు?"

"చచ్చిపోవాలేమో," అంది.

"చచ్చిపోయింతరవాత ఎలా రాస్తావు? అక్కడ కాయితాలూ, కంప్యూటర్లూ వుంటాయో వుండవో, రాసినకథ పంపడానికి తపాలావసతులు వుంటాయో వుండవో."

"అది తెలుసుకోడానికేనా చచ్చిపోవాలి కదా."

నాకు గుండెలు గుభేలుమన్నాయి. నేరకపోయి అడిగానేమో అనిపించింది.

"అదేం మాటే. చూడముచ్చటయిన సంసారం. రత్నమాణిక్యాల్లాటి బిడ్డలూ, అదేం ఆలోచనే" అన్నాను గాభరా పడిపోతూ.

"మరి చావుగురించి ఎలా తెలుసుకోవడం?" అంది.

రాను రాను గడ్డుసమస్య అయిపోతోంది.

"మరో సందేహం. ప్రాణాలతోనే వున్న కుక్కలూ, గాడిదలగురించి కూడా మనకి చాలా సాహిత్యం వుంది కదా. "నీవున్ కవివి కావు గద" అని ఆయనెవరో కొండవీటి గాడిదని అడినప్పుడు మరి ఆయన గాడిద భాషా సంస్కృతులు తెలుసుకునే అడిగారా? అప్పట్లో యూనివర్సిటీలు అలాటి కోర్సులిచ్చేవా?"

“ఇచ్చేవేమో. వాళ్లందరూ గాడిదలసాంప్రదాయాలు క్షుణ్ణంగా చదువుకున్నారేమో,” అన్నాను. అంతకన్న ఏంచెప్పను?

“చావుమీద కథ రాయడంకోసం చావలేను. గాడిదమీద రాయడానికి గాడిదని కాలేను. మరి నాకు సాహితీపాలకులని అలరించే రచయిత్రినయే యోగంలేదు కాబోలు,” అంది నానేస్తం నీరుగారిపోతూ.

నాకు ఎనలేని జాలి ముంచుకొచ్చింది. “ఆడువారు మంచికథకులు కాలేకపోవుటకు కారణములు” అంటూ ఓ వ్యాసం రాసెయ్యాలనిపిస్తోంది. …

నేను అప్పుడప్పుడు పత్రికలలోనూ, వెబ్‌సైటులలోనూ వచ్చే వుత్తరాలు చూస్తూంటాను. అలా చూస్తుంటే, ఒకసారి ఒక అభిప్రాయం కనిపించింది. .

“ఎందుకండీ ఇలాటి కథలు రాసి మమ్మల్ని చంపడం?”

మొదట ఉలికిపడినా, సర్దుకుని తరువాతి కథకి సాగేను.

“ఇందులో నాకు ఒక్క ముక్క అర్థం అయితే ఒట్టు”.

“రచయితగారూ, అర్థం వున్న కథలు రాయండి. చదువుతాం.”

“సంపాదకులూ, ఇలాటి కథలు వెయ్యకండి.”

నాకు అనుమానం వచ్చి, రెండు నెలలు వెనక్కి వెళ్లి మరో నాలుగు కథలమీద వ్యాఖ్యానాలు చూశాను. రాసినవారి పేర్లు చూశాను. నాపరిశోధనాఫలితాలు క్రోడీకరించి వేరే థీసిస్ రాస్తానెప్పుడో. ఇప్పటికి మాత్రం కొన్ని సాధారణాంశాలు చెప్తాను, రిసెర్చర్లు తమ పరిశోధనాంశాలని కాన్ఫరెన్సులలో సమర్పించినట్టు.

పైన ఇచ్చిన వుదాహరణలు - ఇలా కత్తులు విసిరేవారు సుమారుగా ఓనలుగురు వున్నారు. అవే పేర్లు మళ్లీ మళ్లీ కనిపిస్తున్నాయి. వారు వాడే పదకట్లు ఓడజను వుంటాయి. వీరు నిజంగా ఆ కథో వ్యాసమో పూర్తిగా చదివేరో లేదో, అందులో ఏంవుందో తెలుసుకునేఆలోచన చేసేరో లేదో అనుమానమే. ఇంద్రజాలకుడు చొక్కాచేతిలోంచి పేకముక్కలు లాగినట్టు అవే మాటలు లాగి మళ్లీ మళ్ళీ విసిరేస్తుంటారు తమ వ్యాఖ్యలకింద. వర్డ్ లో వుండే cut and paste వీరికి బాగా ఉపయోగపడుతుంది. ఇలాటి వ్యాఖ్యలు రాసి ఆ లేఖామాత్రులు ఏమిటి సాధించదల్చుకున్నారో నాకయితే అర్థం కాదు సప్తజన్మలెత్తినా.

ఉదాహరణకి “ఒక్కమాట అర్థమయితే ఒట్టు” అన్న వుత్త.ర. (వుత్తరాల రచయిత)ని తీసుకోండి. చక్కటి జానుతెనుగు, మెచ్చుకోక తప్పదు. మరి అలాటి మనిషికి కాస్తలో కాస్త అయినా తెలుగు వచ్చుననే

అనుకుంటాం కద. మరి ఒక్క ముక్కయినా ఎలా అర్థం కాకుండా పోయింది? నేనే ఆ కథారచయితని అయితే, నావంతుకి నేను చేయగల పని ఏమిటి అ వుత్త. రచయితకి అర్థం అయేలా చేయడానికి?

ఇలా నన్ను ఆలోచింప జేయగలగడం ఆవుత్తరంవల్ల కలిగిన తొలి ఫలితం అనుకుందాం.

"ఆదివారం మజ్జానం మాయింటికి రండి. ప్రవేటు క్లాసు పెడతాను" అని చెప్పనా?

పోనీ, "మీరే నాకు క్లాసు పెట్టండి" అని వినయవిధేయతలతో వేడుకోలు అంపుకోనా? ఇది మరీ ప్రమాదం. ఎందుకంటే ఆ వుత్త.ర. నాకథని సీరియస్గా తీసుకోకపోయినా ఈమాటని సీరియస్గా తీసుకోవచ్చు. నాకు పాఠం చెప్పేయడానికి మహోత్సాహంతో పాఠాల్చెప్పేడానికి మాయింటికో, నాచాటులోకో వచ్చేయొచ్చు. నిజంగా ఆలా క్లాసు పెట్టేస్తే. నేను తట్టుకోగలనా? నాది అసలే బక్క ప్రాణం.

ఒకసారి ఎక్కడో చూసాను ఒకరచయిత "అప్డేట్ చెయ్యడం కష్టంగా వుంటోంది. నాబ్లాగు మూసేద్దాం అనుకుంటున్నాను" అని రాసేరు. దానిమీద పైన చెప్పిన ఒక వుత్త,ర, రాసిన వ్యాఖ్య "శుభం. వెంటనే మూసేయండి మరి." అని.

నాకు ప్రాణం చివుక్కుమంది. ఎందుచేతనంటే ఆరచయిత చాలాకాలంగా రచనలు చేస్తున్నారు. అయినపెద్దలు మెచ్చుకున్నారు. సాటి బ్లాగరులు అభినందించారు. ఈమధ్య వచ్చిన వ్యక్తిగత కారణాలమూలంగా వారు తనకి కలిగిన నిస్పృహని బ్లాగులో రాసుకున్నారు. అలాటప్పుడు ప్రోత్సాహకరంగా ఓముక్క రాస్తే బాగుంటుంది. ఏమీ రాయకపోయినా బాగుంటుంది. అంతే కానీ మరింత నిరుత్సాహపరచడం తగునా?

ఆ వుత్త.ర. తానేదో గొప్ప హాస్యంగా రాసేననుకుని మురిసిపోతూ వుండొచ్చు. కంప్యూటరుతో వచ్చిన చిక్కే ఇది. తెరవెనక ఎవరు ఎలా వుంటారో, వారి పరిస్థితులేమిటో మనకి తెలీవు. తెలిసీ తెలియని అస్తవ్యస్త పరిస్థితులలో పరాచకాలు రాణించవు. అది చాలామంది వుత్త.ర.లకి తట్టదు.

పోతే, మరో సంగతి. అందరిసంగతి తెలీదు కానీ నాకు మాత్రం రెండు, మూడు నెలలు పడుతుంది ఒక కథ రాయడానికి. టైం ఈజ్ మనీ అనుకుంటే రచయితలకి నో మనీ. (కొందరికి మాత్రమే ఈజీ మనీ). అంత పాటు పడి, ఏదో ఓకథ గిలికి, దేశంలో పత్రికలకి పంపిస్తే అవి అందేయో, లేదో, ప్రచురణకి అంగీకరించేరో లేదో తెలీదు. ప్రచురించినతరవాత అయినా ప్రచురించాం అని తెలియబరచరు. అంచేత నెట్ పత్రికలకి ఇవ్వడం మొదలు పెట్టాను. అక్కడ పైన చెప్పినలాటి వుత్త. ర.లు, సగం సగం చదివో, చదవకుండానో మాకర్థం కాలేదంటూ ఓవాక్యం గిలికి పారేస్తున్నారు. ఇక్కడ నాకు అర్థం కాని విషయం - తమరిని ఎవరూ కూచోబెట్టి "నువ్విది చదివి తీరాలీ" అంటూ బెత్తం పట్టుకు బెదిరించలేదు కద. నాకు "రాయకు" అని చెప్పడం కన్నా తమరు

చదవడం మానేయడం తేలిక గదా. ఎంచేతంటే చదవడం మానేడడం తమరిచేతిలో పని. నాచేత రాయడం మానిపించడం **తమరిచేతిలో లేని పని.** చిత్తగించవలెను.

పాతికేళ్లకిందట ఆరుద్రగారు నాకు ఒక వుత్తరం రాసేరు, నేను అడిగిన ప్రశ్నలకి సమాధానంగా. అందులో ఈవిషయమే ప్రస్తావిస్తూ, "ఏరీతి రచియించిరేని సమకాలికులు మెచ్చరు గదా" అని చేమకూర వేంకటకవి వాపోయినట్టు చెప్పారు. అలాటివే మరో నాలుగు ఉదాహరణలు కూడా ఇచ్చారు. గురజాడ అప్పారావుగారు "కొయ్యబొమ్మలె మెచ్చు కనులకు కోమలుల సౌరెక్కునా?" అన్నది కూడా ఇలాటి వ్యాఖ్యలవిషయంలోనే. ఆయనకి విజయనగరం రాజావారి ప్రాపకం వచ్చినతరవాతే మహాకవిగా రాణించేరు. బంగారుపళ్లెరానికి గోడ చేర్పు మరి!

నిజానికి, కథ చదవగానే ఏశక్తి పాఠకుడిని వుత్తరాలు రాయడానికి ప్రేరేపిస్తుంది?. ఆకథలో ఏదో ఒక మాటా, ఒకవాక్యం, ఒకపాత్రా, ఒక సంఘటనా - వీటికి స్పందిస్తాడు పాఠకుడు. ఏదో ఒకదానికి పోలింది తనజీవితంలోనో తనకి ఆప్తులయినవారి జీవితంలోనో సంభవించినప్పుడు ఆకథ నచ్చుతుంది. అలా పోలికలు చూసుకోగలిగిన పాఠకుడు అనుకూలంగా స్పందిస్తాడు. అందుకు భిన్నంగా తనకి ఎక్కడా ఆలాటి అనుభవం లేనప్పుడు చిరాకు పడతాడు. అలాటిసందర్భాలలో రాసే వుత్తరాలే వింతశోభలతో విరాజిల్లుతూ నలుగురినీ ఓదరికి చేరుస్తాయి.

ఎలా అంటే -

ఒకరు "మీ కథ మీమొహంలా వుంది" అని ఒక అభిప్రాయం వెలిబుచ్చారనుకోండి. (మీ- అనే అంటారు). దానిమీద నాలాటి రచయిత అయితే, "మీ అభిప్రాయం నాకు అర్థం కాలేదు. నామొహం అందంగా వున్నట్టా, లేనట్టా? మరి నాకున్న మొహం చూసే కద నన్ను చేసుకున్నారు మావారు, అదీ కానీ కట్నం ఆశించకుండానూ అనొచ్చు. లేదా, నాకు రెండు మొహాలున్నాయనుకుంటున్నారా? అబ్రహాం లింకన్‌ని ఎవరో టూ-ఫేస్డ్ స్కౌండ్రల్ అన్నారుట. దానికి ఆయన 'నాకు రెండు మొహాలుంటే నేను ఈమొహంవేసుకుని ఎందుకు తిరుగుతానూ?' అన్నాట్ట. ఆయన రూపసి కాడనీ, అది దాచుకోడానికే ఆయన గడ్డం పెంచేడని ప్రజావాణి' అనైనా అనొచ్చు.

అప్పుడు సహజంగానే ఆ ఉత్త.ర. "అబ్రహాం లింకన్కీ మీకథకీ సంబంధం ఏమిటండి" అంటూ మరో ఉత్తరం రాస్తాడు. నేను జవాబివ్వకముందే మరొకరెవరో అందుకుంటారు. "అసలు కథలో మీకు నచ్చనిదేదో చెప్పకుండా 'మీ మొహంలా వుంది' అంటే ఎలా తెలుస్తుందండీ ఆకథలో లోపాలేమిటో" అని. అప్పుడు మరెవరో మరేదో అంటారు. దీనికి నేను పెట్టుకున్న ముద్దుపేరు "అ.గీ.పా.త.దే." (అగ్గిపుల్ల గీసి పారేసి తమాషా దేఖో) అని.

ఇలా నలుగురూ నాలుగు రకాలుగా మేలులాడుకుంటూ కొంతకాలం జరుపుతారు. ఈలోగా ఆనెట్పత్రికవారు కారణాంతరాలవల్ల ఆమేలు తీసేస్తారు. ఇది మరో గారడీ. నెట్ సౌఖ్యం. ఇంగ్లీషులో అంటుంటారు చూడండి. Now you have it, now you don't అని. అలాగే ఇదీను.

నిజానికి ఆ వుత్త.ర.లననడానికి లేదులెండి. ఈనాటి నీతి అదీ. మీ బ్లాగు నలుగురి కళ్ల బడడానికి ఈనాటి పత్రికలూ, సైటులూ వారు ఇచ్చే సలహాలు చూడండి. అవతలివారు యతి అంటే మీరు ప్రతి అనాలి. ఎంత వ్యతిరేకంగా, ఎంత ఘాటుగా మాటలు విసిరితే అంత ఘనత. అసలు కథలో ప్రధానాంశం ఏమిటీ, సన్నివేశాలు దానికి తగ్గట్టు వున్నాయా, లేదా, వంటి సూక్ష్మవిషయాలు పట్టించుకోనక్కరలేదు. మీపేరు నలుగురి కళ్లా పడాలంటే, నలుగురి నోళ్లా నానాలంటే మీరు ఔద్ధత్యం ప్రదర్శించక తప్పదు. ఏంచేస్తాం, లోకం అలా వుందనుకుని ప్రవాహంలో కలిసిపోవాలి, అంతే.

అయితే "పొగిడితే మంచీ, తెగిడితే ద్రోహమూనా?" అని అడక్కండి. కాదండీ, ఎంతమాత్రమున్నూ కాదు. నేను అనేది తెగడడంలో రెండు రకాలున్నాయి కదా. ఏమిటి బాగులేదో, ఎందుకు బాగులేదో చెప్పడం ఒకపద్ధతి. రెండో పద్ధతి పైన చెప్పినట్టు ఔద్ధత్యంతో, అర్థంలేని వ్యాఖ్యలు చెయ్యడం. మొదటిపద్ధతికి రచయితలు ఆనందించొచ్చు. కృతజ్ఞతలు కూడా చెప్పుకోవచ్చు. ఇందులో అసౌఖ్యం ఏమిటంటే మీరు ఉత్త.ర.గా రాణించలేరు. మంచి discerning reader అయిపోతారు. మీఆశయం అదా లేక ఉత్తుంగతరంగాలు రేపుతూ రెచ్చిపోడమా అన్నదానికి మీరే సమాధానం ఇచ్చుకోవాలి.

(తెలుగు జ్యోతి, న్యూజెర్సీ, పత్రిక, జూన్ 2008, లో సంక్షిప్తరూపంలో ప్రచురింపబడింది)

(28 జూన్ 2008.)

# 15. అచ్చంగా నేనే అచ్చేసేసుకున్న చిన్నినా పొత్తము.

"బాబ్బాబూ, నాపుస్తకం కాస్త అచ్చేసి పెట్టండి. చచ్చి మీకడుపున పుడతా." - ఇది నిజానికి మధ్యమ స్థాయి. ఆదిని, ఈ అచ్చొత్తడాలు లేనిరోజుల్లో, కవులు సభల్లోనూ, నడివీధిలోనూ ఆశువుగా కవితలు చెప్పేసేవారు. ఆపైన తాటాకులమీదా, భూర్జపత్రాలమీదా గిలికేస్తూ వచ్చారు.

ఆ తరవాత కొంతకాలానికి గ్రేటుబ్రిటనునుండి యంత్రాలొచ్చేయి. అసలు నన్నడిగతే నాగరీకం అన్నమాట ఎలా వచ్చిందో కాని మనదంతా పశ్చమీకం అంటాను. తెలుగువారికంటె ఎక్కువగా తెల్లవారే పూనుకుని మహోత్సాహంతో పుస్తకాలూ, పత్రికలూ అచ్చేసేసేరు. అసలు కారణం క్రైస్తవీకరణమే అయినా, మన పుస్తకాలక్కూడా మంచికాలం వచ్చింది. మూలమూలలా పడున్న తాళపత్రాలని తెల్లకాగితాలమీదకి ఎక్కించేరు. విజ్ఞానం పలువురికి పంచిపెట్టొచ్చు అన్నది మూలకారణం కావొచ్చు. బోలెడు కాపీలు తయారు చెయ్యొచ్చు, చాలామందికి చదవే అవకాశం కలగొచ్చు అన్నవి కూడా కారణాలే అప్పట్లో.

అప్పట్లో "బాబ్బాబు, నాపుస్తకం కాస్త అచ్చేసిపెట్టు" అంటూ రచయితలు ప్రచురణకర్తల వెంట పడవలసిన అవుసరం వున్నట్టు కనిపించదు. ప్రచురణకర్తలే "ఇది మంచిపుస్తకం, ఇది నలుగురికి అందుబాటులో వుండేలా చెయ్యాలి" అని నిర్ధారణ చేసుకుని ప్రచురించేవారు. ఇలా నేనెందుకు అనుకుంటున్నానంటే వేమనగారూ, పోతనగారూ వావిళ్ల రామస్వామి శాస్త్రులవారినో, రాజమండ్రీ సరస్వతీ బుక్ డిపోవారినో కలుసుకుని ఇలా బతిమాలుకున్నారు అని అనుకోడానికి నాకు మనసొప్పడం లేదు. అలాగే "పెద్దబాలశిక్ష కానీ చిన్నయసూరి వ్యాకరణం కానీ, సదరు రచయితల పోరు భరించలేక అచ్చొత్తించినవి కావు" అని అనుకుంటేనే నాకు తృప్తి.

మూడో దశలో అంటే, వీధికో పత్రికా, ఇంటికో రచయితా -గా ఆంధ్రదేశం వృద్ధి పొందేక, సీను మారిపోయింది. ఈవిషయంలో కొంతవరకూ తెలుగురచయిత్రులు బాధ్యత వహించకతప్పదు. యాభై, అరవై దశకాల్లో పత్రికలలో వచ్చిన సీరియళ్ల ప్రాచుర్యం చూసి ప్రచురణకర్తలు వాటిని పుస్తకరూపంలో అందించేరు. ఆతరవాత డైరెక్టు నవలలంటూ సీరియళ్లు కాని వాటికి కూడా పుస్తకరూపం ఇచ్చేరు.

1982లో విజయవాడలో నేను ఒకపబ్లిషరుతో మాటాడుతున్నప్పుడు ఆయన అన్నమాట "ఈ లేడిరైటర్లతో పడలేక వారి నవలలు వేసుకోడం మానేశాంవండీ. ఆళ్ల డిమాండులు తట్టుకోలేక పోతన్నాం" అని. అంటే

ప్రచురణకర్తలే రచయితలదగ్గరకి వెళ్లి "బాబ్బాబూ మీపుస్తకం మమ్మల్ని అచ్చేసుకోనీండి, మీకు పుణ్యముంటుంది" అని బతిమాలుకునే రోజులు అప్పుడు పోయాయన్నమాట. వాళ్లు ప్లేటు మార్చేసి "మేం వేసుకుంటాం కానీ మాడబ్బెట్టి కాదు" అని ప్రకటించేశారు.

రచయితలసంఖ్య వందలు దాటిపోయింతరవాత అంతగా పేరులేని రచయితలపుస్తకాలు - అది ఎంత మంచిపుస్తకం అయినా సరే - ప్రచురణకర్తలు వేసుకోడం మానేశారు. అంచేత సిరిగల రచయితలు తమ పుస్తకాలు తామే ప్రచురించుకోడం మొదలు పెట్టారు. ఎప్పుడు అంటే ఫలానా దివ్యముహూర్తంలో అని ఖచ్చితంగా చెప్పలేను. జర్నలిస్టు చరిత్రకారులకి ఎవరికైనా తెలిస్తే చెప్పాలి.

ఇంతకీ ఈఆచారం ప్రచురణకర్తలకి గొప్ప వరం అయిపోయింది.. "ఈరచయితలది ఎంత మంచి మనసు, రాసిందే కాక ప్రచురించుకోడానికి కూడా సిద్ధమే. మనం ఎందుకు అనవసరంగా సొమ్ము కుమ్మరించడం" అనుకున్నారు. పైగా ఇది అమెరికాలో ప్రాచుర్యంలో వుంది. సబ్సిడరీ పబ్లిషింగు అంటారు. నేను అమెరికన్ పబ్లిషర్లతో మాటాడినప్పుడు తెలిసింది.

మొన్నమొన్నటివరకూ, ప్రచురణగురించి నాకు కొన్ని అభిప్రాయాలుండేవి. పాతకాలం తెలివే అనుకోండి. కాకిపిల్ల కాకికి ముద్దు కదా. నారచన నాకెప్పుడూ ఎంతోఓఓఓఓఓఓఓ బావుంటుంది విస్సందేహంగా.

కాని ...

1. మరొకరు ప్రచురించడానికి ఒప్పుకుంటే, అందులో ఎంతో కొంత సరుకు వుండే వుంటుందన్న భరోసా కలుగుతుంది. లేకపోతే వారెందుకు మదుపు పెడతారు అన్నది నా తర్కం. నా మటుకు నాకు అదొక ఆమోదముద్ర అనిపిస్తుంది..

2., వారికి ఎడిటర్లుంటారు. వారిపని ఆపుస్తకంలో తప్పొప్పులు చూడడం. చూస్తారనే నాఆశ.

3. మార్కెటింగు కూడా వారికి తెలిసినట్టు మనకి తెలీదు కదా. అది వారు చూసుకోగలరు.

నా రెండు పుస్తకాలూ ప్రచురణ అయింతరవాత నాకు అర్థమయింది నాఅమాయకత్వం. అది నాదృష్టిదోషం అనీ, నా అభిప్రాయాలకి బూజు పట్టేసి చాలాకాలం అయిపోయిందనీ. నారెండు పుస్తకాలు ఎందుకు ప్రచురించారో నాకు అర్థం కాలేదు కానీ ఎడిటింగు, మార్కెటింగు మీద ఆశలు పెట్టుకోడం మాత్రం వ్యర్థం అని తెలిసింది.

సరే, నారాతలు వెలుగు చూసే అవకాశం ఇంక లేదని నిరుత్సాహపడిపోతున్నరోజుల్లో ఓ విద్యాసంస్థ పెద్దవారిని కలిశాను. అదే తొలిసారి కలవడం ఆయనని. అయినా నాకెందుకో మాఅన్నయ్యతో

మాటాడుతున్నంత హాయిగా అనిపించింది ఆపూట. ఆ హుషారులోనే, "నేను తెలుగురచయిత్రులమీద ఇరవై ఏళ్లకిందట రాయడం మొదలుపెట్టి, మధ్యలో అటకెక్కించేసి, మళ్లీ తీసి ప్రచురణకి సిద్ధం చేసాను," అని చెప్పేశాను. ఆయన "మా పబ్లికేషన్ డివిజనుకి ప్రపోజలు పెట్టండి. వాళ్లేం అంటారో చూద్దాం" అన్నారు. నిజానికి నేనేదో చేస్తున్నపని చెప్పాను కానీ ఆయన అలా అంటారని అనుకోలేదు. ఎదురు చూడని ఆహ్వానం. నేను ఉప్పొంగిపోతూ, ఆహా జీవితమానందమయమూ అంటూ స్వగతంలోనే పాడేసుకున్నాను నాగదికి వెళ్లిపోయి. ఆతరవాత, "లోకంలో నిజంగా మంచివాళ్లున్నారు, మనం మంచిపని చేస్తే, ఆదరించేవారున్నారు" అని మహదాచ్చేర్యపోయేసి, నేలకి నాలుగడుగుల ఎత్తున నడుస్తూ ఇల్లు చేరి, మరోసారి ప్రూఫు చూసుకుని మేల్ చేసేశాను సదరు పబ్లికేషను డివిజనుకి.

అట్టే ఆలీసం లేకుండానే, తమ అంగీకారం తెలిపేశారు ప.డి. డైరెక్టరు. నేను పడీ పడీ మురిసిపోయేను. హమ్మో, ఇండియాలో విద్యాసంస్థలలో ఇంత గబగబా పనులు జరిగిపోతాయా అని.

ఆతరవాత, మరో నాలుగు వారాలకి కాబోలు ఆసంస్థలోనే ఒకమహారచయిత్రి అయిన ఓ చంద్రముఖినుండి నాకో ఈ-లేఖ వచ్చింది. తమ సంస్థ ఆనవాయితీ ప్రకారం, తనని నాపుస్తకానికి శ్రీముఖం రాయమన్నారనీ, నాకు అభ్యంతరం లేదని తాను అనుకుంటున్నాననీ, అలా నాబృహత్ గ్రంథానికి శ్రీముఖం రాయగల అదృష్టం తనకి కలగడం తను ఏనాడో చేసుకున్న పుణ్య విశేషమనీ ... హీహీహీహీ ... లేదులెండి అచ్చంగా ఇలాగే కాదు కానీ ఇంచుమించు ఇలాటి అర్థమే వచ్చే ఇంగ్లీషులో రాసింది ఆ రైటరు.

మరి నేను కూడా అంతకంత తీర్చుకోవాలి కదా (అప్పులుంచుకోరాదు). అంచేత తమవంటి ప్రముఖ, ఉత్తమ, మహా రచయిత్రీ, విదుషీమణీ, (గట్రా) నాపుస్తకానికి ముందుముక్క రాయడం నాకెంతో గౌరవప్రదమనీ, అసలు అందువల్ల నాకూ, నా ఉద్గ్రంథానికీ విలువ ద్విగుణీకృతమయిందనీ, విన్నవించుకున్నాను శక్తిలోపం లేకుండా.

మళ్లీ వెంటనే మరో మేలు- నేను అనుమతించినందుకు తనకెంతో ఆనందమయిందనీ, పైవారం సామర్లకోటలోనో శంకరగిరిమాన్యాల్లోనో ఏదో సభ వుందనీ, అది అయినతరవాత తప్పక రాస్తాననీ.

ఇప్పుడు చెప్పాలంటే "ఆరోజులు మళ్లీ రావు." నాకు కళ్లనీళ్లొస్తున్నాయి! "ఆహా, ఆ మర్యాదా, ఆ మప్పితం, ఎంతైనా తెలుగు ఆడబడుచూ, ఆసలా వంశంలోనే వుందీ ... " ఇలా ఏంతైనా చెప్పుకోవాలనిపించిందన్నమాట.

ఆతరవాత మాయిద్దరిమధ్య జరిగిన మేలాదిమేలుల సంక్షిప్తరూపం ఇక్కడ చూడగలరు -.

నేను- సభ చాలా బాగా జరిగిందని విన్నాను. మీ ఉపన్యాసం పత్రికల్లో చదివాను. చాలా బాగా మాటాడేరు." (ఇందులో ఆవిడ రాయబోయే "ముందుమాట" యొక్క మాట లేదు.)

చం.- చాలా బాగా జరిగింది. (ఇందులో కూడా నా ప్రవేశిక ప్రవేశించలేదు.)

నేను.- నాపుస్తకానికి మీరు రాయబోయే ముందుమాట చూడడంకోసం ఎంతో వుత్సాహంగా ఎదురు చూస్తున్నాను.

చం.- ఈనెలాఖరున మా పెద్దాడికి పరీక్షలు. అది అవగానే రాస్తాను. ఆషామాషీగా కాక, ఎంతో వొడుగ్గా రాయాలని నాకోరిక.

నేను.- తప్పకుండా రాయండి. రచయిత్రులమీద రాయడానికి బోలెడు సమాచారం వుంది. మీలాటి లబ్ధప్రతిష్ఠులయిన పండితురాళ్లు రాయడం అవసరం.

చం.- అలా అనకండి. నేను అంత పండితురాలని కాను

నేను.- వచ్చే సెమెస్టరు ఇక్కడ యూనివర్సిటీలో ఒక కోర్సు పెడుతున్నాను. నాపుస్తకం పాఠ్యగ్రంథంగా పనికొస్తుంది. మీరు ముందుమాట కాస్త త్వరగా ముగిస్తే సంతోషిస్తాను.

చం.- మీరు తొందర పెడుతున్నారు కనక చిన్నది రాసి ముగించేస్తాను.

నేను.- అలాగే కానివ్వండి. నిజానికి వీసీగారు మూడునెలల్లో ప్రచురణ అయిపోగలదన్నారు. ఏడాది దాటిపోయింది చూశారా!

చం. (జవాబు లేదు)

నేను. మీరు నామెయిలు చూడలేదేమో. నాకు క్లాసులు మొదలవుతాయి త్వరలోనే.

.(మళ్లీ జవాబు లేదు)

నేను. రెండు నెలల్లో ఇండియా వస్తున్నాను. వీలయితే మిమ్మల్ని కలుస్తాను.

చం. నేను అప్పుడు వూళ్లో వుంటానో వుండనో చెప్పలేను. మీరు వచ్చేక ఫోను చెయ్యండి.

ఇలా మామెయిళ్లు ఆగిపోయేక ఇండియాలో దిగాను. అప్పటికి నాకు మొదట మాట ఇచ్చిన పెద్దవారూ, ఆయన తరవాత వచ్చినవారూ కూడా రిటైరయిపోయారు. ఆస్థానంలో కొత్తగా చేరిన మూడోనెంబరు పెద్దవారిని కూడా కలుసుకోడానికి అనుమతి తీసుకుని, అనుకున్నవేళకి కలుసుకున్నాను. వారు కూడా

ఎంతో ఆప్యాయంగా "నాముందు పెద్దవారు మీకు మాట ఇచ్చారు, ఆమాట నిలబెట్టవలసిన బాధ్యత నాకుంది, తప్పకుండా వేస్తాం" అని మాటిచ్చారు.

ఇలా మాట మీద మాట పుచ్చుకునీ, ఆమాటా ఈమాటా మాటాడుతూనూ నాలుగేళ్లు ఎదురుచూసాను ఆశుభముహూర్తం కోసం.

ఇండియానించి తిరిగి రాగానే, కొత్తగా వచ్చిన డైరెక్టరాఫ్ పబ్లికేషనుకీ నాకూ జరిగిన మేలులాట కూడా నాకూ చంద్రముఖికీ జరిగిన ఏకాంకికలాటిదే. మొదట ఎంతో మెప్పుగా మేడమ్‌గారు అంటూ మొదలెట్టి చివరకి ఎడ్రెస్ లేని ఉత్తరాలూ, ఆతరవాత పూర్తిగా సౌండ్‌లెస్.

ఈలోపున నాకు అప్పుడప్పుడు సహృదయులైన మిత్రులు తారసబడడం, వాళ్లు "నేనడిగి చెప్తాం లెండి" అని మాట ఇవ్వడం జరుగుతూ వచ్చింది. మీ మాన్యుస్క్రిప్టు కాపీ పంపించండి ఫలానా ఎడ్రెస్‌కి అని చెప్తే నేను కాపీలు పంపిస్తూ వచ్చేను. పాపం, నాస్నేహితులు నిజంగా శ్రమ తీసుకుని వెళ్లి కనుక్కుంటూనే వున్నారు. ఎవరో ఒకరు అడిగినప్పుడల్లా ఆ ప.డై. "ఇదుగో అయిపోయింది. వచ్చే నెల వచ్చేస్తుందని చెప్పండి" అంటూ వచ్చింది. "వచ్చేనెల"లు వచ్చి పోయేయి కానీ నా పుస్తకం అచ్చు కాలేదు. నేను అదేం అని రాసిన మేలూ, ఉత్తరాలూ బుట్ట దాఖలా. పెద్దవారికి రాసినా అంతే.

ఇప్పటికి నాలుగేళ్లయింది. ముగ్గురు వీసీలు, నలుగురు ప. డై.లు మారేరు నాకు తెలివొచ్చేసరికి.

ఈనాటికి అర్థమయిన సంగతుల గతి ఇదీ -

1. అయిన పెద్దలు ఆమోదించినా వాకిట కావలి తిమ్మన్నలు జరగనివ్వరు

2. మాటిచ్చేయడం తేలిక. పాటించడం లేదిక.

3. మాన్యుస్క్రిప్టు కాపీలమీద కాపీలు అంపుకోడంకన్నా సొంతంగా అచ్చేసుకోడం చవక

4. మనం వేసుకున్నా, మరొకరు వేసినా మార్కెటింగు రూలొకటే. అచ్చేయించేసి, దేవుడా నీవే దిక్కు అనుకుని వూరుకోవాలి ఆస్తికులయితే. నాస్తికులు కూడా ఇలాటిదే మరోటి కనిపెట్టుకోవాలి.

**గమనిక** . ఇది ఊసుపోక కాదు, నిజంగానే రచయితఆర్తితో రాస్తున్నాను. ఈపాయింటునించీ మీరు చదువుతున్నది నిజంగా నిజం. నాపుస్తకాలు నేనే Publish on Demand (POD) పద్ధతిలో ప్రచురిస్తున్నాను.

ముందు ఇది ఎలా పని చేస్తుందో చూడడానికి, తొలి ప్రయత్నంగా ఒక చిన్న సంకలనం, నాకథల అనువాదాలు "All I Wanted was to Read and Other Stories" by Malathi Nidadavlu అన్న పేరుతో www.CreateSpace.com ద్వారా ప్రచురించాను. రెండోది - పాతికేళ్లుగా కుస్తీ పడుతున్నపుస్తకం, Telugu

Women Writers, 1950-1975, A Unique Phenomenon in the History of Telugu Fiction, కూడా ప్రచురించాను. మంచి రెవ్యూలు వచ్చేయి. ఇది ఇండియాలో ప్రచురించమనీ, తెలుగులో కూడా ప్రచురించమనీ సలహాలు వచ్చేయి. ప్రయత్నాలు చేస్తున్నాను.

(18 జూన్ 2008. )

## 16. చతుర ముఖము!

హమ్మయ్య. నేను చాలా చాలా పెద్దదాన్నని అందరికీ తెలిసిపోయింది కనక ఇహ హాయిగా రాసేయొచ్చు నా కిటుకులన్నీ. ఇంకా ఎవరికేనా అనుమానం వుండిపోతే, ఏదో ఓ పత్రికలో నాబొమ్మ వుంటుంది, చూడండి.

నిజంగా. పెద్దదాన్నయిపోయానని ఈరోజు పొద్దున్నే మరోసారి ఋజువయింది. తెలుగు'వాడి'ని బ్లాగులో వ్యాఖ్య రాయబోయి, పొరపాటున వికటకవిగారి బ్లాగులో పెట్టేశాను. (ఇద్దరికీ నాక్షమాపణలు). ఏమయిందంటే, మామూలుగా నేను తెల్లవారుఝామున నాలుక్కో ఐదుకో లేస్తాను. అప్పుడు బుర్ర ఖాళీగా వుంటుంది కనక అందులో ఏది పెట్టినా కుదురుగా స్థిరపడుతుంది. మజ్ఝాన్నాల పొద్దు తిరగుతూనే, ఆ దినకరుడితోపాటు నా మేధస్ కూడా వాలుతూ పోతుంది. సాయంత్రం అయేసరికి ఆయనా నేనూ కూడా inoperable అయిపోతాం. సాధారణంగా అలాటిసమయాల్లో వ్యాఖ్యలు చూసినా నేను జవాబులు రాయను. కానీ, నిన్న తెలివి మాలి, అమితోత్సాహంతో తెలుగు'వాడి'ని గారికి జవాబు ఇచ్చేను. అది నాకంప్యూటరులో ఒకంతట సాగలేదు. ఆ అవస్థల్లో పడి చిరునామాలు గల్లంతయేయి. హీహీహీ.

ఇప్పుడు రెండో విషయం. నేను చతుర సరసోక్తులతో నేస్తాలు కట్టేసుకుంటున్నానన్న మాటొచ్చేసింది. మరి మాటొచ్చింది కనక అడుగుతున్నా మాటవరసకేననుకోండి, నాకిప్పుడు ఆ రెప్పుటేసను కాపాడుకోవలిసిన అవసరం వుందా లేదా? అది అలా వుంచుదాం కొంచెంసేపు.

అసలీ చాతుర్యం వెలగబెట్టే లక్షణాలు ఎలా వస్తాయి? నాకెలా వచ్చాయి అని నాకెప్పుడూ సందేహమే. చెప్పేను కదా మాఇంట్లో అందరివీ ఎల్లవేళలా షేక్స్పియర్ మొహాలేనని. అంటే – నేను ఆంధ్రా యూనివర్సిటీలో చదివేరోజుల్లో షేక్స్పియరు చదివేవాళ్లం (ఆయన్ని చదవనివాళ్లెవరు కనక). ఆయన పుస్తకాలన్నిటిమీదా ఒకటే మొహం గాంభీరంగారావులా. అంచేత ఎవరేనా సీరియస్‌గా కనిపిస్తే "ఏం

షేక్స్పియరు మొహం పెట్టేవు, ఏమిటి కథ'' అనడం మామూలు అయిపోయింది మాకు. ఆతరవాత విస్తృతార్థాల్లో ముచ్చుమొహం ఏడుప్ముహంలాటివి కూడా చేర్చేం.

మాయింట్లో అందరూ ఒరిజినల్ అర్థంలో షేక్స్పియరు మొహాలతో గంభీరంగా ఎల్లవేళలా ఏదో ఆలోచిస్తూనో, ఆలోచిస్తున్నట్టు కనిపిస్తూనో వుంటారు. అప్పుడే కావచ్చు పత్రికలూ, పుస్తకాలూ చదివేయడం మొదలు పెట్టేను వీళ్లిలా ఆలోచించేదేమిటయివుంటుందా అని ఆలోచిస్తూ.

ఆరోజుల్లోనే ముళ్లపూడి వెంకటరమణగారు నామీద జాలిపడే (మనకి కథ నచ్చితే, ఇది నాకోసమే రాసినట్టుంది అనుకోడం సహజమే కద) నవ్వొచ్చే కథలు రాసిపారేస్తూ వచ్చేరు. అదే సమయంలో రావిశాస్త్రిగారు (మావీధిలోనే ఆచివర వారిల్లు అని చెప్పానా?) కూడా చమత్కారంగానూ వ్యంగ్యంగానూ, అంటే చిరునవ్వులొచ్చే కథలు రాయసాగారు. అలా నాకు అనుకోకుండానే హాస్య, వ్యంగ్యాలమీద ప్రేమ పుంజుకునేసింది. మనకి దేనిమీదేనా ప్రేమ కలగ్గానే ఏంచేస్తాం? సొంతం చేసేసుకుంటాం. అలా చేసేసుకోడానికి తాపత్రయపడతాం. మళ్లీ ఈమాట వాళ్లతో అనకండి, బావుండదు. (ఇది బ్లాగులాళ్ల గుట్టుగా గ్రహించాలి). మునిమాణిక్యం నరసింహారావుగారూ, భమిడిపాటి కామేశ్వరరావుగారూ, భానుమతిగారు తరవాత వచ్చేరు. సాహిత్యచరిత్రలో కాదు, నేను చదివిన వరసలో.

అలా నాకు చతురముఖం అంటే చాతుర్యం వెలగబెట్టే ముఖం ఏర్పడిపోయింది. ఇంక అక్కడినించీ ఎన్ని రకాలుగా చాతుర్యం సాధించొచ్చు అన్న విషయంలో పురుగు తొలచేడం మొదలయింది. నేను కనిపెట్టిన సూత్రాలు ఇవీ -

1. నిజం చెప్పి నవ్వించొచ్చు. నాకు కోపం ఎక్కువ అని సౌమ్యతోనో, వైదేహితోనో అంటే ''హీహీహీ, మీకు కోపం అంటే నాకు నవ్వొస్తోంది'' అంటారు. అదే మా సరయుతో చెప్తే, ''నాకు తెలుసు'' అంటుంది తన తెలుగుభాషాపాటవం నామీద ప్రయోగించేస్తూ. దానికి ఇంగ్లీషు అనువాదం no kidding.

2. జోకు అవునో కాదో తెలీనిదాన్ని జోకు చెయ్యొచ్చు. మాసరయు తెలుగు ప్రయోగాలు - నామీద విసుక్కోవలసి వచ్చినప్పుడు (దానికి తెలుగు చదవడం రానందుకు నేను ఆనందించే సందర్భం ఇదొక్కటే).

దాని చిన్నప్పుడు నేను ''చెప్తే వినవు. కొడితే ఏడుస్తావు'' అని విసుక్కుంటూ వుండేదాన్ని. ఆమాట దానికి బాగా పట్టుబడింది. (పిల్లలకి తెలుగు ఇలాగే వస్తుంది). అంచేత ఇప్పుడు నామీద తనకి విసుగేస్తే, ''ప్చ్. చెప్తే వినవు.'' అని విసురుగా తలెగరేసి, సరి పెట్టేస్తుంది. రెండోసగం (కొడితే ఏడుస్తావు) అవాచ్యం. పెద్దలయందు వాడరాదని తనకి తనే గ్రహించేసింది. ఆమాట నేనే అనుకోవాలి పూజవేళ మమ అనుకున్నట్టు. అది చూసి నాకు నవ్వొస్తుంది.

3.  జోకున్నర జోకు. మళ్లీ సరయుదే. తనకి తెలుగుమీద అభిమానం ఇతోధికం చేసే సదభిప్రాయంతోనూ, అసలు, పేల్తాయో లేదో చూద్దాం అనీ, అప్పుడప్పుడు తెలుగు జోకులు చెప్తాను తనకి.

నాకథనం ముగిసిందని అర్థం అయింతరవాత, ‘‘హూహూహీహీ’’ అంటుంది.

నేను వదలకుండా ‘‘నిజంగా నవ్వొచ్చి నవ్వుతున్నావా? అది జోకు అని నేను అనుకుంటున్నందుకు నవ్వుతున్నావా?’’ అని అడుగుతాను. తెలీక కాదు గానీ ….

మాపిల్ల కళ్లు చిట్లించి, నామొహంలోకి తేరి చూస్తూ, both అంటుంది.

4. కొత్తమాటలు సృష్టించు విధానం. (సిరిసిరిమువ్వగారూ, హుషార్, ఇదుగో మీప్రశ్నకి జవాబు).

మరుపూ, చెరుపూ, సమయానికి మాట తోచకపోవడంలాటివి జరిగినప్పుడు భాషాభివృద్ధి జరుగుతుంది.

ఋణగుణధ్వని అన్న పదకట్టు పుట్టడానికి కారణం నా మతిమరుపూ, పొరపాటూ సమ్మేళనం. ఆ మేళం ఏమిటంటే -

నేను ఆ టపా రాస్తున్నప్పుడు, చిన్నప్పుడు లెక్కలపాఠాల్లో ఋణం అన్న పదం మైనస్‌కి వాడడం గుర్తుకొచ్చింది మొదట. వెంటనే ప్లస్‌కి గుణం అనుకున్నాను. ఎందుకంటే మతిమరుపుచేత. ఆతరవాత ఏదో ‘‘ధ’’ గుణింతం వుందనే కాని అసలు మాట జ్ఞాపకం రాలేదు. ఈలోపున రణగొణధ్వనులు అన్నమాట తోచింది. అన్నీ ఓగళాసులో పోసి గలగల్లాడిస్తే పంచపళ్లకషాయంలా ఋణగుణధ్వనులు అన్న పదం వచ్చింది పాలకడలిలో అమృతం ఉద్భవించినట్టు.

ఆతరవాత నాలుగురోజులకి గుర్తొచ్చింది లెక్కల్లో ఋణధ్వని కాదు ఋణధృవం అనీ, ప్లస్‌కి ధనధృవం అనీను. కాని అప్పటికే సిరిసిరిమువ్వగారు ఆపదం బావుందనేశారు!

(గమనిక: ఈటపా నాల్గాగులో పెట్టిన తరవాత ఫణిగారు ఋణగుణధ్వని అన్న నుడికట్టు ముళ్లపూడివారి సొమ్ము అని తెలియజేశారు. అంచేత ఈ పేరాగ్రాఫు చేరుస్తున్నాను ఇక్కడ. ముళ్లపూడి వెంకటరమణగారంటే నాకు ఎనలేని గౌరవం. ఒకసారి నేను వారితో మాటాడినప్పుడు ఆయన ఎంతో ఆదరపూర్వకంగా మాటాడారు నాతో. వారి రచనలు నేను చిన్నతనంలో చాలా ఉత్సాహంగా చదవడంచేత వెంకటరమణగారి పదబంధం అన్‌కాన్షస్‌గా నామెదడులోకి వచ్చేసి వుండొచ్చు. వెంకటరమణగారి వంటి ప్రతిభావ్యుత్పత్తులు గల రచయిత మాటలు నేను వాడుకోడం జరిగితే అది వారికి నివాళిగానే కానీ మరోటి కాదు.

కాన్షస్ లెవల్లో మాత్రం నాల్గాగు రాస్తున్నప్పుడు పైవిధంగా నేను ఆలోచించిన మాట వాస్తవమే. ముళ్లపూడి వెంకటరమణగారికి నేను సదా కృతజ్ఞురాలిని. ఈ ఒక్కమాటకే కాదు, ఆపద్ధతిలో ఆలోచించిడం నేర్పినందుకు.)

సరే, ఇప్పటికి మీకు కొంచెం అర్థం అయివుండాలి. చమత్కారాలకి మంచి రెసెపీ ముదురువయసూ, మరుపూ, చెరుపూ అని. … అందరూ ఇలాగే కాకపోవచ్చులెండి. అది వేరే సంగతి.

మరో గొప్ప సోర్సు సాటి తెలుగుబ్లాగరులు. వారిలో చాలామంది నాకంటే బాగా రాస్తున్నారు. నేను అక్కడినుంచి కూడా కాపీ కొట్టేస్తాను. భాష ఎవరబ్బసొమ్మనీ … అసలామాటకొస్తే తెలుగు బ్లాగుల్లో జరుగుతున్నంత ఉధృతంగా, హుషారుగా భాషాభివృద్ధి మరెక్కడా ఏకాలంలోనూ జరగలేదని ఘంటాపథంగా చెప్తాను. వెనకటికి ఛాసరూ, మిల్టనూ makers of English language అయినట్టే ఈనాడు బ్లాగరులు భాషాకారులు. తెలుగు భాషాసంఘంవారూ, ఈమాట.కాం వ్యావహారిక భాషావాదచరిత్ర ప్రత్యేకసంచిక ఎడిటర్లూ ఈ బ్లాగరుల భాషని గుర్తించకపోవడం నాకు బాగులేదు.

5. సంఘటనలు - నా అంతట నాకు తోచకపోతే, సహృదయులు ఇచ్చిన సలహాలఖజానాలో వెతుకుతాను. ఈమధ్య కిరణ్‌చావా http://kiranchava.blogspot.com "లింకులివ్వండి వేరే బ్లాగరులగురించి చెప్తున్నప్పుడు" అని సలహా ఇచ్చారు.. నిజంగా నేను లింకులిస్తే ఏమవుతుంది? నాటపాల్లో తరుచూ కనిపించే పేరులు ఓ పది వున్నాయనుకుందాం. వీరందరూ బ్లాగులోకంలో రాజాధిరాజులూ, రవికోటితేజులూ, మేరునగ సమధీరులూను. నేను వీరికి లింకులిస్తాను అనుకోండి.

జరిగి వుండబోయే కథ ఇలా వుంటుంది …

లింకులివ్వడం మొదలెట్టాను శ్రద్ధగా.

అవే బ్లాగ్వరుల పేర్లు మరలా మరలా తిరిగొస్తున్నాయి బూమెరాంగుల్లా.

చిన్నో, పెద్దో, కిరణ్, http://te.chavakiran.com/blog చెప్పేడు కదా అని అన్నిటికీ లింకులిచ్చేను ఓపిగ్గా.

రాజు వెడలె రవితేజములలరగ అంటూ నాకత వచ్చెను తెరమీదకి.

పాఠకులు చదవడం మొదలెట్టారు. నేనిచ్చిన లింకులుచ్చుకు అటుకేసి వెళ్లిపోతున్నారు. ఒక్కరూ తిరిగొచ్చిన జాడ లేదు. ఎవరూ నాటపా చివరంటా చదివిన పాపాన పోయినట్టులేదు.. ఆబ్లాగ్వరుల ప్రతిభ అలాటిది.

ఇది కాదు పని అని, నేను కూడా ఆ లింకులివ్వబడిన బ్లాగరుల ఇల్లు సొచ్చి, తలో కామెంటు చొప్పున, కామెంటులమీద కామెంటులు పెట్టుకుంటూ పోయేను. నా అస్తిత్వాన్ని చెప్పకయే చెప్పుతూ (బ్లాగులోళ్ల గుట్టు నెం. 2.).

ఇలా రెండురోజులపాటు గొలుసులకి గొలుసులు ఎడతెగక తగిలిస్తూ ..,

'కీ'లు మీద 'కీ'లు కొట్టుకుంటూ పోడంతో వేలు వాచిపోయింది.

డాక్టరుదగ్గరికి వెళ్లేను.

"ముదిరిపోయింది, వేలు తీసేయాలి" అన్నాడు.

"అదెలా? నావేలే నా జీవనకీలు" అన్నాను.

"నీకు వేలు కావాలా? కీలు కావాలా?" అన్నాడు.

సరే "వేలు తీసే"మన్నాను, స్పీచి కీలుతో గడుపుకోవచ్చులే అని.

ఆయన చురకత్తికోసం పక్కగదిలోకి వెళ్లేడు.

"డాట్రారు బాబూ" అంటూ ఓ మీసాలాసామి ఓ కర్రిగేదెని తోలుకొచ్చాడు,

నేను ఎగిరి గెంతేసేను తలుపువేపు.

డాక్టరొచ్చేడు మేకలు నరుక్కునే కత్తితో.

చివ్వున కత్తి విసిరేడాయన.

కెవ్వుమని కేకేసి లేచి కూర్చున్నాన్నేను.

కల గనక సరిపోయింది. … భయంకరం!

Effective immediately, నా ప్రతిజ్ఞ - ప్రసిద్ధ బ్లాగురులకి లింకులివ్వబడవు. Converse is also true. నేను లింకులివ్వకపోతే, వారు ప్రసిద్ధ బ్లాగరలయి వుండాలి.

(1 ఆగస్ట్ 2008.)

# 17 మహావీరచక్ర

మహావీరచక్ర బిరుదాంకిత, మాలతీనామధేయ, glorified chauffferగా చెలగుతున్న నా కథవిధానమ్ము ఎట్టిదనిన...

అమెరికా రాగానే ఆడవారిచేత చక్రం, మగవారిచేత గరిటా గూటిలో గువ్వపిట్టల్లా, ఆకుల్లో అణిగిమణిగిన కోయిలలా అమిరిపోతాయి.. ఎక్సప్షనులుంటారు, కాదనను.

నాకు మంచి డ్రైవరునన్న పేరుంది. రోడ్డుమీద బీటుపోలీసులతో సత్సంబంధాలున్నాయి. అపార్థం చేసుకోకండి మరి. పోలీసాళ్లకి నేనంటే సరదా. (వాళ్లు నాబ్లాగులో టపాలు చదవలేదు. వాళ్లకి తెలుగు రాదు). పోలీసాళ్లు నేనంటే సరదా పడడం నా ముసిలిమొహం, తోలురంగూ అంటారు అభిజ్ఞవర్గాలు. ఇది ఇంకా రిసెర్చి చెయ్యాలి.

ఏమైతేనేం, గోతికాడ నక్కలా పొంచున్న ఏపోలీసాయనో చీటికి మాటికి నన్నో పక్కకి లాగేయడం మాత్రం నాజీవితంలో సర్వసాధారణం అయిపోయింది అనతికాలంలోనే. ఆదిలో నాకైతే కాళ్లలో నెత్తురు ఎగసి గుండెలకి తన్ని ధన్ ధన్‌మని కొట్టుకునేవి. తరవాత వాళ్లేం చెయ్యరని తెలిసినతరవాత అలవాటయిపోయారు పెంపుడుకుక్కల్లా.

వీళ్లు చాలనట్టు సెల్లులోటి. నేను చక్రంపట్టిన తొలిరోజుల్లో ఈసొద లేదు. ఈమధ్యనే పదేళ్లవుతోందేమో మా పాలకులకి హుషారొచ్చీసి, "ఎవరేనా స్పీడు మీరతే, మీరు వెంటనే మీసెల్లులో పిలిచేసి మాకు చెప్పేసెయండి" అని సామాన్యులకి తాఖీదిచ్చేరు. ఇహ అడక్కండి నాఅవస్థ. నావెనక వున్న ప్రతి డ్రైవరూ నామీదే చెప్పేస్తున్నాడని నాకొకటే హడలు. అంటే నేను స్పీడుగా వెళ్తున్నానని కాదు. తమకి తెలీందేంవుంది, పేనుకి పెత్తనం ఇస్తే ... అనీ.. నాకు సెల్లు లేదు, జీయస్పీవో ఏదో అదీ లేదు. ... నాకు లేనివి చాలా వున్నాయి. అవన్నీ ఎందుగ్గానీ ...

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే .. ఈమధ్య నేనూ పొరుగూర వున్న మరో బ్లాగరు రాధికా "మీర్రండి" అంటే "మీర్రండీ" అంటూ పిలిచేసుకుంటున్నాం చెమ్మచెక్కలాడుకుంటున్నట్టే. ఈ వూరికి ఆవూరెంత దూరమో ఆవూరికి ఈవూరూ అంతే దూరం. నిన్న జరిగిన సంభాషణ మాత్రం కొంచెం వేరుగా వుంది.

“నేను కొంతకాలంగా వూరు వదలి వెళ్లడం లేదు, నా రోడ్ సెన్స్‌కి తకరారొచ్చిన్నట్టు అనుమానంగా వుంది. ఎక్కడ బయల్దేరితే ఎక్కడ తేల్తానో తెలీడంలేదు,” అన్నాను.

“మీరు తెగ నవ్విస్తారండీ” అంది రాధిక.

అప్పుడు నేను, “హయ్యో నాబతుకెంత నవ్వులాట అయిపోయింది” అని కొంచెం బాధపడి తరవాత కథలో పడిపోయాను. ముందొకసారి చెప్పలేదూ నిజం చెప్పి నవ్వించొచ్చని. అలాటిదే అన్నమాట ఇది కూడా.

ఇంతకీ అసలు నేను ఈ మహరాజవీధులెక్కి పొరుగూరికెళ్లడం ఎందుకు మానేశానో చెప్తాను.

ముప్ఫైఏళ్లనించీ బండి తోలుతున్నాను. అమెరికాలో మూడు దిక్కులా తిరిగి వచ్చేశాను. ఆప్తవర్గంలో మంచి డ్రైవరని మెప్పు పొందేను. అయినా మరోవంక బీటుపోలీసులతో వాదులాటలు తప్పడంలేదు. తోచీ తోచనమ్మ తోటికోడలు పుట్టింటికెళ్లిందని, వాళ్లకి మరేం పని లేకపోతే, నన్ను నడిరోడ్డుమీద ఆపేసి, నా యోగక్షేమాలు కనుక్కొని, నీ మంచికోసమేనని బులిబుచ్చి కబుర్లు చెప్పి, నెత్తిమీద చెయ్యి పెట్టి బుజ్జగించడం తరువాయిగా, అంపకాలు పెడుతూ వుంటారు. హాస్యం కాదండీ, ఈకథలన్నీ పరమ సత్యాలు. సరస్వత్తోడు.

నాకళ్లు అసలు సెర్చిలైటుల్లా పనిచేస్తాయి. నాకు కళ్లజోడు కూడా అక్కర్లేదు డ్రైవు చేస్తున్నప్పుడు. చుట్టూ చూసుకుంటూ డ్రైవు చేస్తాను. రోడ్డుమీద నాకు చిరాకు కలిగించే సంగతులు కొన్ని వున్నాయి. పైన చెప్పిన సెల్లులు ఒకటి. రెండు, ట్రాఫిక్ సైనులు. Red light, stop sign, yield, no turn on red... ఇన్ని ఆంక్షలు రోడ్డుమీదకెళ్తే. ఇవి చాలనట్టు exceptions. శనివారం, ఆదివారం, శలవురోజు, సాయంత్రం 4 to 6 p.m., no left turn ...ఎందుకివన్నీ?

నిజంగా ఎవరు ఎవరికి పెట్టేస్తారోనని చూసుకుంటూ జాగ్రత్తగా బండి తోలుకుపోయేవాళ్లకి, ఇవాళ ఏంవారం, శలవవునా కాదా, ఇప్పుడు నాలుగ్గంటలయిందా లేదా, ఎడమవేపు తిరగడానికి ఇది తగు సమయం అవునా కాదా .....లాటివి క్షణాలమీద తోస్తాయా వెనక ఏ యస్యూవీ (SVU)నాథుడో సెల్లోటి చేత బుచ్చుకుని మీదమీద కొచ్చేస్తుంటే?

నన్నడిగితే, పాలకులు చోదకులకు గట్టిగా చెప్పవలసింది ఒక్కటే ఒక్క మాట “ఒళ్లు దగ్గర పెట్టుకుని డ్రైవు చెయ్యండి బాబుల్లారా, తల్లుల్లారా” అని. నాకు ముఖ్యంగా కోపం ముంచుకొచ్చేది వీధులు నిర్మానుష్యంగా వున్నప్పుడు, ఎక్కడా కారుజాడా, మనిషిజాడా కనుచూపుమేరల్లో కంటికాననప్పుడు కూడా మనం ఇవన్నీ పట్టించుకోవాలి.

ఇలా నేను ఆలోచిస్తుండగా, ఒకరోజు ఒక చిన్నరోడ్డుమీద స్టాపుసైను వచ్చింది. అదేలెండి నేను ఆ సైనుదగ్గరకొచ్చేను. చుట్టూ ఎక్కడా నరవాసనా, కారువాసనా లేదు. క్షేమమే అనుకుని నేను తృటికాలం బ్రేకుపెడలు తొక్కి వదిలేసాను.

ఇందాకా చుట్టూ ఎక్కడా కారూ, నరులూ లేరన్నానా. Wrrrrrrroong. నేను అలా సవిలాసంగా సాగిపోతుండగా, పొలోమని పోరు పెడుతూ పోలీసుకారు తగులుకుంది కుప్పించి ఎగయు కొదమసింగమువోలె.

సరే మర్యాదగా నాకారు పక్కకి తీసి, నన్ను దాటిపోతున్న కారులబారులు తిలకిస్తూ, నన్ను ఎవరు గమనిస్తున్నారో చూస్తూ కూర్చున్నాను.

పోలీసాయన నెమ్మదిగా నాకారు దగ్గరకొచ్చి, ''అల్లక్కడెక్కడో, అల్లప్పుడెప్పుడో నాలుగువందల గజాలవెనక నువ్వు ఆపలేదు తెలుసా?'' అన్నాడు.

నేను మర్యాదగా ''ఆపేను'' అన్నాను.

''ఆపలేదు''

''ఆపేను''

ఇలా ఇద్దరం మూడుసుట్టులు వాగ్ గిరికీలు కొట్టేక, ''నేను వెళ్లి నీ రికార్డు చెక్ చేస్తాను. వేరే టికెట్లుంటే, మరోటిచ్చుకుంటాను'' అన్నాడు.

సరేనన్నాను.

ఆ శిక్షకభటుడు పదినిముషాలతరవాత వచ్చి, ''నీ లైసెన్స్ ప్లేటు జీవితం ముగిసిపోడానికి నెలరోజులుంది తెలుసా?'' అన్నాడు.

''ఇంకా నెల రోజులుంది కదా'' అన్నాడు.

''నీ డ్రైవింగ్ లైసెన్స్ త్వరలోనే రిన్యూ చెయ్యాలి'' అన్నాడు.

''అది చెయ్యడానికే వెళ్తున్నాను''.

''సరే. జాగ్రత్తగా వెళ్లు. నీమంచికే చెబుతున్నాను'' అనేసి వదిలేడు నక్షత్రకుడు.

అలా వుంటుందన్నమాట పోలీసుల్తో నాదోస్తీ.

ఇలా చీటికీ మాటికీ పోలీసులు నన్ను ఆపేస్తూండడం, నామంచికేనని నాకు నచ్చచెప్పడం జరుగుతూ వచ్చింది కొంతకాలం. ఆతరవాత ఒకరోజు ఓ నోటిసు వచ్చింది పోస్టులో. సరే వీళ్లదాడి రోడ్డుమీదే కాకుండా ఇంటిమీద కూడానా అనుకుంటూ తీసి చూశాను.

నేను “ఫలానారోడ్డుమీద ఉదయం ఏడున్నరకి ఫలానాస్కూలుముందు నీతికి మించిన స్పీడులో వెళ్తున్నాననీ, ఇది మొదటినోటీసుగా గ్రహించవలసిందనీ, మరోసారి చేస్తే ఫైనులు, పాయింటులు లాంటివి వచ్చుననీ ...”

అది చూసి, హాహా హోహో అంటూ పడీ పడీ నవ్వుకుని, “దొరికాడురా మిడతంభొట్లు” అని మురిసిపోయి, ఆతరవాత లేచి కూర్చుని, సీరియస్‌గా ఘాటుగా జవాబు రాసేసేను ఆ డి.వో.టి. వారి దివ్యసమ్మొహాలకి.

“ఫలానారోజున ఏడున్నరకి అసలు నేను ఫలానా కానీ మరో రోడ్డుమీద కానీ లేను. నా వుద్యోగం ఫలానా కాలేజిలో తొమ్మిది గంటలకి మొదలవుతుంది. నేను ఎనిమిది ముప్పావుకి బయల్దేరుతాను మాయింటినించి. కావలిస్తే నామాట ధృవపరుస్తూ మాడైరెక్టరునించి ఎఫడెవిట్ తెచ్చి సమర్పించుకోగలను. ఇంకా అసలు చివరిమాటగా నావిన్నపము - ఇదంతా చూస్తుంటే మీరు నన్ను ప్రొఫైలు చేస్తున్నట్టు కనిపిస్తున్నారని అనిపిస్తోంది. నిజానికి అది నిజమేనని నేను గట్టిగా నమ్ముతున్నాను.” ☺ ☺.

ఇది జరిగి అయిదేళ్లయింది. లైసెన్స్ ప్లేటు మళ్లీ రిన్యూ చేసే టైమవుతోంది. కిందటేడు వచ్చిన స్టికరే ఇంకా అంటించలేదు నేను. పోలీసులముందునించి దర్జాగా, రాజెవరికొడుకు అన్నంత ధీమా వెళ్లిపోతున్నాను రోజూ. ఏ పోలీసూ నడిరోడ్డుమీద మళ్లీ నన్ను నిలవేయలేదెప్పుడూను.

అయ్యో రాతా, నేను హైవే డ్రైవింగు ఎందుకు చెయ్యనో చెప్పబోయి మరేదో చెప్పేసినట్టున్నాను. ఏంటో... పెద్దతనం వచ్చేస్తోందని ఇలాటప్పుడే అనిపిస్తుంది. ☹

అన్నట్టు నా పలుకు వజ్రపుతునక కథకి ప్రేరణ ఇలాటి అనుభవాలే. నావి కాకున్న నాదు స్నేహితురాలివి.

(14 సెప్టెంబరు 2008.).

# 18. అభిమానాలకి కొలమానాలు

అమెరికాలో పెద్దపండుగ క్రిస్మస్. థాంక్స్‌గివింగ్ కూడా పెద్దదే కానీ క్రిస్మస్‌కి హడావుడి ఎక్కువ. ఎందుకంటే చలికాలం వచ్చేసుంటుంది కదా అప్పటికి ముమ్మరంగా. మంచూ, చలీ, ... చెత్త పారేయడానికి గడప దాటాలన్నా పులివేషం వేసినట్టు కోటూ, బూటూ తొడగడానికే ముప్పావుగంట ముస్తాబు కావాలి. ఉజ్జోగాలున్నవాళ్లు కనీసం ఆవంకనైనా వీధిన పడతాలు కానీ నాలాటి నిక్షేపరాయుళ్లకి ఇంట్లో వున్నా బాధే, వీధిలోకెళ్లినా బాధే.

ఇంతకీ పండుగ మాట. అదే ఎండాకాలంలోలా ఉన్నపాళాన లేచిపోలేం (సభ్యమానవ అర్థంలోనే) కనక పార్టీలూ అవీ ఏదోవంక పెట్టుకుంటారు మనిషిమొహం కనిపించడానికి. నాకు మనిషిమొహం కనిపించదన్న చింత కన్నా కనిపిస్తే ఏం మాటాడాలన్న చింత ఎక్కువ. అంచేత నేను ఈపార్టీలకి వెళ్లడానికి ఇష్టపడను. కానీ ''నేను రాను మొర్రో'' అన్నా వాళ్లు వదిలిపెట్టరు. ''అలా ఒక్కదానివీ ఇంట్లో కూచుంటే డిప్రెషనో ఏదో వచ్చేసి, ఆత్మహత్య చేసుకోడమో, మరొకర్ని హత్య చేయడమో చేసేస్తాన''ని వాళ్ల బెంగ.

''నీకు వీలయినప్పుడే వచ్చి కనీసం మా చెట్టు అలంకరణ చూసి పో'' అంటారు. అలా ఓసారి మా పక్కింటావిడ పిలిస్తే వెళ్లేను. ఆవిడ వీరకాథలిక్కు అంటే మన వీరఛాందసులలాగే అన్నమాట. ఎన్ని అభ్యంతరాలు చెప్పినా ఆవిడ ఆతిథ్యం స్వీకరించేవరకూ వదిలిపెట్టదు. మొదటిసారి వాళ్ల క్రిస్ట్‌మస్ చెట్టుఅందాలు చూడడానికి వెళ్లేను ఆవిడ చెప్పినట్టు పార్టీరోజు కాకుండా మర్నాడు. ఇద్దరమే కనక సంభాషణ అంతా ఆవిడ కాపురానికి వచ్చిందగ్గరునించి ఆచెట్టు అలంకరణలు - ఏ వస్తువు దేనికి గుర్తో చెప్పుకొచ్చింది. నేను ఓపిగ్గా రెండున్నర గంటలసేపు విన్నాను ఆ కథలన్నీ.

ఆ మరుసటేడు, పార్టీ వేళకే వెళ్లేను మిగతావారుంటారు కనక తెరిపి ఉంటుందేమోనని. దాదాపు పదిమంది వచ్చేరు పార్టీకి. అందరూ నాకు కొత్తే. బిక్కు బిక్కుమంటూ సోఫాలో ఓమూల నక్కి కూర్చున్నాను. వాళ్లంతా ఆ ఇంటిఇల్లాలి హార్ట్‌ఎటాక్ మిత్రులు. అంటే ఆవిడకి హార్టెటాకు వచ్చి నయం అయిపోయిన తరవాత, మళ్లీ రాకుండా వ్యాయామాలు చేసేటప్పుడు జిమ్‌ఖానాలో కలుసుకునేవాళ్లన్నమాట. అలా ఆ శుభవేళ నేను కలిసిన వారంతా హార్టెటాకు బృందం, వారంతా తమ ఆప్తకుక్కలని కూడా తీసుకొచ్చారు.

ఇహ ఆరోజు సంభాషణలన్నీ గుండెజబ్బులూ, ముద్దుకుక్కలూ అని వేరే చెప్పక్కర్లేదు కదా. నేనేమో ఆ రెండూ లేని నిర్భాగ్యురాలిని. ఆమాట చెబితే, ''హా, నీకు గుండెజబ్బులేదూ'' అని ఆశ్చర్యపోయి, పోనీ

ఓకుక్కనైనా పెంచుకోమంటూ కుక్కని ఉంచుకోడంలోని లాభాలు యాకరువు పెట్టడం మొదలెట్టింది నాపక్కన కూర్చున్నావిడ.

పోనీ అదేదో విజ్ఞానదాయకంగా వుంటుందేమో అంటే అదీ లేదు. కుక్కల వంశక్రమాలూ, వాటికి రాగల జబ్బులూ, తీసుకోవలసిన జాగ్రత్తలూ చెప్పుకొస్తుంటే పండుగపూటా ఇదేం కచేరీరా తండ్రీ, అనిపించింది నాప్రాణానికి. కుక్కకల్చరు తెలుసుకోవాలని నాకెంతో వుత్సాహం వున్నట్టు నటించడం ఎంత కష్టమో నాకాపూట విదితమయింది. ఇంటికొచ్చి చెంపలకి కాపడం పెట్టుకోవాల్సొచ్చింది.

నేనేమో అంత పాట్లూ పడితే ఆవిడేమో అంత ఉపన్యాసం అయింతరవాత, "ఆమాత్రం తెలీదా అన్నట్టు" నావేపు ఓ చూపు విసిరి, గిరుక్కున అటువేపు తిరిగిపోయింది. నాకలా తొలిసారి గొప్ప అవుమానం అయిపోయింది.

ఇంక రెండో సారి బహుమతి ప్రదానసమయంలో. ఏదో ఇచ్చిపుచ్చుకోడాలు. ఇందులో తరతమ భేదాలు అంచనా వేసే తీరు చూస్తుంటే తిక్క లేనివారికి కూడా తిక్క పుట్టుకువస్తుంది నన్నడిగితే. ఎవరూ అడగరనుకోండి. అది వేరే సంగతి.

ముందస్తుగా, ఎవరు ఎవరికి ఏం ఇచ్చారో సుమారుగా ఊహించుకోడంతో మొదలవుతుంది. ఆతరవాత ఒకొకరే తమ పొట్లాలు విప్పుతారు. అదేం మాయో నాకు తెలీదు కానీ ప్రతి పిల్లవాడికీ ఖచ్చితంగా పక్కవాడికిచ్చిన బహుమతే నచ్చుతుంది. కానీ పెద్దలలా కాదు. బహు మర్యాదగా తాను పొందిన బహుమతికోసం తపస్సులు ధార పోస్తున్నామని చెప్పి, హర్షం వెలిబుచ్చి, ఇచ్చినవారిని మెచ్చుకుని, తాము తరించి, వారిని తరింపజేస్తారు.

"పుచ్చుకుంటే ఇచ్చుకోవాలి" అన్నది నారూలు. కానీ నాకా స్తోమతు లేదు. నెత్తిన డాలరు పెట్టి వేలంవేస్తే డైముకి చెల్లన్నేను. వాళ్ల స్థాయికి తగినట్టు నేనెక్కడ తేను. అంతేకాదు, నన్ను బాధించే మరో విషయం నాకు అవసరం లేని వస్తువులు ఈ బహుమతులపేరున పోగుపడడం. నాకు అది కూడా ఇష్టం వుండదు. అవి నాకు గుండెలమీద కుంపటిలాటివి. వాటిని వదిలించుకుంటే కానీ నిద్దర పట్టదు నాకు. అంచేత "నేను ఇవ్వను, మీరు నాకు ఇవ్వకండి" అంటాను. కానీ నామాట ఎవరూ వినిపించుకోరు. ఏదో ఇచ్చి తీరుతారు. పైగా "మీరు ఇవ్వక్కర్లేదులెండి" అంటారు. అది నాకు ఇంకా అవమానం. "పోనీ ఇంకెవరికైనా ఇచ్చేయండి" అని మరో సలహా కూడా ఇచ్చేస్తారు ఉచితంగా. ఎందుకింత అవస్థో నాకు అర్థం కాదు.

ఆ రెండోసలహా విని, ఓసారి నాకు వచ్చిన స్వెటరు నొంతడబ్బాలో - అంటే అది వచ్చినపెట్టెలో అట్టే పెట్టి వుంచేను. తరవాత వచ్చిన కష్టాలు చెప్తాను, వినుకోండి.

ఎవరు ఏం ఇచ్చారో గుర్తు పెట్టుకోవాలి. వాళ్ల స్నేహితులెవరో కూడా తెలుసుకుని గుర్తు పెట్టుకోవాలి. ఉదాహరణకి ''స'' గారు నాకు ఓ చెప్పులజత ఇచ్చేరనుకోండి. నేను అవి దాచిపెట్టి పైయేడు ''రి''గారికి ఇచ్చాననుకోండి. ఇందులో రెండు బాధలు. మొదట ''రి''గారికి ఫాషను మారిపోయిందనీ, ఇవి ఈ యేడు ఫాషను కాదనీ, అంచేత రిసైకిల్డ్ అనీ తెలిసిపోతుంది. రెండు, ''స''గారూ ''రి''గారూ స్నేహితులని నాకు తెలీదు. ''స''గారు ఇచ్చిన చెప్పులే నేను ''రి''గారికి ఇచ్చేనని, అందువల్ల నామీద ''స'' మరియు ''రి'' గారలిద్దరికీ కోపం వచ్చిందని ''గ''గారిద్వారా నాకు తెలుస్తుంది. ఇంకా నాఅదృష్టం బావుంటే, నాకు నాపాత స్నేహితురాలు ''మ'' గారు ఇచ్చిన స్వెటరు, ఆవిడకి ''ప'' గారు మూడేళ్లకిందట ఇచ్చినదే అని కూడా అర్థం అవుతుంది.

ఆతరవాత నా-ప-ని-స-రి, నీ-ప-ని-స-రి అని పాడుకోవాల్సొస్తుంది నాకు. అదీ రిసైకిలింగువల్ల వచ్చే సంగీతం.

(14 నవంబరు 2008.)

# 9. పుస్తకం కొనడ౹వా? ఎక్కడా విన్లేదు, చోద్యం!

ఎరువిచ్చిన బుక్కు

తిరిగి చూడ్డం గొప్ప లక్కు

అన్నారు ఆరుద్రగారు.

అలాటిదే మార్క్ ట్వైన్ కథ ఒకటి వుంది. వాళ్లింట్లో బోలెడు పుస్తకాలు వున్నాయిట. అది చూసి ఆయన స్నేహితుడు, ''ఇన్ని పుస్తకాలు కొన్నావు. షెల్ఫులు కూడా కొని పొందిగ్గా అమర్చుకోవచ్చు కదా'' అన్నాట్ట.

''పుస్తకాలు ఎరువిచ్చేరు కానీ షెల్ఫులు ఎవరూ ఎరువియ్య లేదు మరి'' అన్నాట్ట మార్క్ ట్వైన్.

మరో సంస్కృత నానుడి - వనితా, విత్తమూ, పొత్తమూ ఎరువిచ్చిన తిరిగి వచ్చుట జరగదు. జరిగినా చివికి, ఛండాలమయి వస్తాయి అని. దీని మూలం నాకు తెలీదు కానీ ఇందులో విత్తమూ, పొత్తములతో వనితని పోల్చడం బాగోలేదు. ప్చ్. ఆసంగతి తరవాత చూద్దాం.

తెలుగువాళ్లకి పుస్తకాలు కొనే అలవాటు లేదు. మీరు కొంటే, కొన్నానంటే, ''హా? ఏవిఁటీ పుస్తకఁవా? కొన్నారా? నిజంగానే? డబ్బెట్టే? పోదురూ, మీరూ మీజోకులూనూ.. పుస్తకాలు కొనడం ఏఁవిటండీ? ఎవరిదగ్గరయినా ఎరువు తెచ్చుకు చదివిచ్చేస్తే పోలే, తిరిగి ఇవ్వకపోయినా ఫరవాలేదు లెండి, మనవాళ్లేం అనుకోరులెండి. చదివేసింతరవాత వాళ్లు మాత్రం ఏంచేసుకుంటారు? కూరొండుకుంటారేఁవిటీ ... హ హ .... అయినా ఇప్పుడు నెట్‌లో కాణీ ఖర్చు లేకుండా అన్నీ చదువుకోవచ్చు కదా ..''

ఆ వాక్ప్రవాహానికి అడ్డు పడుతూ ఎలాగో సందు చేసుకుని, ''ఇది కొత్త పుస్తకంవండీ. నెట్‌లో దొరకదు'' అంటాననుకోండి.

''నాల్రోజులాగితే అదే దొరుకుతుంది. లేపోతే మరోటి చదువుకోండి. ఏం పోయిందీ.''

''కంప్యూటరు మాఇంట్లో లేదండీ''

''దాన్దేవుందీ, ఆఫీసుకెళ్తారు కదా, అక్కడ చదువుకుంటే పాయె ... హ హ.''

అచ్చంగా ఇవే వాక్యాలు కాదు కానీ కొందరి ధోరణీ, ప్రవర్తనా, మాటతీరూ చూస్తుంటే నా బుర్రలో ఇలాటి వాక్యాలు పుడతాయి. మనవాళ్ల పఠనాభ్యాసాలు ఎలా వుంటాయో చెప్పమంటారా? మన వాఙ్మయం

ముఖతః అనుశ్రుతంగా వచ్చింది కదా. అంటే పాడుకుంటూ, ఆడుకుంటూ, పనిపాటలు చేసుకుంటూ కథలు చెప్పుకునేవాళ్లు మన పూర్వులు. ఆ తరవాతికాలంలో రాతిమీద చెక్కడాలూ, తాటాకులూ, మూసలూ, కాయితాలూ .. సాగుతూ వచ్చి కాలక్రమంలో పుస్తకాలుగా అవతరించేయి. దరిమిలా పుస్తకాలు కొనుక్కుని లైబ్రరీలు సృష్టించుకోవడం నాగరీకం అయిపోయింది.

మీకు తెలుసా, ఒకప్పుడు ఇంగ్లండులో ఇంటింటి గ్రంథాలయం ఎంత నాగరీకం అయిందంటే, బైండు చేసిన పుస్తకాలు కంటికి నదురుగా కనిపించేట్టుగా చూపులకి మాత్రమే పనికొచ్చే బైండింగు చేయించి లైబ్రరీలో అలంకరించుకునేవారుట. వాటికే లైబ్రరీ ఎడిషన్ అన్న పేరు వచ్చిందిట.

ఇంతకీ పుస్తకాలంటే మార్కెట్లోకి వచ్చేయి కానీ పుట్టుకతో, పరంపరానుగతంగా వచ్చిన మనస్తత్త్వాలు ఎలా పోతాయి? పోవు. చచ్చినా పోవు. విచ్చు రూపాయలిచ్చి బుక్కులు కొనటానికి మనసొప్పదు. ఒకవేళ కొంటే అణా పైసలతో వాటి విలువ రాబట్టుకుంటాం. ఎలా అంటే. అసలు ఇంట్లోనే మొదలవుతుంది. ఒక నవలో, కథాసంకలనమో, వారపత్రికో కొన్నాం అనుకోండి. సాధారణంగా మన ఇళ్లలో పెద్దబ్బాయీ, కోడలితోపాటు పాటు, అక్కచెల్లెళ్లూ, అన్నదమ్ములూ, వారి తల్లిదండ్రులూ వెరసి పదిమంది వుంటారు. అందులో కనీసం అక్షరమ్ముక్కలొచ్చినవాళ్లు ఆరుగురనుకుందాం. వారిలో అమ్మాయిలందరూ తప్పక చదువుతారు. అబ్బాయిలు రహస్యంగా చదువుతారు. (ఇది నా కల్పన కాదు. ఈమాట.కామ్‌లో వేలూరి నాపుస్తకంమీద రాసిన సమీక్షలో రాశారు. నాబ్లాగులో మరోచోట రాజేంద్ర కుమార్ కూడా ఇలాటిమాటే అన్నారు). అంచేత ఇక్కడ ఆరుగురికి ఆరుగురూ అని లెక్క వేసుకుందాం. ఆపైన ఇరుగూ పొరుగూ .. వాళ్లఇళ్లలో కూడా అంత జనాభా వుంటారు కానీ మన లెక్కలకీ మూడే వేసుకుందాం. అంటే ఒక పుస్తకం గానీ ఒక పత్రిక గానీ ఒకరు కొంటే కనీసం తొమ్మిదిమంది చదువుతారన్నమాట.

నాకిప్పటికీ జ్ఞాపకమే. నా యస్సెల్సీ రోజుల్లో నాలుగువీధులఅవతల మాదొడ్డమ్మగారి కొత్తకోడలు కాపరానికి వచ్చింతరవాత నాకు అదో వుద్యోగం అయిపోయింది. నేను కొన్న పత్రిక వాళ్లింటికి తీసుకెళ్లి ఇవ్వడం, ఆవిడ కొన్న పత్రిక నేను తెచ్చుకోడమూను. తమాషా ఏమిటంటే మా దొడ్డమ్మ రోజూ మాయింటికి వచ్చేది మాఅమ్మతో బాతాఖానీకి. అయినా ఈ పత్రికల బట్వాడా మాత్రం నా ఉజ్జోగమే!

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, న్యూయార్క్ బెస్ట్ సెల్లర్ లిస్టులాటిది మనకి లేదు కానీ వున్నా దాన్ని మనం వర్తింప జేసుకోలేం. అది మన తత్త్వాలకి సరిపడదు. మన దేశంలో ఎన్ని పుస్తకాలు అమ్ముడయేయి, ఎంతమంది చదివేరు అన్నవి పరస్పర ఆశ్రితాలు కావు.

నాలాటి జనాలు కొందరయితే ఎప్పుడోఅప్పుడు చదివితీరాలి అనిపించే పుస్తకాలు కనిపిస్తే, మళ్లీ దొరకవేమో అన్న యావతో కొని పెట్టేసుకుని, భవిష్యత్తులో ఇది నేను చదివేరోజు రాగలదు అని ఆశిస్తూ రోజులు

గడిపేస్తాం. కొన్నా నిజంగా చదవలేదు కనక పైన చెప్పిన సిద్ధాంతం - అంటే కొన్నవారిసంఖ్యకీ చదివినవారి సంఖ్యకీ సఖ్యత లేదన్న వాదన - ఇక్కడ కూడా వర్తించును! అదన్నమాట కథ.

ఆతరవాతేఁవైందీ ....

ఇలా ఇచ్చిపుచ్చుకోడాలు జరుగుతుండగానే, ప్రచురణాలయాల్లో పాలసీలు మారిపోయి, రచయితలు సొంతంగా అచ్చేసుకోడం మొదలయింది. సొంత ఖర్చులు పెట్టుకోడం కనక మామూలుగా వేసే 1000 కాపీలకి బదులు 500 కాపీలే వేసుకుంటున్నారు. అసలు ఇవైనా ఎలా పోతాయో చూద్దాం అని. అయిదు వందలని మాటవరసకి అన్నా, మూడు వందలే నిజంగా వెయ్యడం జరుగుతుంది. ఆ మూడు వందలూ వదిలించుకోడానికి పడే అవస్థలు చూడండి.

సమీక్షలకి కొన్ని కాపీలు పోతాయి. పుస్తకావిష్కరణ మహోత్సవాలు జరపినప్పుడు కొన్ని పంపిణీ అయిపోతాయి.

అమ్ముకోడంలో తొలిమెట్టు మొహమాటాలున్నచోట మొహమాటపెట్టి కొనిపించడం. అలా కనీసం ఓ పదో ఇరవయ్యో, కాస్త చొరవ వున్నవాళ్లయితే యాభై వరకూ అమ్ముకుంటారనుకుందాం. నిజానికి దాంతో పెట్టుబడి గిట్టుబాటు కాదు. పంపిణీదారులకి ఒప్పచెప్తే, వాళ్లు మనపుస్తకం అమ్మడానికి భారీఎత్తున యత్నాలు చేస్తారన్న నమ్మకం లేదు. అమ్మిన కాపీలకి లెక్క చెప్తారన్న నమ్మకం అసలే లేదు.

అంచేత నిజజీవితంలో ఏం జరుగుతుందంటే, చేతిచమురు వదిలించుకు అచ్చేసుకున్న ఈపుస్తకాలు మీరా, మీరా అంటూ కనిపించినవారందరికీ ఉచితంగా పంచి పెట్టేయడం. నేను ఒకావిడని రెండు సార్లు కలిస్తే, ఆవిడ రెండు సార్లూ అదే పుస్తకం ఇచ్చేరు.

"క్రితంసారి వచ్చినప్పుడు ఇచ్చేరండీ ఇది" అన్నాను.

"పోనీ. ఇంకెవరికైనా ఇచ్చేయండి" అన్నారావిడ. ఆ రెండు కాపీలూ ఇప్పటికీ నాదగ్గరే వున్నాయి!

ఈ త్రీ-రింగ్ సర్కస్ ముగిసేక, ఇంకా మిగిలిపోతే (తప్పకుండా మిగులుతాయి) తూకం వేసి పచారికొట్లో ఇచ్చేసుకోవాలి. అన్నట్టు ఇప్పుడు ప్లాస్టిక్ సంచులు వచ్చేయి కదా. మరి ఇలా మిగిలినపోయిన పుస్తకాలూ పాత పత్రికలూ ఏంచేస్తున్నారో మనూళ్లో?

మరోమాట. నేను తెలుగు రచయిత్రులమీద ప్రచురించుకున్న పుస్తకానికి ఈ మెట్లు వర్తించవు. నాపరిస్థితి వేరు. ఇది కేవలం సాటి రచయిత్రులు నాతో అన్నమాటలకి టపారూపంగా మాత్రమే గుర్తించాలి

(16 నవంబరు 2008.)

# 20. చెత్త భ్రమణం

భూమి గుండ్రముగా నుండును.

భూమి తనచుట్టూ తాను తిరుగుతూ, సూర్యుడిచుట్టూ - దీర్ఘవృత్తంలోనే - తిరుగును.

మనం వస్తువులు పారెయ్యం. పారబోసేది వారబొయ్యమని సామెత.

పిల్లలు కంచాల్లో వదిలేసిన కూరలూ అన్నాలూ "అయ్యో పారేస్తామా" అంటూ తినేసేవారు తల్లులు. ఆ తరవాత వొళ్లు వచ్చేస్తోందని బాధ పడేవాళ్లు కూడా లెండి. ఇంకా మిగిలిపోయిన వంటకాలూ, పాతబట్టలూ పనివాళ్లకీ ముష్టివాళ్లకీ పారేసేవాళ్లు. నలుగురు పిల్లలున్న ఇళ్లలో చిన్నపిల్లలు సాధారణంగా అక్కయ్యల పరికిణీలకీ, అన్నయ్యల చొక్కాలకీ తిరుగులేని వారసులు.

చెత్తభ్రమణంలో అంటే మనం సృష్టించే చెత్తని తిరిగి మరోవిధంగా ఉపయోగించుకునే విధానంలో రెండు కోణాలు వున్నాయి. ఒకటి పైన చెప్పినట్టు ఎవరింట్లో వాళ్లూ, ఎవరిదేశంలో వాళ్లూ సద్వినియోగం చెయ్యడం. రెండోది పొరుగుదేశాలకి ఎంతో ఔదార్యంతో బట్వాడా చేసేయడం. అది కూడా చాలా తెలివితేటలతో.

అరవయ్యో దశకంలో అమెరికాలో గోధుమ ముమ్మరంగా పండింది. అప్పుడే వారిబుద్ధికి ఒక గొప్ప ఆలోచన తట్టింది. పొరుగుదేశాలని జయించాలంటే వాళ్లభాష నేర్చుకోవాలీ అని (ఇది మరో ఇంగ్లీషువాడు కనిపెట్టిన సిద్ధాంతం అని మనకి తెలుసు కదా. అంటే ఐడియా రిసైకిలింగు). దాంతో యూయస్ గవర్నమెంటాళ్లు యూనివర్సిటీలలో పరభాషలు నేర్పడానికి బోలెడు గ్రాంటులిచ్చేశారు (ఎ.ఐ.ఐ.యస్ సంస్థ పేరుతో). ఆ పరభాషా చదువులకోసం హడావుడిగా "మీరు ఇండియాలో ప్రచురించిన పుస్తకాలన్నీ మేం కొనేస్తాం" అని లైబ్రరీ ఆఫ్ కాంగ్రెసు ఆఫీసొకటి ఢిల్లీలో పెట్టేసి పుస్తకాలన్నీ పోగేయడం మొదలెట్టారు.

చెత్తభ్రమణం అని కదూ మొదలు పెట్టేను. వస్తున్నా అక్కడికే.

మన పుస్తకాలు కొనడానికి వాళ్లు విచ్చుడాలర్లు ఇచ్చే ఉద్దేశంలో లేరు. "మాకు మిగిలిపోయిన గోధుమలు మీకిచ్చేస్తాం అప్పుకింద. వాటికి బదులు మీ పుస్తకాలు మాకు పంపించండి" అని బార్టరింగు చేసేరు. దీనికే "ఇండియా వీట్‌లోన్ ప్రోగ్రాం" అని పేరు. అలాగే పాలపొడి కూడా. పశువులమీద తెగ రిసెర్చీలు చేసేసి, పాలు ఉధృతంగా ఉత్పత్తి చేసేసి, దిక్కుమాలిన దేశాలకి రవాణా చేసేసేరు తమ హృదయాల్ని సహారా ఎడారి అంత వైశాల్యం చేసేసుకుని.

మన భూగోళంచుట్టు తిరిగే తదితర చెత్తభ్రమణాలు ఐడియాల రూపంలో …

విస్తరాకులు పోయి కాయితపు కంచాలొచ్చేయి.

ఎక్కడినించీ? అమెరికానించే

గుడ్డసంచులు పోయి ప్లాస్టిక్ సంచులొచ్చేయి

ఎక్కడినించీ?

కుండల్లోనూ కూజాల్లోనూ మంచితీర్థం పోయి, సీసాలొచ్చేయి.

ఎలా అనుకున్నారూ?

మరి కొన్నాళ్లకి, ఇలా కాయితాలు పళ్లేలకి వాడితే చెట్లు నాశనమయిపోతున్నాయి అంటూ రివర్స్ ఆలోచనలు చేయడం మొదలయింది అమెరికాలో ఈమధ్యనే. వృక్షములను రక్షించవలె అంటూ తానతందానా మొదలయింది.

అమెరికాలో నీళ్లసీసాల వాడకం తగ్గిద్దాం అంటున్నారు. ప్రతి సీసా కొనుక్కునే బదులు అదే సీసాలో కుళాయి నీళ్లు నింపుకు తాగండి అని కూడా సలహాలిస్తున్నారు. రెస్టారెంటుల్లో సీసాలకి బదులు గ్లాసుల్లో నీళ్లు పెడుతున్నారు బల్లలమీద. ఎంత నవ్య నూతన ఐడియావో, హాహ్

ప్లాస్టిక్ సంచులు మానేసి గుడ్డ సంచులు వాడమంటున్నారు అమెరికాలోనే.

మనదేశంలో కూడా ఇప్పుడిప్పుడే అనుకుంటున్నట్టున్నారు అదే బాగుంటుందనీ!

మరో సంగతి. అమెరికాలో సంచులు కూడా మళ్లీ పెట్టుబడీవిధానంలో భాగమే. గుడ్డసంచులు వాతావరణానికి ఆరోగ్యం అన్న నెపంతో ప్రతి షాపువాడూ తనషాపుపేరు అచ్చొత్తించిన సంచీలు - వూరికే ఇవ్వడం కాదు - అమ్ముతున్నారు. సంచీమీద లాభం. ఆ సంచీమీద ఆషాపు పేరుంటుంది కనక అది మరొక ప్రచారసాధనం. అవి చూస్తే నాకు చిన్నప్పుడు ఫలానావారి ధర్మం అంటూ ముష్టివాళ్ళచొక్కాలమీద అచ్చొత్తించే దాతలపేర్లు గుర్తొస్తున్నాయి.

"ఈపూట వంటకి ఇంట్లో కూరల్లేవు. బజారుకెళ్లి నాలుగు వంకాయలు తీసుకురండి" అని అమ్మ చెప్తే, పైపంచె దులిపి బుజాన వేసుకు, చెప్పులేసుకుని, "ఆ చేతిసంచీ ఇలా తే" అని గుడ్డసంచీ అందిపుచ్చుకు బజారుకి బయలుదేరే నాన్నలు మళ్లీ కనిపించకపోవచ్చు.

ఆలోచిస్తే విస్తరాకులకున్నంత రిసైకిలింగుపవరు మరే వస్తువుకీ లేదనిపిస్తోంది. చెట్లనుంచి తీసుకున్న అడ్డాకులు విస్తరి కుట్టుకుని, వాటిల్లో భోంచేసి, పారేస్తే, నోరు లేని పశువులు మేస్తాయి. మళ్లీ వాటి పేడ పిడకలు పొయ్యిలోకి పనికొస్తాయి గాస్ పొయ్యిలు కొనుక్కోలేనివాళ్లకి. అలా అన్నం వొండుకుని ఆకుల్లో తిని .....

ఏంటో ... ఇలా ఆలోచిస్తూంటే నాకు ఈ చెత్తభ్రమణం నిజంగా కనిపెట్టింది మనమే అనిపిస్తోంది. ఏ అమెరికన్ కంపెనీ అయినా ఓ విస్తరాకుల కంపెనీ, ప్రారంభించగలరేమో కనుక్కోవాలి .....

(గమనిక. ఈ టపా నాబ్లాగులో పెట్టిన తరవాత ఒక వ్యాఖ్యాత రాసేరు ఆ విస్తరాకుల వ్యాపారం కూడా వచ్చేసిందని!)

(20 నవంబరు 2008. )

## 21. చెత్త క్షోభ

చెత్తభ్రమణం టపాతో ఈ సీరీస్ ముగించేద్దాం అనుకుంటుండగా, నిన్ననే మరోసైటులో ప్రచురించిన ఓ వాఖ్య నాకళ్ల బడింది.

"అమెరికా, అమెరికా అంటూ చెత్త రాసింది మూర్ఖురాలు" - నాచెత్తభ్రమణం మీద ఓ చిన్నవాడి చిత్తక్షోభ ఇది!

అపార్థానికి తావులేదులెండి. నా చిత్తభ్రమణం టపాకి లింకిచ్చారు. కాగా నాకు ఒరిగిందేమిటంటే మరో పది హిట్లు అధికంగా తగిలేయి. అందుచేత ఆ చిన్నవాడికి, ఆ సైటు నిర్మాతకి ఇవే నా కృతజ్ఞతలు.

రమణి తన బ్లాగులో రాసినట్టు కొందరు అనామక నామధేయాలతో వ్యాఖ్యలు మనబ్లాగుల్లో పెడితేనూ, పెట్టడానికి ప్రయత్నిస్తేనూ, మరికొందరు వేరే సైటుల్లో రాసుకుంటారు. ఆ కుర్రవానిధర్మమా అని నాకు మరోటపా రాయడానికి మరో సరుకు దొరికింది. హీ హీ.

ఆలోచిస్తుంటే నాకు కలిగిన రెండు సందేహాలూ, ఒక అనుమానం కలిగేయి. చెప్తాను.

నా ఐక్యూ చాలా "లో" అని నాలో నేనే కాక మీలో ఎవులోనా అనినా ఒప్పేసుగుంటాను. అయితే ఈ "చెత్త భ్రమణం"లాటి పదాలు నాబుర్రలో పుట్టడం నా మూర్ఖత్వం మూలానే అనుకోవాలా? ఇది మొదటి సందేహం.

రెండోది - ఈ చెత్త రాయడం నా మూర్ఖత్వంచేతే అనే అనుకుందాం ఈ చర్చకోసం. నాకు అర్థం కాని సంగతి ఆ కుర్రవాడు పైన రాసిన అభిప్రాయంతో పాటు ప్రకటించుకున్న తన మేధాసంపత్తి. "ఇలాటివి చదివే నేను అమెరికా చెత్త కాబోలు అనుకుని ఇండియా వెళ్లిపోయి... " అంటూ రాశాడు. అదీ నాకు ఆశ్యర్యం అయింది. ఇక్కడే నాకు తికమకగా వుంది. నాలాటి మూర్ఖులు రాసిన బ్లాగులు చూసి తమ జీవనసరళికి సంబంధించిన అతిముఖ్యమైన నిర్ణయాలు చేసేసుకునేవారు వున్నారంటే ఆశ్చర్యంగా లేదూ!

ఈ ఆలోచనలతో నాతల వేడెక్కి చిన్న మగతనిద్ర పట్టినట్టుంది. "ఏటి సిన్నమ్మా! బెగులెట్టుకు కూకుడుండిపోనావు" అంటూ సంద్రాలు నవ్వుతూ ప్రత్యక్షమయింది.

నిట్టూర్చి, నేనెంత ఘోరమైన పస్జేసేనో చెప్పేను సంద్రాలుకి, "ఇలా వుర్దిలోకి రావాల్సిన ఒక సిన్నోడు పాపం నాకత చదివి ఛస్ 'ఇది కాదు సొరగం అదీ, అది కాదు సొరగం ఇదీ' అనుకుంటూ ముందుకీ వెనక్కీ తిరుగుతున్నాడంట ఇండియాకీ అమెరికాకి మధ్యన" అని చెప్పి ఆ పాపం నాదేనని చెప్పాను చెప్పలేనంత బాధతో.

"అవుతే మరేటి సేస్తవు?" అనడిగింది సంద్రాలు.

"ఏవుందీ. ఇహ మీద ఆ రిసెర్చిలేవో నేనే జేసేసి, ఎవరు ఎక్కడ బతకాలో, ఎవరెలాటి ఉజ్జోగాలు చూసుకోవాలో, ఏం తినాలో అన్నీ నేనే నిర్ణయాలు చేసేస్తూ రాసేస్తాను."

గఁయ్యిమని లేసింది సంద్రాలు, "నీకేటి మతి పోనాదేటి. ఆయనెవురో బుద్ధి బుగ్గయి నీకతల్ల అవుపిచ్చిన మాటలట్టుకుని దేసిం ఎల్లిపోనాడా? మాపటేల మరో యమ్మ విసాపట్టంవెల్లి సేపలమ్ముకోమంటాది. వుంకో బాబు ముంబయెల్లి సినిమాల్లో సేరిపో అంతడు. ఈ పెద్ద పెద్ద సదూలు సదూకున్న బాబు ఆలమాటా ఈలమాటా యినుకుంటా బొంగరంల్ల తిరగతడా? ఆయన సదూకున్న సదూలేటయిపోనాయీ? 'నాను సదూకున్నాను, నానెక్కడుండలో, ఏటి సెయ్యాలో నాకు తెలవాల' అని ఆబాబుకుండాల గానీ నీమాటా నీమాటా ఇనుకుంటా ఎంతదనిక ఎల్తడు? ఇనాల్నుంటే ఆలెవరో కవున్సిలీరున్నరు గంద. ఆల్నడగాల. రెండొందలుచ్చుకుని నీకు ఏది బాగున్నదో అది సెయ్యి అన్సప్తరు. జలుబొదిలిపోతది. అయినా దేసింలో వున్నడు ఆడికి తెలీదేటి దేసిం ఎలాగున్నదో. నివ్వు సెప్పేదేటి. ఆరి యవ్వారం ఆరిది. నీ యవ్వారం నీది. " అంది.

"అంతేనంటావా" అన్నాను ఆమాత్రం దన్ను దొరికినందుకు గుండె కూడదీసుకుని. "ఆహా, మరిగంతే" అనేసి సంద్రాలు మాయమయిపోయింది.

ఇంకా ఆలోచిస్తూనే వున్నాను. ఇది థాంక్స్‌గివింగు వారం. అమెరికా (అదుగో, చూశారా మళ్లీ అమెరికా అని వచ్చేస్తోంది1 ప్చ్), అధ్యక్షులవారు ఒక సీమకోడిని క్షమించేసి, ఆకాశంలోకొదిలీసి, మరో సీమకోడిని కోసుకు తినే శుభదినం. మరి నేను కూడా సాంప్రదాయం పాటించి అన్ని కోళ్లనీ సాధుభావంతో వదిలేయాలి. ఎలాగా కోడ్ని తినను కనక అన్నిటినీ గాలికొదిలేస్తే పోలే ...

క్షమ కవచము. క్రోధమది శత్రువు, జ్ఞాతి హుతాశనుండు, మిత్రము దగు మందు ... అన్నారు కదా.

అంచేత మరో వ్యాఖ్యోడి కత కూడా నా కవచానికి దృష్టాంతంగా చెప్తాను.

ఈమధ్య నేను ఇంగ్లీషులో రాసినపుస్తకం Telugu Women Writers, 1950-1975, మీద ఈమాట.కాంలో వేలూరి వెంకటేశ్వరరావుగారు సమీక్ష రాశారు. దానిమీద రెండు వ్యాఖ్యలొచ్చేయి - అది తెలుగులో రాసి వుండవలసిందని ఒకటి. నాకు తోచిన సమాధానం ఏదో నేను చెప్పుకున్నాననుకోండి. అందులో ఒకాయన నిజంగానే పుస్తకం చదివి మాటాడుతున్నట్టు కనిపించింది. బాగానే వుంది.

రెండో బుజ్జితండ్రికి మాత్రం పుస్తకం చదివే లక్షణమూ, ఓపికా వున్నట్టు కనిపించలేదు. కనీసం సమీక్ష కూడా సరిగ్గా చదవలేదు. నాకంటే తనకే ఎక్కువ "హై"క్యూ వుందని ఋజువు చెయ్యాలని కాబోలు హోరుమంటూ

మొదలెట్టాడు ప్రశ్నలజోరు. ఏదో ఓ వ్యాఖ్య రాసి పారేయడమే అతగాడిలక్ష్యమేమో మరి. పుస్తకం చదవనికాడికి అది తెలుగులో వుంటేనేమిటి స్వహీలీలో వుంటేనేమిటి? నాకు అర్థం కాలేదు.

ఈ ఉత్త (రాల) రచయితలు బాగా చదువుకున్నవాళ్లు, మంచి వుద్యోగాల్లో వున్నవాళ్లు. ఎందుకు ఇలా తమ అమాయకత్వాన్ని (మూర్ఖత్వం అంటే బాగుండదు కదా) పత్రికల్లో అంతర్జాలంలో ప్రదర్శించుకుంటారు.?

ఈమధ్యనే విన్నాను అమెరికా (మళ్లీ అమెరికా మాట! ☹) లోనే ఆటిజమ్ అన్న ఒక రకం మానసిక తత్త్వం అనుకుందాం. ఆలోపం వున్నవాళ్లలో కొందరు అతి చిన్నవిషయాలు - చొక్కా బొత్తాలు పెట్టుకోడంలాటివి చెయ్యలేరు. కానీ కొన్ని ఇతర రంగాల్లో, సంగీతం, చిత్రలేఖనంలాటి కళల్లో అద్వితీయమైన ప్రతిభ చూపుతారు. అయ్యో, నేను మనవాళ్లని ఆటిస్టిక్ అనడంలేదండీ. ఊరికే గుర్తొచ్చింది, చెప్పానంతే.

మనిషిమెదడు చాలా చిత్రమయినదిట. అందులో కొన్ని వేలో కోట్లో అరలుంటాయిట. ఆటిజమ్ వున్నవాళ్లలో జరిగేది ఏమిటంటే, ఒక భాగం పని చేసినట్టు మరొక భాగం పని చెయ్యదు. ఈ వాదన ఈ వ్యాఖ్యలాళ్లకి అన్వయించి చూచుకుంటే, కొందరికి తమ రంగాల్లో గొప్ప ప్రతిభావిశేషాలు చూపినా, వాఖ్యానాలు రాయడానికి కూర్చున్నప్పుడు వేపకాయంత వెర్రి kick in అవుతుందేమో.

పాఠకమహాశయులారా! నన్ను అర్థం చేసుకోరూ దయ చేసి. నేను కూడా ఆకోవలోకే రావచ్చు కీబోర్డు చేపట్టి ఇటువంటి  టపాలు రాయడానికి కూచున్న సందర్భాలలో.

చివరిమాటగా ఇందుమూలంగా చేరువయిన అభిమానులకీ, ఈటపాలవల్ల ప్రజ్వరిల్లిన చిరాకుతో నారచనా వ్యాసంగానికీ ముడిసరుకు సరఫరా చేస్తున్న పుణ్యమూర్తులకీ ధన్యవాదాలు.  ☺ ☺).

(26 నవంబరు 2008. )

# 22. చేపాటి కర్ర

తెల్లారిలేచి కాఫీకప్పు పుచ్చుకుని కిటికీలోంచి చూస్తున్నాను ఉప్పుపాతరల్లా పరుచుకున్న మంచుకుప్పలు. అమెరికా వచ్చి 35 ఏళ్లయింది. ఇదే తొలిసారి నాకు మంచుని చూస్తే కోపం రావడం. స..రీ…ష్టూ ఏడాదిక్రితం ఇదేవేళకి నాజీవితంలో జరిగిన రెండు మహత్తర సంఘటనలు -ఒకటి బ్లాగు తెరుచుకోడం, రెండోది చెయ్యి విరుచుకోడం. నాబ్లాగు (తెలుగుతూలిక) బాగానే సాగుతోంది. చెయ్యి చక్కగా పని చేస్తోంది. బాధల్లా పునః ప్రారంభమయిన మంచే. ఇంతవరకూ ఎప్పుడూ నాఅనుభవంలోకి రాని భయం ఈసారి ఈ మంచు కలిగిస్తోంది. ఇదివరకు చాలాసార్లే మంచులో జారి పడ్డాను. కానీ ఎప్పుడూ ప్రమాదాలు జరగలేదు. దానికి కారణం నేను పుడమితల్లికి అట్టే దూరం లేకపోవడమే. ఎలా కొలిచినా అయిదడుగులకి అరంగుళం తక్కువ. అంచేత నేను పడడం మొదలు పెట్టినతరవాత వెలాసిటీ పుంజుకునేలోపున పుడమితల్లి ఆప్యాయంగా ఆదుకుని బుజ్జగించి పంపేసేదన్నమాట. ఇప్పుడు కూడా భూమాత రిసెప్టివుగానే వుందనుకుంటాను కానీ నాలోనే భయదేవత గునుస్తోంది.

లచ్చిమి తనబ్లాగులో హైదరాబాదులో వీధిలోకి వెళ్లబోతే కలిగే రకరకాల భయాలగురించి రాసింది. నాకూ ఇప్పుడు వీధిలోకి వెళ్లాలంటే గుండెల్లో చిన్న వణుకు. బుర్రలో నూతనమార్గాల కోసం వేట. చాలామంది చాలా సలహాలు ఇచ్చేరు. "ఇల్లు కదలకు." "ఎక్సర్సైజు సైకిలు కొనుక్కుని నట్టింట్లోనే నడక సాగించు". "ఎక్సర్సైజు విడియో కొనుక్కుని టీవీలో చూస్తూ డాన్సు చెయ్యి". "షాపింగ్ మాలులుకి వెళ్లు. మాలులో ఎనిమిది ప్రదక్షణాలు ఒక మైలు" అని లెక్కలు కూడా చెప్పేస్తారు. ఇవేవీ నా తత్త్వానికి సరిపడవు. ఎందుకంటే, నేను రోజంతా ఇంట్లోనే వుంటాను కనక, నడక కూడా ఇంట్లోనే చేసేస్తే జైల్లో వున్నట్టు వుంటుంది. వీధిలోకి వెళ్లడానికి ముఖ్యమైన కారణం ఈ చెరనించి బయట పడడానికే కద. షాపింగుమాలులో కూడా నాలుగ్గోడలమధ్యే నడవడం కనక నాకు తృప్తిగా వుండదు. పైగా అలా మూసుకున్న భవనంలో తిరిగే జనాలవల్ల మరింత ఇరుగ్గా అనిపిస్తుంది. ఇంగ్లీషులో చెప్పాలంటే నో ఫ్రెష్ ఎయిర్ అన్నమాట. విడియోలు చూస్తూ డాన్సు చెయ్యడంగురించి నేనెందుకు చెప్పడం. మీరే ఊహించుకోండి.

ఇలా ఆలోచిస్తున్నాను. రెండు కప్పులు కాఫీ అయింతరవాత, మావీధుల్లో హిమాలయాలమీద విజయం సాధించే దారి కనిపించింది సాహసమున సమకూరు ధరలోన పనులు అని నాకు నేనే భుజం తట్టుకుని, మనసు చిక్కబట్టుకుని, అడుగులో అడుగు వేసుకుంటూ, ఒకొక కాలే ఎత్తెత్తి వేస్తూ, చాదస్తపు బ్రాహ్మడిలా.

బయల్దేరేను. ఎత్తెత్తి కాలేస్తే ఎంగిలాకుమీదే పడిందనీ సామెత. అలా జరక్కుండా చూసుకుంటున్నాను. ఎందుకంటే గడ్డ కట్టుకుపోయిన మంచుమీద పొడిమంచు బులబులాగ్గా పరుచుకుని నిరపాయకరంగా కనిపిస్తూ మోసం చేస్తుంది. ఇవన్నీ నాకెరికే. నెమ్మదిగా ఎత్తెత్తి కాలేస్తూ నడుస్తుంటే మామూలుగా పావుగంటలో చేరే దూరానికి ముప్పావుగంట పట్టింది. సరే నడక దృష్ట్యా నేను కవర్ చేసిన దూరం అట్టే లేకపోయినా ఫ్రెష్ ఎయిర్ పొందితిని కదా అని నన్ను సముదాయించుకున్నాను. నిజానికి ఫ్రెషెయిర్ ఏమిటిలెండి పక్కనించి పోతున్న కారులు ఎగ్జాస్టుపైపులోంచి విరజిమ్ముతున్న పొగలు చూస్తే తెలుస్తుంది మన పొల్యూషన్ లెవల్. మర్నాడు నాకు మరో ఆలోచన వచ్చింది. ఎప్పుడో పదేళ్లకిందట ఓసారి అడవుల్లో తిరుగుతున్నప్పుడు ఏరుకొచ్చిన కర్రముక్క.

అది నాలుగడుగులు పొడుగు వుంటుంది. వంకరటింకరగా వున్నా, పైబెరడు రాలిపోయి, నున్నగా నాకయితే బాగుంది. అలా పుల్లలూ, కర్రముక్కలూ ఏరుకు తెచ్చుకోడం నాకో సరదా. ఎందుకంటే చెప్పలేను. అదంతే. చేతిలో చేపాటికర్రా, బుజంమీద తుండగుడ్డా మన సంస్కృతిలో ముఖ్యమైన భాగం అని నాకు గట్టినమ్మకం. చేపాటికర్ర ఊతం మాత్రమే కాదు, మీదమీదకొచ్చేసే పాముల్ని కొట్టడానికీ, పశువుల్ని తోలడానికీ, దొంగలబారి పడకుండానూ పనికొస్తుందనే కదా కర్ర పుచ్చుకుని బయల్దేరతారు మన పల్లెల్లో. అలాగే బుజాన వేసుకునే పైపంచ కూడా ఎండవేళ తల కాయడానికీ, చేతులూ మొహం తుడుచుకోడానికీ పనికొస్తాయి. అసలు మనకి ఏవస్తువయినా మల్టీపర్పస్. ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే నేను అలా ఏరుకొచ్చిన కర్ర ఊతగా పుచ్చుకు వెళ్లి చూద్దాం అనిపించింది. మరోపక్క అనుమానం చేతికర్ర పట్టుకోగానే అఫిషియల్‌గా ముసిల్దాన్నయిపోయినట్టే లెక్కేమోనని. ఇలా కొంచెంసేపు నాలో నేనే సదసత్సంశయానికి లోనై. ఆఖరికి ఎవరేం అనుకుంటే నాకేం అనీ, పురవీధుల తిరుగుటయే నాకు ప్రధానమనీ సమాధానం చెప్పుకుని బయల్దేరాను. ఆశ్చర్యం. ఏచెట్టుకిందో చూసి తోచక ఏరుకొచ్చిన ఆ సాదాకర్ర ఎంత బలాన్నిచ్చిందో... నిగడదన్ని నిటారుగా, హుషారుగా నడిచేసి తిరిగొచ్చాను, నాకెంత సంతోషంగా వుందో చెప్పలేను.

మాఅమ్మాయిని పిలిచి చెప్పేను నేను సాధించిన ఘనవిజయం. "నేను నీకు నిజం చేతకర్ర కొనిస్తాలే" అంది అది. నాకు నవ్వొచ్చింది. ఎందుకంటే నాకు ఇంప్రొవైజు చెయ్యడం ఇష్టం. వున్నవాటితోనే జరుపుకోడంలో నాకు ఆనందం. అది నాకు పుట్టుకతో వచ్చిన బుద్ధి. చాలా ప్రయత్నాలు చేసింతరవాత కుదరకపోతే అప్పుడు వెళ్తాను నిజవస్తువు కొనడానికి. ఒకొకపుడు ఇంప్రొవైజు చెయ్యడంలో రెట్టింపుఖర్చు కావచ్చు కూడాను. ఏంచెప్పను. ఎవరి వెర్రి వారికానందం.

ఇంతకీ నేను ఏరుకొచ్చిన కర్ర కొంచెం పొడవెక్కువైనట్టుంది అనిపించింది. మధ్యలో వున్న గుఱుపులు కాస్త మొనలు దేలి గుచ్చుకునేలా వున్నాయి. అంచేత ఆ గుఱుపులు అరగదీయడానికి ఆకురాయి

కొనుక్కొచ్చేను. పొడుగు తగ్గించడానికి చిన్న రంపం తెచ్చేను. అటో గంటూ ఇటో గంటూ పెట్టి విరవబోతే పుటుక్కున విరిగిపోయింది పెన్సిలంత తేలిగ్గా. అందుకే అంటున్నాను ఈ కర్రముక్క నాకు ప్రాణదాయకి కాకపోవచ్చు. కానీ అది ఇచ్చిన ధైర్యం మాత్రం అపారం. మా అమ్మ అంటుండేది పశువుకి తిన్నది బలం, మనిషికి వున్నది బలం అని. నిజంగా ఆ ఎండుకొమ్మ నన్ను ఆదుకోకపోవచ్చు. కానీ అది చేతిలో వుందన్న జ్ఞానం ఇచ్చిన బలం మాత్రం అద్వితీయం.

(6 డిసెంబరు 2008. )

# 23. నీకో దరమం వున్నాది

మామూలుగా నాధోరణిలో ఈవారం ఊసుపోక రాయడానికి కీలు (కీబోర్డు) చేపట్టి కూచున్నాను.

ముంబయిలో మారణహోమం పచ్చిగా వుంది గుండెల్లో. ఎకసక్కాలకిది సమయం కాదు. అయినా చెప్పేను కదా కీబోర్డుకి వేళ్లు తగలగానే తలపులు అదుపు తప్పుతాయి. పౌర్ణమినాడు సముద్రంలో అలలు విజృంభించినట్టే.

సముద్రం అనగానే సంద్రాలు ప్రత్యక్షం. "ఇప్పుడు కాదు, రేపు రా," అన్నాను.

"అసిలేవందీ?" అంది సంద్రాలు సర్దుకు కూర్చుంటూ.

"అది అర్థం కాకే అతలాకుతలం అయిపోతున్నా. ఆ సీతమ్మధారకాడ ఏదో ఊసున్నదట. నువ్వక్కడికి పో, " అంటూ విసుక్కున్నాను.

"అనాగే ఎల్తాలే. ముందల నివ్వేం రాస్తన్నవో సెప్పు" అంది.

"మానవ ధర్మాలగురించి. పురుషార్థములు నాలుగు, అందులో మొదట ముదలకించింది ధర్మమే. అందరం ఎవరి ధర్మాలు వారు నెరవేర్చాలి." అన్నాను.

"దరమాలగురించి నీకేటి తెలుసు?" అంది ఎద్దేవా చేస్తున్నట్టు.

చచ్చాను పో, ఏదో అక్కడా అక్కడా విన్న నాలుగుముక్కలు ముక్కున కరుచుకు, నప్పినచోట గుక్క తిప్పుకోకుండా వల్లించీడమే కానీ ధర్మాధర్మాల చర్చకి దిగడానికి నేనంతటిదాన్ని! అవస్థ పడి మొదలెట్టినా, నాకంటె ఓ పాలు ఎక్కువ చదువుకున్నాళ్లు దులిపీరా?

"నివ్వు మడిసిజలమ ఎత్తేవు గనక నీకో దరమఁవున్నాది," అంటూ మొదలెట్టింది సంద్రాలు.

"ఆహా, చెప్పావు కదా ముందోసారి. మళ్లీ మొదలెట్టకు, ఫో, ఫో, సీతమ్మధారకాడికి" అన్నాను విసుగ్గా.

"నేదు. అంతా సెప్పనేదప్పుడు. మనం మడుసులం. మనికీ పచ్చులకీ పసూలకీ తేడా వున్నాది. ఆటి నీతి ఆటికి సిటంలో సెప్పీవొచ్చు. కుక్కకి ఇస్వాసం. పిల్లీ, పిట్టా ఆటి బిడ్డలకి కాలూ, రెక్కా వచ్చీవరకు కానుకుంటాయి. అంతే ఆటి దరమం. 'రేపేటవుతాది, మన్ల ఎవురుగొప్ప' అసుమంటి కొరగాని బుద్ధులాటికి నేవు. మరి మనఁవో, మనిఁవెంతసేపూ నాబొందో అని కొట్టుకుపోతన్నం. నాను గొప్పోన్నయ్‌పోవాల, నాను

పెద్దోన్నయ్‌పోవాల, నాకందురూ జేజేలు కొట్టాల అనుకుంట ఇరగబాటు పడతం. ఎవురిబతుకు ఆల్లు సూస్కుకుంతం. నాస్పెప్పేదటంటే మన కుటుంబంవునీ, మన ఊల్ల పెజలనీ గూడ మనంవే కాస్కోవాల. అదీ మడిసి జలమెత్తినందికి దరమం. మనూరూ, మనదేసిం కూడా మనంవే కాస్కోవాల. తెల్లారి సెగిసింకాన్నించీ తొంగునేవర్కూ నాబొందో అంట నీసుకం మాతరంవే నివు సూస్కుంట జరిపీరాదు. బాంబులేసేసినారు. ఆడెందుకు బాంబులేసినాడు? ఆడెనక ఎవురున్నరు? ... అంటూ పెస్నిలేసివోరు ఏరే వున్నరు. ఆరే పెస్నిలసుకుంతరు, జవాబుల్సెప్పుకుంటరు. ఆరి దరమం ఆరిది. నివ్వు సెయ్యందించాల. నీకు వెసులుబాటయిన సాయిం నివ్వు సెయ్యాల. అదీ నీదరమం. ఎరికయిన్దా?'' అంది రోజులుమారాలి సిన్మాలోవహీదా రెహ్మాన్లా అభినయించేస్తూ.

''ఆహా, బహుచక్కగా ఎరికయింది. నువ్వింక పోయి నీపని చూసుకో'' అని పంపించేసేను.

ఇదో గొడవయిపోయింది రెండువారాల్నించీ. ఏం రాద్దాం అని కూర్చున్నా ఈవిడ ప్రత్యక్షం గృహదేవతలా.

మూడేళ్లకిందట ఇండియా వచ్చేను. ప్రశాంతి మాయింటికి పెద్ద డఫెల్ బాగ్‌తో వచ్చింది. తనతో సౌమ్య కూడా వచ్చింది. అప్పుడే మొదటిసారిగా వాళ్లని చూడ్డం. నాకు ముఖపరిచయం వున్న బ్లాగరులు వీరిద్దరే. కల్పనతో మరిచయం మేమిద్దరం బ్లాగరులం కాకముందే.

ప్రశాంతి తెచ్చిన పెద్దబాగు చూస్తూ, నా మామూలు ధోరణిలో, నవ్వుతూ, ''అదా నీ హాండ్ బాగ్?'' అన్నాను.

ప్రశాంతి శాంతంగా, ''కాదండీ. తెలిసినవాళ్ల ఇళ్లలో పాతబట్టలు పోగు చేసి స్లమ్సులో ఇచ్చి వస్తున్నాం.'' అంది. ఇది నాకు కొత్త అనుభవం. ఎందుకంటే నేను విన్న, కన్న కథల్లో ఇలాటి యువతీయువకులగురించి లేవు మరి. తరవాత బ్లాగులు చూసేక తెలిసిందనుకోండి మంచి చెయ్యాలనే ఉత్సాహం చూపిస్తున్న యువతీ యువకులు చాలామందే వున్నారని. ఇంతకీ మన దానధర్మాలు ఇలా వుండేవి. ఎవరికి వారు ఎంత చెయ్యగలిగితే అంత, ఏం చెయ్యగలిగితే అదీ చేసుకుపోవడమే. పనివాళ్లకీ, బిచ్చగాళ్లకీ మనకి అక్కర్లేనివి ''పారేసే''వాళ్లం పూర్వం.

వ్యవస్థ మారుతోంది. అమెరికా వచ్చేక నాఅనుభవాలు వేరు. ఇక్కడ కూడా మనవాళ్లందరికీ సాయం చెయ్యాలనే వుంటుంది. ఎటొచ్చీ ఆ సాయాలు ఎల్లవేళలా పనికొచ్చేవిగానే వుండవు.

ఆమధ్య ఓ దూరపుచుట్టం అమ్మాయిని మాపొరుగూరు ''మిల్వాకీ ఇచ్చేరు''. అంటే, మిల్వాకీలో చదువుకుంటున్న అబ్బాయి ఇండియా వెళ్లి, పెళ్లి చేసుకుని అమ్మాయిని తీసుకొచ్చాడు. బీరకాయపీచు వరసలు నాలుగుపేజీలు తిరగేస్తే, అమ్మాయితల్లి నాకు అక్క అవుతుందన్నమాట. అమ్మాయి వచ్చినవెంటనే

నాకు ఫోను చేసింది. వాళ్లింటికి రమ్మని పిలిచారు ఆప్యాయంగా.  నేను "వస్తా, వస్తా" అంటూ గడుపులు పెట్టి, ఆరు నెలలతరవాత వెళ్లేను చూడడానికి.

అప్పుడు చూసాను వాళ్లు ఆరునెలలలో పోగు చేసిన వస్తుసంచయం. నాకు కళ్లు తిరిగేయి. మనవాళ్లు అపాత్రదానం కూడదంటారు. కానీ "పాత్ర" దానం అంటే నిజంగా అమెరికాలోనే చూడాలి. జానీ, వాళ్లాయనా వున్నరెండుగదుల్లోనూ నాలుగు గదులు కూడా పట్టనంత సామానుంది. పది స్టీలు బౌలులు (పిండి కలుపుకోడానికి తప్ప పొయ్యిమీద పెట్టడానికి పనికిరానివి), పన్నెండు రకాల కార్నింగువేరు కంచాలూ, కప్పులూ, మూడు అప్పడాల కర్రలూ, అందంగా గోడకి తగిలించుకోడానికి మాత్రమే పనికొచ్చే అప్పడాలపీటా (థాయ్లెండులో చేసిందిట), కూరలు తరుక్కునే కత్తులు ఆరూ (సాన పట్టిస్తే పనికొస్తాయిట), నాలుగు కాలిక్యులేటరులూ, (ఏవో కొన్నప్పుడు వుచితంగా వచ్చినవి), రెండు కారుసీటులూ (వేరు వేరు వయసు పిల్లలకి పనికొచ్చేవి), ఎందుకంటే భవిష్యత్తులో పిల్లలు పుట్టినప్పుడు పనికొస్తాయనిట, అదే కారణంగా ఒక వాకరూ, ఇంకా ఒక పెద్ద గార్బేజి సంచి నిండా స్వెటర్లూ, పాంట్లూ, (పిల్లలకి పెద్దవీ పెద్దలకి చిన్నవీ అయినవి), కొంచెం రిపేరు చేసి పెయింటు చేస్తే పనికొచ్చే కుర్చీలు మూడూ ....

"నీకు అవసరం లేదని ఎందుకు చెప్పలేదూ?" అన్నాను.

"ఏమో, వాళ్లేమైనా అనుకుంటారేమోనని," అంది ఆ అమ్మాయి బెరుగ్గా చూస్తూ.

తెలిసిందనుకుంటాను నా వేదన. పారబోసేది వారబొయ్యమని మనకి అక్కర్లేనివి మరొకరికి ఇవ్వడం వేరు. నీకు ఎప్పుడేనా పనికొస్తుందంటూ వారికీ మనకీ కూడా పనికిరాని వస్తువులు మనమీద రుద్దడం వేరూ.

అమెరికాలో garage sales వెనక పరమార్థం అదేనట. మా పక్కింటావిడ ఓరోజు గరేజిసేల్‌గురించి నాకో చిన్న క్లాసు పెట్టింది. "ఉచితంగా మరొకరి వస్తువు తీసుకోడం మాకు (అంటే అమెరికనులకి) ఇష్టం వుండదు. అంచేత మాకు (అంటే ఆవిడకి) అక్కర్లేనివి ఇలా, నామమాత్రంగా ధర కట్టి అమ్ముతాం" అని చెప్పింది. సబబుగానే వుంది అనుకున్నాను.

ఆతరవాత ఓరోజు తాము గరాజిసేలు పెడుతున్నామనీ, నాకు అక్కరలేనివి ఏమైనా వుంటే తెచ్చి వాళ్లగరాజిముందు పెట్టమనీ కూడా చెప్పింది.

ఎందుకంటే ఈ గరేజీసేలుకి కూడా ఓ తంతుంది. ముందు వస్తువులన్నీ అమ్మకానికి సిద్ధం చెయ్యాలి. బట్టలు వుతికి చక్కగా మడతలు పెట్టడమో హాంగర్లమీద తగిలించడమో చెయ్యాలి, గిన్నెలు వీలయినంత తళతళా తోమి, కడిగి పెట్టాలి. తరవాత చిన్న చీటీలమీద ధరలు రాసి వాటికి అతికించాలి. రెండో స్టెప్పు పత్రికలలో

ప్రకటనలు ఇవ్వాలి. నాలుగువీధులకూడలిలో సైనులు పెట్టాలి. నేను నాసామాను వాళ్ల సేలులో కలిపేస్తే, ప్రకటనలూ, సైనులూ తప్పుతాయన్నమాట నాకు.

నాకిదంతా కొత్త కనకనూ, మాపక్కింటావిడ మంచిమనిషి కనకనూ నాకా సలహా ఇచ్చింది. అమ్ముకోడం అన్న కాన్సెప్టు నాకు నచ్చలేదు. ఇది అలవాటు అవడానికి మనకి కొంత టైము పడుతుందిలెండి. ఇక్కడ మరోలా పుచ్చుకునేవారు లేనందున (అప్పటికి నాకు గుడ్విల్ లాటి సంస్థలు వున్నాయని తెలీదు) నేను కూడా ఓ రెండు జతల బట్టలు అక్కడ పెట్టేను.

గరాజిసేలులో అంతరార్థం కేవలం మనకి అక్కరలేని వస్తువులు వదిలించుకోడం మాత్రమే కాదు. అదొక చిన్నసైజు సాంఘిక కార్యక్రమం కూడా. కొందరు గరాజిసేల్ పెట్టేం, రమ్మని పిలుస్తారు, పేరంటానికి పిలిచినట్టు. కొన్నికార్లమీద కనిపించే బంపర్ స్టికర్లు "This car stops at every garage sale" లో హాస్యం, పరమార్థం కూడా వున్నాయి.

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, అలాటి సరదా లేక అలవాటు గలవారు చక్కగా తెల్లారగట్టే లేచి, బ్రేక్‌ఫాస్టు తిని, గరాజిసేలు-షాపరు అనిపించుకోడానికి తగినట్టుగా ముస్తాబయి, కారేసుకు బయల్దేర్తారు. మునిసిపాలిటీ బండీలా ప్రతి గరాజిసేలుదగ్గరా ఆగి, అచ్చమ్మబుచ్చమ్మ కబుర్లు చెబుతూ ఆపూట గడుపుతారు. కొందరేమో గబగబా తమకి పనికొచ్చేవేమైనా వున్నాయేమో చూసేసి, కావలిసినవి తీసుకునో, తీసుకోకుండానో తరవాతి మజిలీకి తరలిపోతారు.

ఇలా పాతస్నేహితులని పలకరించుకోడం, కొత్తమిత్రులని కలుసుకోడం జరుగుతుంది ఆ శుభ సందర్భంలో.

పైన చెప్పినట్టు "ఉచితంగా పుచ్చుకోడం ఇష్టంలేకపోవడం" అన్న నీతి పరిపూర్ణ సత్యం కాదు. అక్కడ బేరాలు చూస్తే మూలసిద్ధాంతానికీ ఆచరణకీ మధ్య వున్న తేడా చక్కగా తెలుస్తుంది నాలాటి అమాయకులకి.

ఓగాజుకూజా ధర మూడు డాలరులనుకోండి. కొనడానికొచ్చినావిడ యాభై సెంటులిస్తానంటుంది.

ఇంటావిడ రెండు డాలరులివ్వమంటుంది.

కొనుగోలుదారు, "డెబ్బై అయిదు సెంట్లు" అంటుంది.

"డాలరున్నర. అది మా నానమ్మది. సెంటిమెంటల్ వేల్యూ వుంది దానికి" అంటుంది.

అదుగో, అక్కడే నాకు తమాషాగా వుంటుంది. సెంటిమెంటల్ వాల్యూ సొంతదారుకి వుండొచ్చు కానీ కొనేవాడికేం పట్టింది? పైగా సెంటిమెంటల్ వాల్యూ వుంటే అమ్ముకోడం ఏమిటి? ఇలాటి తమాషాలు

చూడడానికి ఒకటి రెండు సార్లు వెళ్లినా తరవాత మాత్రం నాకు ఈ సేలులు విసుగేసేయి. అక్కడ వున్న చెత్త చూస్తే అసలు ఎవరు కొంటారా అన్నది అనుమానమే. కానీ నిజానికి వుంటారులెండి గంతకి తగ్గ బొంతలు.

అలాగే ఈగరాజిసేలుల్లో రేడియోలూ, టీవీలూ, బ్లెండర్లూ కొని రిపేర్లు చేసీ, పాలిష్ చేసీ మళ్లీ అమ్ముకోడం చూస్తే ఆ మొదట చెప్పిన స్పిరిటు ఏమయిపోయిందీ అనిపించకపోదు.

ఇంతకీ నేను సీరియస్‌గా చెప్పదలుచుకున్న విషయం కిందటివారం ముంబైలో జరిగిన ఘోర, మారణహోమం మొత్తం  ప్రపంచాన్ని ఒక్క ఊపు ఊపి, మేల్కొలిపింది. అనేకమంది ప్రాణాలు కోల్పోయారు. అనేక జీవితాలు తల్లకిందులయిపోయేయి. ఇలాటి సమయాల్లో అసలు పనికిరాని సాయం అంటూ వుండదేమో. నామనసు మొద్దుబారిపోయింది. ప్రతి ఒక్కరూ బాధితులకి చేతనయిన సాయం అందించగలరని ఆశిస్తూ ...

(6 డిసెంబరు 2008. )

# 24. శ్రోతలు కోరని పాటలు

నాకు సంగీతం చాలా ఇష్టం, నేను సంగీతం నేర్చుకోడం మాఅమ్మకిష్టం.

రేడియోలో లలితసంగీతం వచ్చినప్పుడల్లా నేను రేడియోకి అంటుకుపోవడం చూసి మాఅమ్మ నన్ను గాత్రంతో మొదలు పెట్టించింది. అప్పట్లో రేడియోలో లలితసంగీతం పాఠాలు కూడా వచ్చేవి. నేనొకసారి అలా ఆ రేడియోపెట్టెతో సాధన చేస్తుంటే చీపురు పట్టుకు గదిలోకి వచ్చిన మా అప్పాయమ్మ ఓలమ్మో అంటూ చీపురు వదిలేసి నిలబడిపోయింది. ఆతరవాత వరసగా వీణా, వయొలిను కూడా ఒకొకటి ఆరేసి నెలలచొప్పున వాయించి ఆ గానపాఠాలకి మంగళం పాడేను.

గానమాధుర్యాన్ని ఆస్వాదించలేని మనిషి హంతకుడు కాగలడన్నాడు షేక్సిపియరు. మనవాళ్లు కూడా సుమారుగా అదే అర్థంలో శిశుర్వేత్తి, పశుర్వేత్తి, వేత్తి ఫణీ గానరసం అంటారు.

శిశువులూ, పశువులూ, పాములూ కూడా భరించలేని గానం మరోటి వుంది. అందులో మొదటిది అప్పట్లో సిలోన్‌రేడియోలో వచ్చిన శ్రోతలు కోరిన పాటలు కార్యక్రమం. ఇప్పుడు అదేవరసలో మీ ''మోస్ట్ ఫేవరిట్ సాంగ్స్ వినండి మరి'' అంటూ అమెరికన్‌యాసతో అర్థతెలుగులో తెలుగుటీవీలో వస్తున్నాయి న్యూయార్కునించి. సిలోను రేడియోలోలాగే అఖిలభారతసంగీతంలో కూడా వచ్చేవి అలాటి పాటలు.

అవి రెండు రకాలు - హోరెత్తించేవీ, బోరెత్తించేవీ అని. మొదటిరకంలో మనకి వినిపించేవి వీణా, వయొలినూ, మృదంగం, హార్మోనియమూ, బాంజో, సన్నాయీ, ఫ్లూటూ, ఆర్గానూ, తబలా, సబలా - అన్నీ ఒక్కసారి హోరెత్తిపోయి, అసలు పాడుతున్నది బాలసరస్వతో, రాజేశ్వరరావో తెలిసేది కాదు. ఆరోజుల్లో అరగంటసేపు ఏరోడ్డుమీద నడిచినా కంటిన్యుటీ చెడకుండా సిలోను పాటలు పూర్తిగా వినేయగల అవకాశం వుండేది.

రెండో రకం బోరెత్తించేవి త్రికోణసంగీతం, త్రికోణభజనా, ''ఇంకొకబిడ్డకి కాదిది తరుణం'' అంటూ రాకాసివాణీ, దేశప్రగతి గానాలతో ప్రాణాలు తీసేవి. ఇంక మనం వున్న వీధిలో పెళ్లి జరిగితే సరేసరి. ''రూప్ తేరా మస్తానా'' అంటూ వయసులో వున్నవారికి కూడా పెళ్లంటే విరక్తి పుట్టించేంతవరకూ గోలెట్టేసేవి. గోలెట్టేసేవి అని భూతకాలం ఎందుకులెండి. గత యాభైఏళ్లలోనూ ఆంధ్రదేశంలో మారనిసాంప్రదాయం బహుశా ఇదొక్కటేనేమో.

పది పదిహేనేళ్ల కిందట అమెరికాలో బూమ్‌బాక్సులు వచ్చేక కొందరు కుర్రాళ్లు ఆ బూముపెట్టెని పిల్లాడిని ఎత్తుకున్నట్టు ఓభుజాన ఎత్తుకుని మోస్తూ మూడువీధులకి ప్రతిధ్వనించే ఘూర్ణ శబ్ద తరంగాలతో రోడ్డుమీద

నడుస్తుంటే ఆపక్కన కారు నడపడానికే నాకు భయం వేసేది. నాఅదృష్టం బాగుండి అచిరకాలంలోనే అవి అంతరించేయి. ఐపాడులొచ్చాక ఆపాడుపాటలనించీ నాలాటివారికి విముక్తి దొరికింది. ఈ విషయంలో మాత్రం టెక్నాలజీ జిందాబాద్ అని అరవాలనుంది నాకు.

ఇంతకీ ఇదంతా ఎందుకొచ్చిందంటే, రెండురోజులకిందట సిరివెన్నెలగారు స్వరరాగగంగాప్రవాహమే అంటూ తమ బ్లాగులో రాసిన టపా చదివేక, అక్కడ వ్యాఖ్యలలో సుజాత నా కథ రససిద్ధిని మరోసారి గుర్తు చేసేక, ఈ గతకాలస్మృతులు మరోసారి మననం చేసుకుంటున్నా.

1965లో విజయనగరంలో ద్వారం వెంకటస్వామినాయుడుగారి కచేరీ తొలిసారి విన్నాను. అప్పట్లో నాకు సంగీతంమీద అట్టే ఆసక్తి లేదు. నాస్నేహితురాలు, నిర్మల, హిస్టరీ లెక్చరరు లాక్కెళ్లింది. నేను మొదట కొంత గునిసేను. “ఇప్పుడు కాదులే మరోసారి చూద్దాం” అన్నాను కూర్చున్నమంచంమీంచి కదల్డం ఇష్టంలేక. నిర్మల నన్ను కదిలించడానికే, “ఆయన పెద్దవారు. మళ్లీ ఎప్పుడు చేస్తారో కచేరీ. ఇప్పుడు రా. మరోసారి రావద్దులే.” అంది. నేను ఆరోజు తనతో వెళ్లినందుకు ఎంతగా సంతోషించేనో చెప్పలేను. అద్భుతమయిన అనుభవం. బాధ కలిగించిన విషయం అదే ఆయన చివరి కచేరి.

మన కచేరీల్లో పక్కవాద్యాలు పక్కనో వెనకనో వుంటాయి కానీ దిగంతాలకు విస్తరిల్లుతూ  అసలు గాయకుడు పాడుతున్నాడో లేదో కూడా తెలీనంతగా హోరెట్టవు. సుబ్బలక్ష్మి అంటే సుబ్బలక్ష్మి, వసంతకుమారి అంటే వసంతకుమారీ పాడుతున్నారని స్పష్టంగా తెలుస్తుంది. అలాటప్పుడు మాత్రమే సిరివెన్నెలగారికి కలిగిన గొప్ప ఆత్మానందానుభవంలాటిది కలిగే అవకాశం వుంటుంది శిశువులకీ, పశువులకీ, పాములకీ, నాలాటి నసంగీతజ్ఞానులకీ కూడా.

మీకు ఇంకా నాసంగీతజ్ఞానం తెలుసుకోవాలంటే రససిద్ధి చూడండి.

(17 డిసెంబరు 2008. )

# 25. కలం బలం అంటే నవ్విపోయే రోజు వచ్చెనా?

నాచిన్నప్పుడు స్కూళ్లలో వక్తృత్వపోటీలకి "కలం బలమా - కత్తి బలమా" అన్న విషయం తరుచూ తీసుకునేవారు. విద్యార్థులు అమాయకత్వంచేతా, పంతులిగారి కటాక్షం ఆశించీ "కలం బలం" అన్నవాదనకే ఎక్కువగా మొగ్గు చూపేవారు. పోటీలు జరగడానికి అవసరం కనక పంతులుగారు "కత్తి బలం" అన్న వాదం తీసుకుని కొందరయినా వాదించాలని పిల్లల్ని బలవంతం చేసి ఎదురు నిలబెట్టేవారు.

నేను ఇదివరకు పుస్తకాలు ప్రచురించుకోడం గురించి రాసేను. గత పదిరోజుల్లోనూ కథలూ, వ్యాసాలూ ఏ పత్రికలోనో, వెబ్ సైటులోనో ప్రచురించుకోవాలంటే ఎదుర్కొనే ఈతిబాధలు కూడా తెలిసొస్తున్నాయి.

ఇదుగో, ఇదీ వరస –

సాధారణంగా ప్రతి పత్రికకీ ఓ పాలసీ వుంటుంది. వారు ఏ ధ్యేయంతో పత్రిక మొదలు పెట్టేరో, ఎలాటి రచనలు వేసుకుంటారో చెప్తారు పాలసీ స్టేట్మెంటులో.

రచయితలకి సూచనలు కూడా ఇస్తారు. ఇదివరకయితే కాగితానికి ఒకే వైపు రాయాలి, తిరుగుటపాకి పోస్టేజి జత పరచవలెనులాటివి వుండేవి. సంపాదకులదే తుదినిర్ణయం అనీ, వారికి మన కథ ప్రచురణార్థం చిరుమార్పులు చెయ్యడానికి అధికారం కలదు అని కూడా వుంటుంది.

ఇప్పుడు సైటులయితే, ఈ-మెయిలు చెయ్యొచ్చు, ఫలానా ఫాంటులో, ఇన్ని మాటలకి మించకుండా … ఇలా వుంటున్నాయి.

కొన్ని పత్రికలు రచయితలకి ప్రతిఫలం కూడా ఇచ్చేవారు. కొన్ని పత్రికలు ప్రచురించిన పత్రికకాపీ పంపేవారు. వాళ్లు ఏది ఇస్తే అదే మహాప్రసాదం అనుకుని స్వీకరించేవాళ్లం. నాలాటి చిన్నసైజు రచయితలం వారు ఇస్తే పుచ్చుకోడం, లేకపోతే వూరుకోడం, అంతే. భమిడిపాటి రామగోపాలంగారిలాటి పెద్దలు దబాయించి వసూలు చేసేవారుట. ఆయనే చెప్పేరు ఒకసారి నాకు. రచయితలకి పత్రికలవారు ఇచ్చే గౌరవంగురించి పోలాప్రగడ సత్యనారాయణమూర్తి గారు ఒకసారి ఎక్కడో రాశారు.

స్థూలంగా కథ ఇదీ -

ఆంధ్రపత్రిక, భారతి సంస్థాపకులు, కాశీనాథుని నాగేశ్వరరావు గారు సుప్రసిద్ధ రచయిత ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారికి "దయచేసి మా పత్రికకి వ్యాసం రాసి పంపండి, మీరు తప్పక రాసి పంపగలరని ఆశిస్తూ, ప్రతిఫలం జత పరిచాం," అని రాసి, డబ్బుతో సహా పంపించేరుట.

ఆ తరవాత వారిఅల్లుడు శివలెంక శంభుప్రసాద్‌గారు హనుమచ్ఛాస్త్రిగారికే రాసిన ఉత్తరం - "మీరు మాపత్రికకి వ్యాసాలు పంపవలసినదిగా కోరుతున్నాం. మీరచన అందుకున్న వెంటనే ప్రతిఫలం పంపగలం" అని. ఇక్కడ ప్రతిఫలం జత పరచడం జరగలేదు.

ఆతరవాత రాధాకృష్ణగారి ఆధ్వర్యంలో ఆరచయితే మరో ఉత్తరం అందుకున్నారు. "మీరు వీలు చూసుకుని మాపత్రికకి వ్యాసాలు పంపుతే సంతోషం" అని ఆవుత్తరం. అందులో ప్రతిఫలంమాటే లేదు!

ఈ మూడు వుత్తరాలూ ఉదాహరణగా తీసుకుని పత్రికాధిపతులకి రచయితలయందు గౌరవం ఎలా తగ్గుతూ వచ్చిందో ఎత్తి చూపారు సత్యనారాయణమూర్తిగారు.

ఆరోజుల్లో పత్రికలు ప్రతిఫలం ఇచ్చినప్పుడు కూడా రచనమీద హక్కులు రచయితలవే. ఒక పత్రికకి రచన పంపితే "తొలిసారి ప్రచురణకి మాత్రమే ఆ పత్రికకి రచయిత అంగీకారం" ఇచ్చినట్టు అర్థం. తరవాత రచయితలు సంకలనాలు ప్రచురించుకున్నప్పుడు ఆయా పత్రికలకి కృతజ్ఞతలు తెలుపుకునేవారు. అదీ ఆచారం. వీటికి రాతకోతలు లేవు. అన్నీ ఇంప్లిసిట్.

ప్రతిఫలం మాట వదిలేద్దాం. ఇప్పుడు రచయితలకి తమరచనల మీద హక్కులు ఎలా వుంటున్నాయో సూక్ష్మంగా వివరిస్తాను.

నేను ఇదివరకెప్పుడు ఏ పత్రికకి పంపినా పాత ఆచారాలు మనసులో వున్నందున హక్కులవిషయం పరీక్షగా చూడలేదు. పత్రికలవారి పాలసీలు గమనించలేదు. ఈవిషయంలో పూర్వకాలం నుండీ వస్తున్న అచ్చు పత్రికలు ఆనాటి సాంప్రదాయాలే పాటించడం కూడా కొంత కారణం కావచ్చు.

ఇప్పుడే తెలిసింది నాకు కొన్ని సైబరు పత్రికలు కొత్త నిబంధనలు పెడుతున్నారు అని. ఆ సైటులకి మనం ఒక కథో, వ్యాసమో ఇస్తే, దానిమీద సర్వహక్కులు తమవే అంటున్నారు. వారు ప్రచురించిన తరవాత మనం ఎక్కడ ప్రచురించుకోవాలన్నా ముందుగా వారి అనుమతి తీసుకోవాలిట. వారు అనుమతి ఇవ్వకపోతే నేను చెయ్యగలిగింది ఏమీ లేదు.

ఇలాటి నిబంధనలలో అంతర్గతంగా, వాచ్యం చేయకుండా, వారు చెప్పకయే చెప్పుతున్నది ఏమిటంటే ఆ పత్రిక లేక సైటువారు ప్రచురించిన రచన తమ ఇష్టప్రకారం మార్చుకోడం, వున్న వాక్యాలు తీసేయడం, కొత్తవి చేర్చడంలాటివి చేస్తే, రచయితకి అభ్యంతరం చెప్పే హక్కు లేదు. పత్రిక లేక సైటువారు ఒక సంకలనం

ప్రచురిస్తే, అందులో మన వ్యాసమో కథో వేసుకుంటే మనతో చెప్పక్కర్లేదు. ఒక్కమాటలో రచయిత హక్కులన్నీ హుళక్కి. ఇంతే సంగతులు.

నాదృష్టిలో ఇది రచయిత కృషిని అవమానించడమే. నేను రాసిన కథో వ్యాసమో రూపు దిద్దుకోవడంలో నా కృషి కంటే వారి ప్రచురణకే ఎక్కువ ప్రాధాన్యత అని చెబుతున్నట్టు వుంది ఈ నిబంధన. నాదృష్టిలో అది కళాపోసన కాదు, వ్యాపారసరళి. బహుళ జనాదరణ పొందిన ఈమాట.కామ్, కౌముది.నెట్ వంటి నెట్ పత్రికలు ఇలా రచయితలహక్కులు సంగ్రహించకపోవడం వారి సాహిత్యాభిమానానికి నిదర్శనం అనే అనుకుని వారిని అభినందించక తప్పదు.

ఇక్కడే మరొక హక్కు లేదా రచయితలకు గల/వుండవలసిన స్వాతంత్ర్యం గురించి కూడా చెప్పుకోవాలి. నేను రాయడం మొదలు పెట్టిన దగ్గర్నుంచీ, సంపాదకులు యథాతథంగా వేసుకుంటూనే వస్తున్నారు కనక నాకు ఈసంగతి అసలు తోచను కూడా లేదు. ఇప్పుడు సంపాదకులు కథలని "ప్రచురణకి అనుగుణంగా" చిన్న చిన్న మార్పులు సూచిస్తున్నారు. "Fine tuning" పేరుతో. అలాటి చిన్న మార్పులు చేయడానికి కూడా తమకి హక్కులు వున్నాయంటున్నారు. బాగుంది.

అయితే "చిన్న" అంటే ఏమిటి? ఎంత చిన్న? చెప్తాను.

అప్పుడప్పుడు వర్ధమానరచయితలు నాతో వారి రచనగురించీ, సంపాదకులదగ్గర్నుంచి వారు అందుకున్న సూచనలగురించి ప్రస్తావిస్తూ వుంటారు. ఆ సూచనలు లేక వ్యాఖ్యలు ఒక మాటో, ఒక వాక్యమో, తుదో, మొదలో మార్చమనడమో కావచ్చు. సన్నివేశాలు బలంగా లేవూ, తీసుకున్నఅంశం కథకి పనికి రాదు అనేనా కావచ్చు.

ఉదాహరణకి నేను కన్నా, విన్నా కొన్ని సూచనలు తీసుకుని సమీక్షిస్తే ఇలా వుంటుంది.

"మీరు కథ బజారులో మొదలుపెట్టేరు. కాలేజీలో మొదలు పెట్టి రాయండి."

"ఇంగ్లీషుమాటలు ఎక్కువగా వున్నాయి. తెలుగు వాడితే బాగుంటుంది."

"మీ హీరో కాలేజీ స్టూడెంట్ కదా. ఇంగ్లీషుమాటలు పెట్టండి."

"ఫలానా సన్నివేశంలో మీ పాత్ర కుర్చీమీద కూర్చున్నట్టు రాసేరు. కౌచ్ అని రాస్తే బాగుంటుంది."

"... ఈ వాక్యాలు తీసేయండి"

"... ఆ వాక్యాలు తిరగరాయండి"

"పాత్రలని పటిష్టం చెయ్యండి"

ముగింపు ఇచ్చి వుంటే, ''ముగింపు పాఠకులకి వదిలెయ్యండి''

ముగింపు పాఠకులకి వదిలేస్తే, ''ముగింపు ఇవ్వలేదు. అసంపూర్ణంగా వుంది.''

ఇవీ, ఇలాటివీ చెప్పి, ఆ రచయిత ''ఏమిటండీ. నాకథంతా మొత్తం మార్చి రాయమంటున్నారు?'' అని అడిగారు నన్ను. అవును మరి, కథ మొదలూ, తుదీ, మధ్యలో సంభాషణలూ, కథకుడి భాషణలూ అన్నీ మార్చేస్తే ఇహ మిగిలేది ఏమిటి, పేర్లూ, సుమారుగా కథాంశమే కదా!

ఏం చెప్పాలో నాకు తెలీలేదు. కానీ నాకు అంతకంటె ఆశ్చర్యం ఈసంపాదకులకి ఇంత టైమెక్కడ దొరికిందా అని. వాళ్లకీ ఉద్యోగాలుంటాయి, సంసారాలుంటాయి, ఇతర వ్యాపకాలుంటాయి. వీటన్నిటిమధ్య, వారికి అందిన ప్రతి రచననీ ఇంత నిశితంగా పరిశీలించి, చర్చించే టైమెక్కడిది చెప్మా అని నాకు ఆశ్చర్యం.

విమర్శలవిషయం తీసుకుంటే, ఈనాడు సాహిత్యచర్చల్లో ప్రముఖంగా కనిపిస్తున్న ఒక అంశం కథలో ఎంతవరకూ పాఠకులమేధకి వదిలిపెట్టాలి అన్నది. ఈవిషయంలో వల్లంపాటి వెంకటసుబ్బయ్యగారు ''నామేధోశక్తిని శంకించే, కించపరచే రచనలంటే నాకు గౌరవంలేదు'' అన్నారు.

నా అభిప్రాయం కూడా అదే. నేను కూడా పాఠకులు ఆలోచించుకోవాలి అనే అనుకుంటూ రాస్తాను. ఒకటి రెండు వాక్యాల్లో అన్యాపదేశంగా పాత్రలఅభిప్రాయాలు సూచించి వదిలేస్తాను పాఠకులు గ్రహించగలరనే. (ఈమధ్య వచ్చే కొన్ని వ్యాఖ్యలు చూస్తుంటే ''అట్టే వదిలిపెట్టడానికి వీల్లేదు'' అనిపించినా). కథ పూర్తిగా చదివి ఆలోచించుకునే మంచిపాఠకులు వున్నారని నేను గట్టిగా నమ్ముతాను. అయితే ఎంతవరకూ వదిలిపేయాలి అన్నది రచయితనిర్ణయానికే వదిలిపెట్టాలి అని కూడా అంత గట్టిగానూ నమ్ముతాను.

ఈసందర్భంలోనే నేను గమనించినది -

కొన్ని విమర్శలు చూసినప్పుడు, అవి రాసినవారు కథలో ''రచయిత ఏం చెప్తున్నాడు'' అన్నదృష్టితో కాక ''మనం రచయితకి ఇవ్వగలసలహాలు ఏమిటి'' అన్నదృష్టితో చదువుతున్నారేమో అనిపిస్తుంది. వున్నదున్నట్టు చదివి శిల్పంలోనో, కథనంలోనో ఏమి లోపమో చెప్తే అదో దారి. ఫలానాచోట సందర్భశుద్ధి లేదు అంటే అదో దారి. అంతేకానీ, ''ఇలా ఎందుకు రాసేవు'', ''అలా ఎందుకు రాయలేదు'' అంటే ఏం చెప్తాం? ఒక స్నేహితురాలు చెప్పినట్టు, ''ఇతివృత్తం ఇచ్చేస్తాను, కథ మీరే రాసుకోండి'' అనాలనిపిస్తుంది!

నన్నడిగితే, అలాటిసూచనలు రచయితల ప్రతిభావ్యుత్పత్తులకి ప్రతిబంధకాలు. ప్రతిరచయితకీ తనదైన ఓ శైలి వుంటుంది. తాను చెప్పదల్చుకున్నది తనకి అనువైన పద్ధతిలో, తాను ఎన్నుకున్న భాషలో చెప్తాడు.

సంపాదకులు ఆ రచనావిధానం లేక శైలి తమపాఠకులని ఆకట్టుకునేదిగా వుందా, తమపాలసీ పరిధిలో ఇముడుతుందా లేదా అన్నది చూసుకుని, అంగీకరించడమో నిరాకరించడమో చేస్తారు సాధారణంగా. అలాగే జరగాలి. చిన్న అసంబద్ధతలు ఎత్తి చూపినా సంతోషమే. అంతేగానీ పేర్లు మాత్రం వుంచి మొత్తం కథంతా తిరగరాయండి అంటూ కథల వర్క్ షాపు పెట్టేయడం సమంజసంగా తోచదు నాకు.

ఆరుద్ర "త్వమేవాహమ్" గ్రంథాన్ని రోణంకి అప్పలస్వామి గారికి అంకితమిస్తూ:

"దీపాన్ని వెలిగించేందుకు దీపం

సాన పట్టినమీదటే వజ్రం

బంగారుపళ్ళేనికి గోడచేర్పు

మీచేతిచలువ వీడికూర్పు."

అన్నారు. ఇక్కడ తనరచనను బంగారుపళ్లెంతో పోల్చడం గమనించండి. రచనకీ, రచయితకీ మధ్యగల అవినాభావసంబంధం అర్థమవుతుంది. అలాగే తన సినీవాలీ గ్రంథాన్ని సినీనటుడు కొంగర జగ్గయ్యకి అంకితమిచ్చినప్పుడు జగ్గయ్య అంటారు.

"పరిణతిలో ప్రభవించిన కావ్యం నా కిస్తానంటే

తీసుకునే స్తోమతు నాలో ఆశగా తలవొంచుకుంది."

"అల్లుడా రమ్మ"ని ఆరుద్రగారు

పిలిచి పిల్లనిస్తామంటే

ములిగిపోయాను కృతజ్ఞతతో ఏం చెప్పను? ఎలా చెప్పను?"

ఇది రచయిత అంటే సాహిత్యాభిమానులకి గల గౌరవాన్ని సూచిస్తుంది. రచయితలకీ, సాహిత్యపోషకులకీ, పత్రికాధిపతులకీ మధ్య గల సంబంధాలలో మార్పు కోరదగ్గదే కానీ ఈవిధంగా కాదు!

నామనవిః

సంపాదకులకీ, వెబ్ సైటునిర్వాహకులకీః నూటికి 99 మంది రచయితలకి రాతలే వారి ఆస్తి. అది మీరు హక్కుభుక్తం చేసుకోడం న్యాయం కాదు. దయచేసి రచయితలకి ఇవ్వవలసిన గౌరవం ఇవ్వండి.

వర్ధమాన రచయితలకిః మీకథలు ఎవరికి పంపిస్తున్నారో, వారి పాలసీలేమిటో, మీహక్కులేమిటో ఓసారి పరీక్షగా చూసుకోండి.

తాజాకలం. ఇది నా తెలుగుతూలికలో పెట్టినప్పుడు పాఠకులు ఆసక్తితో తమ అభిప్రాయాలూ, అనుభవాలూ వెలిబుచ్చడమే కాక, సంపాదకులు కూడా సాదరంగా స్పందించి, తమ పాలసీలను సవరించుకోడమో, వివరించడమో జరిగింది. వీరందరికీ మరోసారి ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను)

(ఈవ్యాసంలో ఆరుద్రగారి పద్యాలు కరెక్టు పాఠం అందించిన కొడవళ్ల హనుంతరావుగారికి కతజ్ఞతలు).

(22 డిసెంబరు 2008. )

# 26. మరో యేడూ, మళ్లీ ప్రమాణాలూ

మామూలుగానే వెనక్కి తిరిగి చూసుకోకుండా ముందుకు సాగడం నాఅలవాటు. కానీ ఈసారి మాత్రం అందరిలాగే నేను కూడా నూతనసంవత్సరంనాడు ప్రతిజ్ఞలు చేసేద్దాం అనుకున్నాను. చూసారా ఇది కూడా ఒక ఆలోచనకి ఆరంభమే!

వెనకటిరోజుల్లో కాశీ వెళ్లినవాళ్లు తమకి అత్యంతఇష్టమయిన వస్తువు ఏదో ఒకటి అక్కడ వదిలేసి రావడం ఆచారంట. అంటే నేను వంకాయకూరో సున్నుండలో అంటే పడిఛస్తాను అనుకోండి. ఆ వంకాయకూరో సున్నుండలో కాశీలో వదిలేసి వస్తే మళ్లీ జన్మలో అది తినకూడదన్నమాట. అందులో కాంప్రమైజింగుకి ఇసుమంతయినా అవకాశం లేదు. అంటే "మెంతివంకాయకూర వదిలేసి వచ్చేను, పచ్చికారం పెట్టి చేసుకు తినొచ్చు"లాటివి అంగీకరించబడవు. అది తెలిశాక సున్నుండలు వదిలేయకూడదని నిశ్చయించుకున్నాను. ఇది కూడా ఒకరకమైన ప్రతిజ్ఞకిందే వస్తుందా? ఏమో మరి.

నిజానికి ఇలాటి ప్రతిజ్ఞలన్నీ మన మనోదారుఢ్యాన్ని (డిసిప్లిను అంటారు కాబోలు ఇంగ్లీషులో) పరీక్షించడానికి అంటారు. వంకాయకూరా, సున్నుండలూ వదిలేయగలిగే మనోదారుఢ్యం నాకు వుందా లేదా అని పరీక్షించుకోడం అన్నమాట. ఇప్పుడు కొత్తసంవత్సర నిర్ణయాలకి కూడా అదే రూలు. ఎటొచ్చీ ఈనిర్ణయాలు ఇష్టాయిష్టాలకి సంబంధించినవి కావు, కష్టనష్టాలతో కూడుకున్నవి.

ఈయేటికి ఇది ఆఖరిరోజు. నేనిప్పుడు గబగబా ఏం నిర్ణయం తీసుకోవాలో నిర్ణయించేసుకోవాలి. గట్టిగా ఆలోచించడం మొదలెట్టేశాను. చాలామంది ఏదో ఒక దురభ్యాసాన్ని వదిలేయడమే ఎంచుకుంటారు. ఆ దురభ్యాసాల జాబితాలో మొట్టమొదటిది సిగరెట్లు మానేయడం.

సిగరెట్లు మానేయడం చాలా తేలికట కూడాను. ఎవరో ఓ పెద్దమనిషి చెప్పాడు, "సిగరెట్లు మానేయడం చాలా తేలికండీ. నేను చాలాసార్లు మానేశాను" అని. చాలాసేపు ఆలోచించినతరవాత నాకు తట్టింది, నాకు లేని అలవాటు ఎలా వదిలేస్తాను. అంచేత ఇది పనికిరాదు నాకు.

రెండోది కాఫీ మానేయడం. ఇది ఆలోచించవలసిన విషయమే. కాఫీ వొంటికి మంచిది కాదని అంటారు కానీ నాఒంటికీ, ఇంటికీ, ఇంటికి వచ్చేపోయేవారికీ కూడా నేను కాఫీ తాగడమే ఆరోగ్యకరం అనిపిస్తోంది చూడగా చూడగా. ఎందుకంటే, ఉదయం కాఫీ తాగకపోతే, నాకు చిరాగ్గా వుంటుంది. అప్పుడు కోపం వస్తుంది. నాకు

కోపం వస్తే నాచుట్టుపక్కలవున్నవాళ్లకి ఆనందంగా వుండదు. నారోజుతో పాటు వాళ్లరోజు కూడా కష్టమయం అవుతుంది. ఇది సంఘద్రోహంగా పరిగణింపబడుతుంది. నామీద ఎవరోఒకరు పబ్లిక్ న్యూసెన్సు దావా వేసినా వెయ్యొచ్చు. ఇలా ఆలోచించి కాఫీ మానేయడం కూడా శుభప్రదం కాదని దాన్ని దాటేశాను.

అత్యధిక ప్రజాదరణ పొందిన మరో ఆలోచన డైటింగు. "తినడంకోసం బతుకుతామా బతకడంకోసం తింటామా" అంటూ నినదించేవారు సాధారణంగా "బతకడంకోసం తింటాం, తిన్నతరవాత మనం చెయ్యవలసిన ఘనకార్యాలు చాలా వున్నాయి" అని నమ్ముతారు. నిజంగా ఘనకార్యాలు చేసేవారివిషయంలో అది నిజం అని నేనూ నమ్ముతాను. అందుకు సందేహం లేదు. అది నమూనాగా తీసుకుంటే నేను సాధించే ఘనకార్యాలేవీ లేవు కనక నేను తినడంకోసమే బతుకుతున్నానులా వుంది. అది ఋజువు చేయడానికే కానోపు, నిన్ననే ఓ ఆత్మీయురాలినుండి రెండు పెద్ద పేకట్లు లడ్డూలూ, కాజూహల్వా వచ్చేయి. అది నాప్రాణానికి "పై"వాడు ఊపిన పచ్చజెండాలా వుంది. అంచేత డైటింగు కూడా నాజాతకంలో లేదని తేలిపోయింది.

ఇకపోతే ఈ ఊసుపోకకబుర్లు కూడా నాకాఫీలాగే నాకు అచ్చొచ్చినవి. నాకు చాలా సరదాగా వున్నవి. ఇందులో కొంచెం కాంప్రమైజుకి తల ఒగ్గి, ఆసికాలూ, యెటకారాలూ మానేసి, చాలా మర్యాదగా, మప్పితంగా, రాద్దామా అని ఒక ఆలోచన వస్తోంది. చూద్దాం.

స్వగతం: New year resoluions are like government rules, made to be broken! ఈయేటికి చివరిమాటగా, హాస్యంగా కాక, మనస్ఫూర్తిగా, ఊసుపోక అభిమానపాఠకులందరికీ శుభాకాంక్షలు. పునర్దర్శనం వచ్చే ఏడు ☺.

వుంటాను మరి.

(31 డిసెంబరు 2008.)

## 27. తుమ్మెదా ఒకసారి ...

నాచిన్నప్పుడు విన్న బాలసరస్వతీ, రాజేశ్వరరావూ పాడిన పాట, నాకెంతో ఇష్టమయిన పాట. “తుమ్మెదా ఒకసారి మోమెత్తి చూపవే” అనో ఏదో ....

ఇప్పుడు నేను పాడుకోవాల్సిన పాట --

తుమ్మకే చెల్లెలా, తుమ్మకే,

తుమ్ముతూ, దగ్గుతూ పెదచల్లబోకే నీ జలుబు నలుదిక్కులా ... అని.

ఎందుకంటే ఎవరైనా ఒక్కసారి తుమ్మినా వెంటనే ఆ జలుబుక్రిములు చుట్టుపక్కల పదడుగుల వృత్తపరిధిలో చెలరేగి సకలజనులకి అంటుకునేస్తాయి అని ఒక అపప్రథ. మీకు నామాట నమ్మకం లేకపోతే, పదిమంది గుమిగూడినచోట ఓసారి తుమ్మి చూడండి. ఓ చిన్న టపాకాయ పేల్చినట్టే. అక్కడ వున్న మొత్తం జనాలు ఒక్కసారిగా తుళ్లిపడి, ఒకడుగు వెనక్కి వేసి, తమ తమ సంచీల్లోంచి టిస్యూలు లాగి, మళ్లీ మూడడుగులు ముందుకొచ్చి, ఒకస్యూలు మీకు అందించి, మళ్లీ నాలుగడుగులు వెనక్కి వేసి మరోటిస్యూ తమముక్కుకి అడ్డంపెట్టుకు పెడమొగాలతో నిలబడతారు. పిల్లలతల్లులు గబుక్కున పిల్లలని దగ్గరికి లాక్కుని, వాళ్ల ముక్కూ నోరూ రెండు చేతుల్తోనూ మూసేసి ఆ పసిప్రాణాలని ఉక్కిరిబిక్కిరి చేసేస్తూ కాపాడేస్తారు.

జలుబూ, పడిశం, రొంపా ఎలా చెప్పినా అది కలిగించే చిరాకు అంతా ఇంతా కాదు. సాధారణంగా చర్మరోగాలగురించి ఓ జోకుంది. అవి ప్రాణాంతకాలు కావు అంచేత డాక్టర్లకి అర్ధరాత్రి ఎమర్జెన్సీ కాలులుండవు అని. జలుబు కూడా అంతే. జలుబువల్ల ప్రాణానికి ముప్పు లేకపోవచ్చు కానీ తిప్పలు తప్పవు. ఎప్పుడంటే మన శ్రేయోభిలాషులలు మనకిచ్చే సలహాలకి జవాబులు చెప్పుకోవాల్సొచ్చినప్పుడు.

అలాటి దుర్భరసమయంలో ఫోను వస్తే ఇక చెప్పఖ్కర్లేదు.

ట్రింగ్... ట్రింగ్ ...

“ఘ ..ఘ్ళ ...ళో.ఘ.ఓ.”

“ఏమీ దగ్గుతున్నావు? గొంతు అదోమాదిరి వుంది.”

“ఘఏ..ష్మీ.. ఘ.ర్షీ .మీ. ల్వేదూ ...”

"జలుబు చేసిందా.."

"ష్యూమ్"

ఆపైన అందుకునే సలహాలతో ఓ ఎన్సైక్లో రొంపిడియా తయారు చెయ్యొచ్చు.

"మిరియాలచారు తాగు"

"పాలు కాచి చిటికెడు పసుపు వేసి తీసుకో."

"శొంఠికషాయం ఠక్కున కట్టేస్తుంది".

నేను బుర్ర గోక్కుంటాను. శొంఠి ... మ్ మ్ ..శొంఠి .. దీనికి ఇంగ్లీషు పేరేమిటో... అదేం జాతకమో నాది కానీ ఇంటర్నెట్‌లో నాకు కావలసినమాటలు తప్ప అన్నీ కనిపిస్తాయి. అదేదో Murphy's law కాబోలు.

"ఆర్స్ ఆల్బ్ కి తిరుగు లేదు"

"అదేమిటి?"

"హోమియోపతి మందు. మీవూళ్లో దొరకదా?"

హోమియో డాక్టరు వున్నాడని నేను చెప్పను. డాక్టరుదగ్గరికి వెళ్లి నాకు ఫలానా మందు కావాలని అడగడం నాకు భావ్యంగా తోచదు.

ఇంకా ఆఫీసులో వచ్చే సలహాలు, అభిప్రాయాలూ ...

"Feed the fever, starve the cold"

"రోజూ ఆరెంజి జూసు తాగితే ఏజలుబూ వచ్చేది కాదు. ఎందుకు తాగలేదు?"

నాకు చిరాకేస్తుంది ఇలా అడిగేవాళ్లని చూస్తే. అయిపోయింతరవాత ఎందుకు చెయ్యలేదూ అంటే ఏం చెప్తాం. నౌ, నౌ, మేమ్,,, నౌ ... ఏమి చేయవలయునో చెప్పవలెను! ఇది స్వగతం అన్నమాట. ఇంకా ...

"Chicken soup is the best cure"

"మంచంఎక్కి, ముసుగుతన్ని, పడుకో. అదే పోతుంది."

"ఆఫీసుకి రాకు. వస్తే తుమ్మినా దగ్గినా టిస్యూ నోటికి అడ్డు పెట్టుకో."

"హేఁవిటీ పనిలోకి వెళ్లలేదు జలుబు చేసిందనే? చోద్యం! ఎన్నడూ ఎరగం ఇలాటి సుకుమారాలు ..."

మాటలు వేయేల .. నాబాధ జలుబుతో కాదు, దానివెంట వచ్చే సువాక్కులూ, జనాల చిత్ర విచిత్ర కేళీ ...

నాకు డాక్టరు స్నేహితులు వున్నారు, డాక్టరు-భార్య-స్నేహితులు అంటే డాక్టరు అయినవాడికి భార్య అయి, నాకు స్నేహితులుగా ద్విపాత్ర పోషిస్తున్నవారు వున్నారు, లేదులెండి, డాక్టరు-భర్త-స్నేహితులు అంటే స్త్రీ డాక్టరులకి భర్తలయి నాకు స్నేహితులు అయినవారు లేరు. ఎంచేతో మరి!

డాక్టరయితే  ఫలానా మందు వేసుకో అని వెంటనే చెప్పేసేయరు. మాల్ ప్రాక్టీసు బాధ ఒహటి కదా. "నీ ప్రైమరీ ఫిజిషయనుతో మాటాడేవా?" అంటారు మర్యాదగా.

"లేదు. అదే పోతుంది అని వూరుకున్నాను."

"పోతుందిలే. కానీ పోయేవరకూ ఎందుకు బాధ పడడం?"

"నాకు మందులు ఇష్టం లేదు."

"ఎవరు మాత్రం మందులు పకోడీల్లా ఉవ్విళ్లూరుతూ తింటారేమిటి? హాచ్చి హాఛ్చి అంటూ ఆ తుమ్ములూ దగ్గులూ వదిలించుకోడానికి వేసుకుంటారు గానీ ..."

డాక్టరు-భార్య-స్నేహితులయితే, "ఎన్నిరోజులనించీ? పొడిదగ్గా? గొంతులో గొరగొరగా వుందా? రాత్రి నిద్ర పడుతోందా .." ఇలా అక్కడిక్కడే వేళా పాళా, ఎపాయింటుమెంటూ గట్రా అక్కర్లేకుండా, డయాగ్నోజు చేసేసి ఏదో మందు కూడా చెప్పేస్తారు.

ఇంకా ఎలర్జీసేమో అని సూచించి, ఆపైన రాగల బాధలు వర్ణిస్తారు సవిస్తరంగా, "నువ్వేమో చలిగాలి అంటావే వాక్కు కూడ పోతుంటివి. ఫ్లూ సీజను గంద. ఆమాదిరి గాలి గుండెలకి తగిలితే బ్రోంకైటిసూ, న్యుమోనియా ... ఎన్ని బాదలో తెల్సా" అంటూ ఊరడిస్తారు.

మరీ అంత క్షుణ్ణంగా రాగల పరిణామాలు వివరిస్తుంటే, నేనేం చెయ్యను! సరే మందు వేసుకుంటానని చెప్పేస్తాను. మళ్లీ మర్నాడు నా డా.భా.స్నేహితురాలు నిజం డాక్టరంత ఠంచనుగానూ ఫోను చేసి "మందు తింటివా? ఎట్లుంది ఈదినం?" అని అడిగితే, నేను అతికష్టంమీద ఊపిరి బిగబట్టి, గొంతు సవరించుకుని, రెండు క్షణాలపాటు దగ్గు రాకుండా ఆపుకుంటూ, "బాగానే వుంది. మందేసుకున్నాను" అని చెప్పేస్తాను.

తమరికి తెలీందేముంది ఆపత్సమయాల్లోనూ, వారిజాక్షులందూ బొంకవచ్చు అని పెద్దలు మనకో సుళువు ఏర్పాటు చేసేరు కద.

(6 జనవరి 2009. )

# 28. టెనిస్ చూడ్డం ఓ తమాషా

నాకు ఆటలు సరదా. అంటే ఆడతానని కాదు. అలాగని అస్సలు ఆడలేదనుకోకండి. చిన్నప్పుడు బాడ్మింటను, వాలీబాలు కోర్టులెక్కేను నేను సైతం. అమెరికా వచ్చేక, అసలు వీధిలోకి వెళ్లడమే ఓ ఎడ్వెంచరు. అంటే చెయ్యలేదని కాదు. నా శౌర్యం ఋజువు చేసుకున్నాను ఆవిధంగా కూడా.

ఇంతకీ ప్రస్తుతం ఆస్ట్రేలియన్ ఓపెన్ .. ఆస్ట్రేలియాలో పగలు ఆడినవి మాకు పగలు మళ్లీ కొత్తగా చూపుతారు. నేను నాలుగ్గంటలకే లేస్తాను కనక చివరి నాలుగు సెట్లు ఆడుతున్నప్పుడే (అంటే వాళ్ల రాత్రివేళ) చూస్తాను. మళ్లీ మధ్యాన్నం టీవీ పెడితే తెలిసింది అది నేను అంతకుముందే చూసేశానని. అలా చూస్తున్నప్పుడు ఎవరు గెలుస్తారో ముందే తెలుసు కనక అట్టే సరదాగా వుండదు.

అలాటప్పుడే ఆటమీద దృష్టి తగ్గి చిరాకు కలిగించే విషయాలు ఎక్కువ కనిపిస్తాయి. అవి మీతో పంచుకోడమే ఈ వ్యాసం ధ్యేయం. ఇది మీకు చిరాకు అనుకుంటే వెంటనే చదవడం ఆపేసి, టీవీలో రీరన్లు చూసుకోండి. ☹

నేను అసలు చూడ్డమే కాదు టెనిస్ ఆడేను కూడా ఒక వారం రోజులపాటు. మాకు ఇక్కడ యూనివర్సిటీలో వేసవిశలవుల్లో ఫిజికల్ఎడ్యుకేషను విద్యార్థులు నామమాత్రం ఫీజుకి టెనిస్ నేర్పుతారు సరదాగా ఆడుకునేవారికి. అలాటప్పుడు అన్నమాట నేను వెళ్లేను. అక్కడ నేర్చుకుంటున్న వాళ్లందరూ పాతికేళ్ల లోపువాళ్లు, నేను తప్ప. వాళ్లు నామొహం చూసి ఏం అనుకున్నారో తెలీదు కానీ ఒకసారి లాగి పుచ్చుకు బంతి బేస్ లైనుకి కొట్టేసరికి వావ్ అని గుమ్మయిపోయేరు.

''గుడ్ షాట్, గ్రాంమా'' అంది నాపక్కనున్న చైనీస్ అమ్మాయి.

అదుగో అప్పుడే నాకు చిరాకేసింది. నానిజం వయసు (కేలండరు వయసూ, నిజం వయసూ ఒకటి కాదని ఓ టీవీడాక్టరు చెప్పింది) నేను శాంతంగా, ''మాదేశంలో కూడా పెద్దవాళ్లని పేరు పెట్టి పిలవరు. ఇక్కడ చాలామంది నన్ను ఆంటీ అంటారు. మీదేశంలో గ్రాంమా అంటారా?'' అని అడిగేను.

''అవును. కానీ నువ్వు గ్రాంమావే'' అంది.

ఆతరవాత కొన్నాళ్లు బాడ్మింటను ఆడడానికి వెళ్లేను. అది వేరే కథ.

ఇంతకీ టెనిస్ (చాలామంది టెన్నిస్ అని రాస్తారు కానీ అది తప్పు. తెలుగు ఉచ్చారణననుసరించి రాతలు కదా. ఇంగ్లీషులో ద్విత్వాక్షరమే అయినా పలికినప్పుడు వత్తు పలకరు. అంచేత నేనే రైటు!). ఇంతకీ

చెప్పొచ్చేదేమిటంటే, టెనిస్ టూర్నమెంటుల్లో నాకు అర్థంకానివి కొన్ని వున్నాయి. మొదటిది, ఏస్ కొట్టినప్పుడు అది యాదృచ్ఛికంగా జరుగుతుందా? లేక వ్యూహరచనలో భాగంగా ఏసులేస్తారా? ఎప్పుడో జ్ఞాపకం లేదు కానీ పీట్ సాంప్రాస్ వరసగా నాలుగు ఏసులు కొట్టి గేములు కొట్టేసిన సందర్భాలున్నాయి. నా అభిప్రాయంలో ఏసులు న్యాయం కాదు. ఏసుల్ని outlaw చెయ్యాలి. ఎందుకంటే ఏసు కొట్టినప్పుడు అవతలివాడు ఆడడానికేమీ లేదు. ఇది జెల్ల కొట్టి బిళ్లలు లాక్కోడంలాటిది. దీనికి మినహాయింపు వుండొచ్చు టైబ్రేకు జీడిబంకలా సాగుతున్నప్పుడు. ''రెండు ఏసులు కొట్టి ముగించేయరా బాబూ'' అని అరవాలనిపిస్తుంది నాకు.

రెండోది వ్యాఖ్యాతలు. వీరు చెప్పులో రాయి, చెవిలో జోరీగా చిట్టాలోకి ఎక్కవలసినవారు. నేను ఈ ఆటలు చూడ్డం మొదలెట్టినరోజుల్లో అసలు నాకు అర్థం అయేది కాదు ఎందుకలా వసపోసిన పిట్టల్లా వదలకుండా నస పెడతారో. మామూలుగా ఇద్దరో ముగ్గురో వుంటారు వ్యాఖ్యాతలు. అందులో ఒకడు ఆపకుండా వాయించేస్తూంటాడు. ''వావ్ ... వాలీ ... రైటాన్ బేస్ లైన్ ... గ్రేట్ పాయింట్, ఏస్.'' ఇలా వదరుతూనే వుంటాడు.

''నాక్కూడా తెలుసులేవోయ్, నేనూ చూస్తున్నాను'' అని అరవాలనిపిస్తుంది నాకు అప్పుడు.

అంతకంటె పనికిమాలిన కామెంటులు, ''జోళ్లలేసులు ముడేసుకుంటున్నాడు, చొక్కా మార్చుకుంటున్నాడు'' లాటివి. కొన్నాళ్లతరవాత నాకు మరో ఆలోచన వచ్చింది. బహుశా ఏ ఆఫీసుల్లోనో కూర్చుని ఆట చూసే యోగంలేక ఏరేడియోలోనో ఫాలో అవుతున్నవారి సౌకర్యార్థం చెబుతున్నారేమోనని. అదే నిజమయితే అది వేరే వేవ్‌లెంతులో ప్రసారం చెయ్యాలని నేను ప్రతిపాదిస్తున్నాను.

ఇంకా కొన్నాళ్లుటు రెండో కామెంటేటరుకి ఆట తెలీదు కాబోలు, ఈయనగారు ఆయనకి టెనిస్ పాఠాలు చెబుతున్నారు కాబోలు అని కూడా ఆలోచించేను. టెనిస్ చూస్తున్నప్పుడు, కారు నడుపుతున్నప్పుడులాగే, పక్కవాళ్లు మాటాడుతూంటే తోచదు నాకు. ఆట చూస్తూ నా అనందం నేను అనుభవించాలి. నాకు నేను వావ్ అనుకోవాలి కానీ పళ్లు లేనివాళ్లకి వక్కపలుకులు నమిలి ఇచ్చినట్టు నాబదులు మరొకరు వావ్‌లు పలకడం నచ్చదు.

ఈ కారణాలన్నిటివల్లా, నేను షాట్‌గన్‌లా రిమోటు పుచ్చుకుని శబ్దం తగ్గించుకుంటూ వస్తాను. కానీ అదీ బాధే. ఆటగాడు ఛాలెంజి చేసినప్పుడు, రిఫరీ ఏం అంటున్నాడో తెలీదు. ముప్ఫైలనాటి మూకీల్లా అంగన్యాస కరన్యాసాలు మాత్రమే చూసి ఆనందించాలి. లేదా అప్పుడు మళ్లీ శబ్దం హెచ్చించాలి. ఇలా అసలు కంటే కొసరు ఎక్కువ అయి, రిమోటు ఆపరేషను పెద్ద డిస్ట్రాక్షను అయిపోతుంది.

ప్రస్తుతం నాకు మరో బాధ. రిమోటు చెడిపోయింది. అంచేత వాల్యూము హెచ్చుతగ్గులు చెయ్యాల్సినప్పుడల్లా, కప్పుకున్న శాలువా పక్కన పెట్టి, ముడుచుకున్న కాళ్లు సాగదీసి, ఐదడుగులు ముందుకి వేసి, టీవీ దగ్గరికెళ్లి వాల్యూము హెచ్చించడమో తగ్గించడమో చేసి, తిరిగి వచ్చి కూచోవాలన్నమాట. “మరో రిమోటు కొనుక్కోవచ్చు కదా. టెన్ బక్స్” అంటూ కసురుకుంది మాఅమ్మాయి ఆమాట చెప్తే.

ఇక్కడే నాకున్న మరో దురలవాటు కూడా చెప్పేస్తాను మళ్లీ ఈమాట ఎత్తకుండా. ఏ వస్తువు చెడిపోయినా అది లేకుండా ఎన్నాళ్లు గడుపుకోగలనో ముందు నన్ను నేను పరీక్షించుకుంటాను. రెణ్ణెల్ల కిందట మైక్రోవేవు లేకుండా మూడువారాలు గడిచేయి. చూద్దాం. పైగా ఇలా పదిసార్లు లేచీ, కూర్చునీ చేస్తే నా దినసరి వ్యాయామంలో పావుభాగం అయిపోతుంది కూడాను. Keep moving parts moving అన్నది నా ఆరోగ్యసూత్రం.

హో … హో మాచ్ పాయింట్ … . తరవాత మాటాడుకుందాంలెండి.

(25 మార్చి 2009.)

# 29. వెదురుమొక్క అదురుష్టం

ఈరోజు ఉదయం లేస్తూనే తెలివొచ్చింది. తెలుగుతూలికలో ఒకటురు చెప్పి నెలరోజులయింది. ఇంగ్లీషుతూలిక అయితే మరీ అన్యాయం. మూణ్ణెల్లయింది. అదయినా ఒక్క వ్యాసం పెట్టి. ఏమిటో "పనీ లేదు, తీరుబడీలేదు," "క్షణం తీరికలేదు దమ్మిడీ ఆదాయంలేదు" లాటి జాతీయాలన్నీ వరసగా వచ్చేస్తున్నాయి నాలుకమీదకి.

ఎటు పోయింది చెప్మా కాలం! అయినా నాచాదస్తం కానీ టైమెక్కడికి పోతుంది. తోచదు తోచదు అంటూ దిక్కులు చూస్తుండగానే చేతివాచీలో చేతులకి కాళ్లొచ్చి నడిచిపోతున్నాయి గున్నయేనుగుల్లా.

అసలేమయిందంటే, కబుర్లు చెప్పుకుందాం రారమ్మంటూ పిలిచిందో కవయిత్రి. మీకత చెప్పమంటూ కలం పుచ్చుకున్నదో జర్నలిస్టు. మీవ్యాసం పునరపి మాసైటులో పెట్టుకుంటామంటూ ప్రకటించేరు మరో జర్నలిస్టు. మాకో వ్యాసం రాసిమ్మంటూ ప్రత్యేకాహ్వానించింది ఓ విశ్వవిద్యాలయ ఆంగ్ల సారస్వతపత్రిక. తిరిగీ టెల్గూ టీచింగు చెయ్యమంటున్నారు యూనివర్సిటీవాళ్లు. చెప్పొద్దూ, ఇందులో దమ్మిడీ ఆదాయం కూడా వుంటుంది. హాహాహా ...

ఏకకాలంలో హోల్ మొత్తం లోకం మేలుకొని నా అస్తిత్వానికి ఉదయగీతికలు ఆలపించేసినట్టు వుందనుకోండి హఠాత్తుగా. అహో! ప్రభవించెను నాజాతకమంటూ అరవబోతే విడలేదు గళం. అతిశయాలనిశ్శబ్దం వేసుకుంది తెరలు అరవిరిసినగులాబీరేకులలా. ఏఁవిటా తొందర? ఇంకా తెల్లవారలేదంటూ బుద్ధి చెప్పుకున్నాను నాకు నేనే.

ఇంకా తేరుకోకముందే యూనివర్సిటీవారు మళ్లీ పిలిచి "నీటీచింగు పదవి మరొకరికి ఇచ్చేస్తున్నాం" అన్నారు. సరేలెమ్మనుకుని, పదిహేను పేజీలవ్యాసం రాసుకుంటూ కూర్చున్నాను. మళ్లీ నిన్న వాళ్లే పిలిచారు రారమ్మని. ఇలా ఉందీ, లేదూ అనుకుంటూ, నానాటికీ నాటకమూ అంటూ యమ్మెస్ టేపు పెట్టేసుకుని, అక్కజపడుతూ, లేస్తూ, విన్నవారికి మాత్రం జవాబులిచ్చుకుంటూ పొద్దు పుచ్చేసుకుంటుంటే గడిచిపోయిందన్నమాట కాలం. అదీ సంగతి.

అసలింతకీ ఇలా నాజాతకం తిరిగిపోడానికి అసలు రియల్ కారణం ఆమధ్య నేను కొన్న లక్కీ బాంబూ (bamboo, not bomb) అనుకుంటాను.

చాలాకాలం క్రితం ఇచ్ఛాపురపు జగన్నాథరావుగారు రాసిన కథ జ్ఞాపకం వస్తోంది. ఆకథలో ఒకతను లాటరీ టికెట్టు కొని జేబులో పెట్టుకుంటాడు. ఆనెంబరుకి లక్కు తగుల్తుంది. అంతకుమున్నే టికెట్టుసంగతి తెలీని భార్య ఆ చొక్కా చాకలికి వేసేస్తుంది వుతుక్కురమ్మని. ఇహ చెప్పక్కర్లేదు కద బాబుగారి కథకళి. ఆతరవాత చాకలి టికెట్టు తెచ్చి అమ్మగారికి ఇస్తాడు. ఆవిడ అయ్యగారికి ఇస్తుంది. ఆబాబు ఎంతో ఆనందపడిపోతూ, ‘‘నువ్వు నాదేవతవి’’ అంటూ ఆమెని కౌగలించుకుంటాడు. కథ పేరు ‘‘ధనం చేసిన దేవత.’’

ఇంతకీ లక్కీ బాంబూలో ఇంత లక్కుందని తెలిస్తే నేను 20వశతాబ్దంలోనే కొనీకపోదునా ఆమొక్క? ప్చ్. అందుకే అంటారు దేనికయినా కాలం ఖర్మం కలిసిరావాలని. ఏమయినా నాకు మాత్రం గట్టినమ్మకం పడిపోయింది ఇదంతా నాకు లక్కీబాంబూ తెచ్చిన లక్కేనని. అంచేత ఇప్పుడు అడిగినవాళ్లకీ, అడగనివాళ్లకీ పని గట్టుకు చెప్పేస్తున్నా లక్కీ బాంబూ ఒకటి తెచ్చి ఇంట్లో పెట్టుకోండని. అన్నట్టు మరోమాట. ఈమొక్కకి అట్టే సేవలు చెయ్యక్కర్లేదు. నెలకోమారు ఇన్ని నీళ్లు పోస్తే చాలుట. ఎంతసుఖమెంతసుఖమూ అనీ పాడుకుందాం, రండి మరి. మీ లక్కీబాంబూ తెచ్చుకోండి. .

(14 మార్చి 2009)

# 30. గంటకూలీ అణాపరక

ఒకసారి ఒక చాకులాటి కుర్రవాడు దేవుడితో, ''అయ్యా, దేవుడుగారూ, దేవుడుగారూ, జలధిగంభీర, జలజనయన, మేరునగధీర, మిమ్ముల బొగడ నాతరమా'' అని కొంచెంసేపు పొగిడి, తరవాత, ''మీకు క్షణము యుగముతో సమానమని విన్నాను. నిజమేనా?'' అని అడిగాట్ట.

అందుకు దేవుడుగారు ధీరోదాత్తచిత్తముతో, ''అవున్నాయనా'' అన్నారుట.

మన చా.కు. ఇంకా సందేహం తీరక, ''మరి తమరికి ఒక కానీ కోటిరూకలతో సమం అన్నారు, నిజమా?'' అని అడిగాట్ట.

దేవుడుగారు నిదానంగా సమాధానంగా ''అవున్నాయనా, నిజమే'' అన్నారుట.

అప్పుడు మన చా. కు. ''అయ్యా, దేవుడుగారూ, మీరు భక్తవత్సలురున్నూ, కరుణాసముద్రులున్నూ అని కూడా విన్నాను. నాయందు దయ యుంచి నాకు ఒక్క కానీ దయ చేయించండి'' అన్నాడు ఎంతో వినయంగా.

అప్పుడు దేవుడుగారు, ''అలాగే నాయనా. తప్పకుండాను. ఒక్క క్షణం ఆగు'' అన్నాట్ట ఎంతో ప్రేమగా.

ఈకథ విన్నతరవాత నాకు అర్థమయింది డబ్బుకీ, కాలానికీ లంకె పురాణయుగంలో కూడా వుందనీ, అనాదినిధనుడికి కూడా లెక్కల్లో తిరకాసు బాగానే తెలుసనీ.

అమెరికాలో కాలము అనగా డబ్బు అని అర్థం చెపుతారు. ఎంచేతంటే, మీరు ఎంతకాలం ఖర్చు పెచ్చించేరో దానికి తగ్గట్టుగానే మీ ఆదాయం కూడా వుంటుంది అని. దాన్నే తిరగేసి చెప్పాలంటే, మీరు ఎదటివారి కాలం ఎంత పెచ్చించేరో దానికి తగ్గట్టే మీకు ఖర్చు కూడా వుంటుంది అని.

ఎలాగంటే, గోడకి మేకు కొట్టడానికి ''పనివాడి''ని పిలిచేననుకోండి. మాఊళ్లోమాటే చెబుతున్నాను. ఆ పనివాడు రావడానికి 37న్నర డాలర్లు దారిఖర్చు. వాడింటినించీ మాఇంటికి రావడానికి ఎంతసేపు నిజకాలం అన్నది కాదు ఇక్కడ లెక్క ఎంచేతో మరి. ''ఆపైన మేక్కొట్టడానికి ఎంతోసేపు పట్టకపోవచ్చు కానీ నా కనీస గంట ధర 80 డాలర్లు ఇచ్చితీరాలి''అంటాడు.

సరేనంటాను. ''రెండువారాలతరవాత మంగళవారం మధ్యాన్నం ఇంట్లో వుంటారా?'' అంటాడు.

“నేను బయటికి వెళ్లొచ్చు. ఖచ్చితంగా ఎన్నిగంటలకి వస్తావో చెప్తే, అప్పుడు వుంటాను” అంటాన్నేను.

“అలా చెప్పలేనండీ. మీ ఫోన్నెంబరివ్వండి. పిలుస్తాను” అంటాడు.

మంగళవారం వస్తుంది. ఆరోజు పొద్దున్న ఆ పనివాడుగారు పిలిచి “మధ్యాన్నం రెండు గంటలకి ఇంట్లో వుంటావా?” అని అడుగుతాడు. ఉంటానంటాన్నేను. ఉండకేం చేస్తాను, ఎవరికోసం? నాపనా, మరేవన్నానా.

ఇక్కడ నా కేరక్టరుగురించి కొంచెం చెప్పాలి. సాధారణంగా మధ్యాన్నం నాలుగ్గంటలకి ఎవరేనా వస్తారంటే, ఉదయం పదిగంటలనించీ నాకు నర్వుసు. మరే పనీ తోచదు. ఆరోజూ అంతే. పనివాడికోసం ఎదురుచూస్తూ మరేపనీ చేసుకోకుండా అనుక్షణం గడియారంవంక చూస్తూ కూర్చుంటాను. వంట కూడా చెయ్యను. What is that smell అని మొహం వికారంగా పెట్టి అడిగేవాళ్లని చాలామందిని చూసేను మరి. అంచేత ఆ పనివాడు వచ్చివెళ్లిన తరవాతే చేసుకుందాంలే అని రంగూ, రుచీ, వాసనా లేని నానా గడ్డీ తింటూ గడుపుతాను ఆపూటంతా.

మధ్యాన్నం రెండూ, రెండుంబావూ, రెండున్నరా .. తరవాత మూడూ అవుతుంది. అప్పుడు పిలుస్తాడు ఆ పనివాడు. తను వేరేపనిలో హెల్డప్ అయిపోయేననీ, కొంచెం ఆలస్యం అవుతుందనీ చెప్తాడు. ఇప్పటికి గంట ఆలస్యం అయింది కదా. ఈగంటకి నాకెవరిస్తారు ఖర్చులు అని అడగడం అమాయకత్వం. బుద్ధి తక్కువ. నాకాలానికి ధర లేదు.

అలాగే డాక్టర్లూ, లాయర్లూ ,,, అందరూ వారి వారి కాలానికి ధరలు కడతారు. నేను డాక్టరుదగ్గరికి వెళ్తే, నాదారిఖర్చు ఎవరూ ఇవ్వరు. అక్కడ వెయిటింగురూంలో ముప్పావుగంటా, ఎగ్జామినేషన్ రూంలో అరగంటా … ఇలా నాకాలం నీళ్లలా ఖర్చయిపోతూంటూంది. దానిమీద దమ్మిడీ ఆదాయం లేదు.

డాక్టర్లంటే నాకు సానుభూతి లేదనుకోకండి. వాళ్లు చదువుకి పాపం అరవైవేలో, అరవై లక్షలో ఎంతో అవుతుందిట. ఎంచేతా? వాళ్ల ప్రొఫెసర్లకి జీతాలూ, అవీ. ఆ జీతాలు ఎందుకంటే వాళ్లు చదువుకున్నప్పుడు ఖర్చు వాళ్లకి అంతకంతా అవుతుందిట … ఇలా తవ్వుకుంటూ పోతే మొదట చెప్పేను చూడండి ఆ అనాదికాలంలో తేల్తాం.

నాలుగేళ్లకిందట అనుకుంటాను విస్కాన్సిన్ స్టేటువాళ్లు సిగరెట్లకంపెనీమీద కేసు పెట్టేరు. స్టేటులాయర్లు గంటకి 2700 అంటే అక్షరాలా రెండువేల ఏడువందలు చొప్పున ఛార్జీ చేసేరుట స్టేటుకి. ఎలా వేసేరీ లెక్కలు అంటే, లాయరుగారి జవాబు “ఇది చాలా కాంప్లికేటెడ్ కేసు” అని. కాంప్లికేటెడ్ అయితే మరో పన్నెండు గంటలో, ముప్పై గంటలో ఖర్చు పెట్టొచ్చు కానీ, ఒఖ్ఖ గంటకి ధర ఎలా పెరుగుతుందో నాకు అర్థం కాదు.

అసలు ధరలు ఎలా నిర్ణయిస్తారంటే నాచిన్నప్పుడు చదువుకున్నానులెండి. వస్తువులు హెచ్చుగా వుంటే ధర తక్కువా, కొనేవాళ్లు హెచ్చుగా వుంటే ధర ఎక్కువా అని. దాన్నే సప్లై ఎండ్ డిమాండ్ అంటారుట. ఇది చెప్పడం తేలికే గానీ, ఇంత భూప్రపంచకంలో ఎవరు ఏది కొంటారో ఎలా తెలుస్తుంది. ఏమిటోలెండి ఆగొడవంతా నాకు తెలీదు కానీ ... నాకాలానికి మాత్రం అట్టే విలువున్నట్టులేదు. తెల్లారి లేస్తే, నాకాలం ఎంత వృథా అయిపోతోందో అడక్కండి. తలుచుకుంటే కడుపు తరుక్కుపోతుంది.

అలాగే ఆమధ్యనెప్పుడో బిల్ గేట్సు వేలకీ వేలు ఇండియాలోనూ, ఆఫ్రికాలోనూ ధర్మం చేసేడంటే నాకేం గొప్పగా అనిపించలేదు. నేను మూడేళ్లకోసారి ఒక కంప్యూటరుచొప్పున పాతికేళ్లుగా బోలెడు ఖర్చు పెట్టేను. గేట్సు చేసినదానంలో నాడబ్బు కూడా వుంది. అదంతా ఆయన సొంత సొమ్మే కాదు.

ఈరోజు తెల్లారి లేస్తూనే నాకో ఘనాపాఠీ ఆలోచన వచ్చింది. నా అభిప్రాయం ఏమిటంటే, ప్రతి ఒక్కరికాలానికి ఒకే విలువ పెట్టాలని. గంటకి అణాపరక. అంతే. గోడకి మేక్కొట్టడానికి అణాపరక. రేడియాలజీ చదువుకోడానికి ఫీజు అణాపరక. ఆపాఠం చెప్పే ప్రొఫెసరుకి జీతం అణాపరక. అనకాపిల్లికి బస్సుటికెట్టూ అణాపరకే, ఒక్లహోమాకి ప్లేను టికెట్టూ అంతే. కాడిలక్ కారూ, మౌంటెన్ బైసికిలూ, ఏడంతస్థుల మేడా, పూరికొంపా .. ఇలా అన్నిటికీ ఒకే ధర వుంటే అదీ సమసమాజం. ఏమంటారు? మీక్కూడా నచ్చితే చెప్పండి. ఓ చట్టం తయారు చేసేయమని మన అణాపరక నాయకులకి అర్జీలు పెట్టేసుకుందాం. అన్నట్టు ఈ అర్జీ పకడ్బందీగా రాయడానికీ ఓ అణాపరక లాయరు ఎక్కడేనా దొరుకుతాడేమో కూడా చూడండి.

అణాలు చెలామణి అయినకాలంలో జన్మించనివారి సౌకర్యార్థం - పూర్వకాలమున రూపాయికి పదహారు అణాలు, అణాకి నాలుగు కానులు. పరక అనగా సగము. అణాపరక అంటే ఒకటిన్నర అణాలు లేక ఆరు కానులు. బేడాపరక అంటే మూడణాలు. ఇతర ప్రాంతాల్లో పరక అంటే రెండు అణాలు అనీ, పధ్నాలుగు అనీ అర్థాలు వాడుకలో వున్నట్టు కనబడుతున్నది కానీ నాఅనుభవంలో అణాపరక అంటే ఆరు కానులే.

(27 మార్చి 2009.)

# 31. ఒత్తులేవీ ...

దీపారాధనక్కాదులెండి, భాషారాధనలో ఒత్తులమాట నేను చెప్పబోయేది. తెలుగు రాతల్లో వొత్తులేవీ అని అడుగుతున్నాను. మనకున్న గొప్ప ఆస్తి వొత్తులూ, దీర్ఘాలూ, ద్విత్వాక్షరాలూను. ఇంగ్లీషు చూడండి, మనకున్న అక్షరాల్లో సగం కూడా లేవు. ఇంతకీ చెప్పొచ్చేదేమిటింటే,

మనం తెలుగులో రాస్తున్నప్పుడు వొత్తులూ, దీర్ఘాలూ తప్పనిసరిగా గమనించుకోవాలీ అని. తెలుక్కి బొత్తిగా గుణింతాలు లేకుండా పోతున్నాయి. "మేఁవిలాగే మాట్టాడతాం" అంటూ నోరాడినట్టు కీళ్లాడించేస్తున్నారు కీబోర్డులమీద తెలుగురచయితలు. అది చాలనట్టు, తెలుగు ఇంగ్లీషులో రాయడం కూడా బాగా ముదిరిపోయింది. అది చదవలేక నాప్రాణం కడగట్టిపోతోంది. అఆలు దిద్దుకున్నదినాలు తిరిగొస్తున్నాయి ఆమాటలు కూడబలుక్కు చదవలేక.

మాటవరసకి, ఓ పాఠకుడో పాఠకురాలో నాకు ఇంగ్లీషులో రాసారనుకోండి paathakulu అని. అసలు దీనికే నాలుగు రూపాంతరాలున్నాయి - pAThakulu, paaThakulu, paathakulu, patakulu - ఇలా ఎవరి వీలుని బట్టి వారు రాసుకుపోతున్నారు. నేనయితే అది కూడబలుక్కుని చదవబోయి, పాటకులా, పాతకులా, పాఠకులా అన్న సందేహంతో ఆ ముక్కదగ్గరే పది క్షణాలు ఆగిపోతాను. మొదటి స్పెల్లింగే కరెక్టు అని చెప్పకండి. ఏది కరెక్టవునో ఏది కాదో అని కాదు, ఇన్నిరకాలూ ఎక్కడో అక్కడ కనిపిస్తూనే వున్నాయి.

ఆమధ్య నాబ్లాగులో ఒకాయన ఇలాగే తమ అభిప్రాయం అర్థంతర తెలుగులో వెలిబుచ్చి, చివర et tu malati garu అని రాసేరు. చెప్పొద్దూ, కేవలం నా అజ్ఞానంచేతనే అది నాకు "ఛూ. మాలతి"లా గోచరమయింది! అసలు et తో మొదలయింది నాబాధ. ఇంగ్లీషులో రాస్తున్నప్పుడు, @ అనే రాయొచ్చు కదా. అది అర్థం చేసుకుని ముందుకి సాగబోతే, టియు కరక్కాయలా అడ్డు పడింది. ఇదేఁవిట్రా ఈయన ఇవాళ "ఛూ మాలతి" అన్నాడు, రేపు మరొకావిడ "ఛీ మాలతి" అనగలదు, అదీ నాబ్లాగులోనే అనుకుని చాలా "భాధా" పడిపోయి. ఆ te malatiకి అంటకత్తిరేసేశాను. ఆతరవాత తీరిగ్గా ఆలోచించగా నాకు తోచింది, పాపం ఆయన మంచిమనసుతోనే రాసేరు, తు అన్నది నిజానికి తూ (చూశారా దీర్ఘం) అంటే తూలిక అని. (అలాగే చి. మాలతికి చిరంజీవి మాలతి అని అన్వయం చెప్పుకోవచ్చు) కానీ చెప్పేను కదా నాకు తెలుగు ఇంగ్లీషులో చదవడం రాదు. మాబళ్లో ఆభాష నేర్పలేదు.

నేను స్కూల్లో యస్సెల్సీలో సంస్కృతం తీసుకున్నాను అభిమానభాషగా. ఆక్లాసులో నేను ఒక్కదాన్నే విద్యార్థిని. మామేష్టారు సంస్కృతంలో గొప్పపండితులు. ఆయనకి ఇంగ్లీషు రాదు. అంచేత టీకా తాత్పర్యాలు ఆయన తెలుగులోనే చెప్పేవారు. ఆరోజుల్లో statewide పరీక్షలు మాత్రం ఇంగ్లీషులో జరిగేవి. అంచేత నేను చెప్పుకోడానికి - చదువుతున్నదీ సంస్కృతం, అర్థం చేసుకుంటున్నది తెలుగులోనూ, పరీక్షలు రాయడం ఇంగ్లీషులోనూ అన్నమాట. అలా ఏకకాలంలో మూడు భాషల్లో తల పెట్టేసేను నాప్రయత్నమేమీ లేకుండానే. ఈరోజుల్లో "మేం ఇంగ్లీషు బళ్లో చదువుకున్నాం అంచేత మాకు తెలుగు రాదు" అనేవారు ఈవిషయం గమనించాలి. అసలు ఆనాటి రచయితలు చాలామంది అనేక భాషల్లో నిష్ణాతులు. గత పాతికేళ్లలోనే వచ్చింది "ఒక భాష కంటె ఎక్కువ చదవలేం, మాటాడలేం" అన్న వాదం.

ఆ సంస్కృతంరోజుల్లోనే నాకు తెలిసింది భాషాసౌందర్యం, మాధుర్యం సంగతి కూడా. ఏ కావ్యమో గుర్తు లేదు కానీ, మా మేష్టారు అన్న మాట మాత్రం ఇప్పటికీ గుర్తుంది, ఆయన ముఖకవళికలలో వేదన ఈరోజుకీ నామనసులో కనిపిస్తుంది తలుచుకుంటే.

నేను శ్లోకాలు చదువుతున్నప్పుడు ఆయన "మందాకినీ వృత్తాలమ్మా, చక్కగా చదివితే బాగుంటాయి" అనేవారు తలొంచుకుని పుస్తకంలోకి చూస్తూ.

నాకేమో అలా చదవడం వచ్చేది కాదు. పాపం ఆయన ఎంత బాధ పడ్డారో నాలాటి చేలా దొరికినందుకు. ఇప్పుడు అమెరికాలో తెలుగు పాఠాలు చెప్తుంటే నాకు మరింతగా తెలుస్తోందది.

కంప్యూటరులో తెలుగు రాయడం వచ్చేక ఇప్పుడా బాధ వున్నట్టులేదు. 'బాధ'లో ఒత్తు 'బా'కా 'దా'కా అని ఆలోచించి రాసేవాళ్లు తగ్గిపోతున్నారనుకుంటే నాకు చాలా బాధేస్తుంది సుమండీ. నాకు తెలీకడుగుతానూ, శ్రీకంఠం పేరుగలవాడు శ్రీకంటం అని రాసుకోగా చూశారా ఎవరైనా? బ్రహ్మానందంగారు బమ్మానందం అని రాస్తే ఒప్పుకుంటారా? ఒప్పుకోరు. అంచేత, తెలుగు తెలుగులో రాయడమే కాక వొత్తులున్నచోట వొత్తులు పెట్టాలి అని నేను గట్టిగా ప్రతిపాదిస్తున్నాను. అంతేకాదు వేరొక చోట పెట్టరాదు అని కూడా సవినయంగా మనవి చేసుకుంటున్నాను. ఉదాహరణకి అస్తి అంటే ఉంది అని అర్థం, ఆస్తి అంటే డబ్బూ, దస్కం, అస్థికలు అంటే ఎముకలు. ఆస్థికలు అన్నమాట లేదు. ఆస్తికులు అనొచ్చు కానీ ఆస్థికులు అనడం మంచిది కాదు.

సంస్కృతంలో చాలా నియమాలున్నందున అనుకుంటాను నాకు భాష రాకపోయినా, ఆపట్టింపులు ఒంట బట్టేశాయి. స్పష్టంగా మాటాడ్డం, ఒత్తులూ పొల్లులూ పెట్టవలసినచోట పెట్టడం - నేను జాగ్రత్తగా చూసుకుంటాను.

ఇంతకీ ఇదంతా ఎందుకు మొదలు పెట్టేనంటే, నాలుగురోజులకిందట నెటిజన్, http://netizen.blogspot.com, నాటపామీద ఓ మాట రాసేరు. అందులో ఆయన నా "కథామాలతీయం"లో ప్రస్తావించిన 'శ్చ' కీ 'చ్చ' కీ తేడా లాటి విషయాలు చెప్పమని అడిగేరు. ఆ దృష్టి నాకెలా వచ్చిందో ఓ ముక్క రాద్దాం అనిపించి మొదలెట్టేనన్న మాట.

నారాతలు చదువుతుంటే ఎదురుగా కూర్చుని మాటాడుతున్నట్టే వుంటుంది అంటున్నారు చాలామంది. దానికి కారణాలేమిటో తెలుసా? మనది మౌఖిక సాహిత్యం. మనం ముఖతః విని తెలుసుకునేదే ఎక్కువ. చదువురానివాళ్లు అంటూ నిజంగా లేరు మనకి. బడికెళ్లి అక్షరాలు దిద్దకున్నా విశేషమయిన తెలివితేటలు చూపగలవారు మనచుట్టూ నిత్యం కనిపిస్తారు.

రాయడం వచ్చేక కూడా మనకథల్లో ఆ మౌఖికసాహిత్యం పోకడలు పూర్తిగా నశించిపోలేదు. ఆ ఛాయలు మనకథల్లో కనిపిస్తాయి. నాకథలు ఎదురుగా వుండి చెప్తున్నట్టు వుండడానికి కారణం - రాస్తున్నప్పుడు ఆమాటలు నాతలలో ఒకటికి పదిమార్లు పలుక్కుని ఎలా వినిపిస్తున్నాయో చూసుకుంటాను. ఒకే వాక్యం మళ్లీ మళ్లీ చదువుకుని ఎలా "వినిపిస్తోందో" పరీక్షించుకుంటాను.

రెండోకారణం, మాటలఎంపిక కూడా. ఏం చెప్తున్నాం అన్నది కేవలం నిఘంటువులో వెతుక్కోడం మాత్రమే కాదు కదా. సందర్భం, పాత్ర, కాలం - ఇవన్నీ కూడా ఏమాట ఎక్కడ నప్పుతుందో చూడ్డానికి అవసరమే.

గొల్లపూడి శ్రీనివాస్‌గురించి తీసిన విడియో చూశాను సౌమ్య బ్లాగులో చూసి. శ్రీనివాస్ ఉదంతం హృదయవిదారకం. అతనిపేరుమీద డైరెక్టర్లకి ప్రోత్సాహంగా పురస్కారం ఇవ్వడం మెచ్చుకోదగ్గ విషయం. విడియో హృద్యంగమంగా చేశారు. రెండుసార్లు చూశాను. రెండోసారి చూసింతరవాత కొంత అలవాటు పడ్డాను ఆభాషకి. కానీ మొదటిసారి నాకు అందులో ఇంగ్లీషు బాధ కలిగించింది. పేరుకే తెలుగు విడియో కానీ అది ఏ ఇంగ్లీషువాడు చూసినా - ఇండియనింగ్లీషు తెలిసివాడు - తేలిగ్గా అర్థమయిపోతుందేమో అనిపించింది.

నేను విషయాన్ని పక్కదారి పట్టించేను అని కోప్పడకండి. నాకు తెలుగంటే వున్న అభిమానం మూలంగా ఇది నన్ను మాత్రమే బాధించిందేమో. నేను విడియోనీ, అక్కడ ఆవిష్కరించిన ప్రధానాంశాన్నీ కించపరచడంలేదు. అది నాఉద్దేశం కాదు. ఈ విడియో చూసేవారందరూ ఇంగ్లీషుకి అలవాటు పడ్డవారే కనక, ఈసంగతి వారికి అభ్యంతరం కాకపోవచ్చు కూడా అనుకుంటాను.

"ఈరోజుల్లో అందరూ అలాగే మాటాడుతున్నారు, శ్రీనివాస్ కూడా అలాగే మాటాడేవాడు" అనుకోవచ్చు కానీ, సాహిత్యానికీ, వాస్తవానికీ అదే తేడా. వాస్తవంలో మీరు మీ ఇంట్లోనో, స్నేహితులతోనో మాటాడుతున్నప్పుడు ఇలాగే మాటాడతారేమో. కానీ, తెలుగుకథకి కథ చెప్పడంతో పాటు మరొక ధ్యేయం, ప్రయోజనం కూడా

వున్నాయి. అది భాష. నిజానికి మేం ఇలాగే మాటాడతాం అనేవారు కూడా ఇంట్లో పెద్దలముందూ, హాస్టల్లో స్నేహితులతో మాటాడుతున్నప్పుడూ ఒకే భాష వాడరు కదా.

ఇంగ్లీషు పదాలవాడకాన్ని తెలుగు భాషాభివృద్ధి సూచకం అంటున్నారు. దానికి వుదాహరణగా బస్సు, రైలు, లైటు వాడడంలేదా అంటున్నారు. నిజమే. నేను కూడా కొన్నిపదాలు వాడతాను.

రావిశాస్త్రి ఇంగ్లీషు పదాలు వ్యంగ్యానికో హాస్యానికో వాడతారు. నేను కూడా అంతే. నా "విషప్పురుగు" కథలో ఇంగ్లీషుమేష్టరు తెలుగులోనూ, తెలుగుమేష్టరు ఇంగ్లీషులోనూ తమ అభిప్రాయాలు వెలిబుచ్చుతారు. అది ఆనాడు భాషతీరు మీద నావ్యాఖ్య. ఇంగ్లీషువాడు పాలించేరోజుల్లో పాలకులభాష మాటాడడం గొప్ప. అప్పట్లో భమిడిపాటి కామేశ్వరరావుగారు రాసిన "రెండో భాషగా తెలుగు"మీద కథ ఇంగ్లీషువాడి హయాంలో ఇంగ్లీషు చదువుకున్న తెలుగువాడు పెట్టిన ఇంగ్లీషుబళ్లో తెలుగు మాష్టారి స్థానం చదివితే తెలుస్తుంది నాకథలో వ్యంగ్యం.

నా రెండో కారణం - మనసంస్కృతిలో లేని అలవాట్లు మాటాడుతున్నపుడు. దానికి మంచి వుదాహరణ థాంక్స్. తెలుగు సంస్కృతిలో ఇది లేదు. "సంతోషం నాయనా", "నీ అమ్మకడుపు చల్లగా వెయ్యేళ్లు వర్ధిల్లు తల్లీ", "నీ ఋణం తీర్చుకోలేను" "దండాలు బాబూ" - ఇలా అనేకరకాలుగా కృతజ్ఞతలు తెలియజేసుకోడం మన సాంప్రదాయం. ఈ ధన్యవాదాలూ, కృతజ్ఞతలూ, నెనరులూ, పాశ్చాత్యసంప్రదాయంలోనివి. అంచేత నాకు ఇప్పటికీ, థాంక్సుతో సరిపెట్టేయడమే నయం అనిపిస్తుంది.

కథ చెప్పడం ఒకరకంగా ఇంట్లో పెద్దలముందు మాటాడడంలాటిదే. పాఠకులు ఎవరో మీకు తెలీదు కనక కొత్తవారితోనో, పెద్దవారితోనో మాటాడుతున్నట్టే వుండాలి కథనం. నేను ఎదురుగా వుండి చెపుతున్నట్టే రాసినా, సభామర్యాదలు పాటించడం అందుకే.

ఇక్కడే మరోమాట కూడా చెప్పాలి. నిన్న మహేష్ కుమార్ టపా చూశాను. అక్కడ ఒక వ్యాఖ్య "బ్లాగులకి తెలుగుపత్రికల విలువ ఎన్నటికీ రాద"న్నది. అది నేను అంగీకరించను. ఈనాటి తెలుగుబ్లాగుల్లో కథలూ, కవితలూ, వ్యాసాలూ ఏ సాహిత్యపత్రికకీ తీసిపోని స్థాయిలో వుంటున్నాయి. రాధిక, నిషిగంధ, బుల్లోజుబాబా, స్వాతికుమారి కవితలూ, తెలుగుపద్యం బ్లాగులో తెలుగుపద్యాలకి కామేశ్వరరావుగారి విశ్లేషణా, చదువరి, తెలుగు 'వాడి'ని బ్లాగుల్లో రాజకీయాలూ, నెటిజన్ బ్లాగులో వివిధ అంశాలూ - ఇలా విస్తృతంగా సాహిత్య కృషి జరుగుతోంది. సౌమ్య బ్లాగులో పరిచయం చేస్తున్న విశ్వసాహిత్యం అసంఖ్యాకంగా పాఠకులనాకట్టుకుని, పుస్తకం.నెట్ అన్న ప్రత్యేక సైటు పుట్టడానికి కారణమయింది. తెలుగులో కేవలం పుస్తకాలనీ, రచయితలనీ పరిచయం చేయడానికి అంకితమయిన ఏకైక సైటు ఇది. నిజానికి తెలుగులో ఇలాటి ప్రింటుపత్రిక లేదు. నాకు పేరు గుర్తు లేదు కానీ 20 శతాబ్దం పూర్వార్థంలో ఏదో ఒక పత్రిక వుండాలి ఇలా సాహిత్య చర్చలు

చెయ్యడానికి మాత్రమే అంకితమయినది. కల్పన, http://kalpanarentala.blogspot.com, ఈమధ్య అట్టే రాయడంలేదు కానీ తన బ్లాగు కూడా మంచి సాహిత్య పత్రిక కోవకే చెందుతుంది.

అంచేత ఒట్టి బ్లాగు అన్నపదం అధిగమించి, సాహిత్యాన్ని అందిస్తున్న బ్లాగులు చాలా వున్నాయి. బహుశా మనం బ్లాగు అన్న పదాన్ని వదిలేసి, ఇక్కడ సృష్టిస్తున్న సాహిత్యానికి అనుగుణంగా మరో పదం సృష్టించి వాడుకలోకి తెస్తే బాగుంటుందేమో.

ఒత్తులూ, దీర్ఘాలూ మర్చిపోకండేం!

(15 ఏప్రిల్ 2009)

# 32. గల్పిక ముదిరి కథ అయిందిట!

నెటిజన్ రెండో ప్రశ్న - కథకీ గల్పికకీ తేడా ఏమిటీ అని అడిగి, "మీ మాటల్లోనే" చెప్పండని ఓ సుళువు చెప్పేరు. ఈ ఎన్నెమ్మకతల అసలు రహస్యం ఆయన పట్టేసినట్టున్నారు. మిగతవారికి మరోసారి మనవి. ఇవి సాహిత్యవ్యాసాలు కావు. నేను సీరియస్‌గా రాసినవాటికే "వ్యాసాలు" అని పేరు పెడతాను. అందుకు భిన్నంగా ఊసుపోకకి రాస్తున్నవి హాస్యంగా, వ్యంగ్యంగా, తెలివితక్కువగా ... రాసిన సగం సగం కల్పిత రాతలు. ఈ కతల్లో నా అణాపరక బుర్రకి తట్టిన తలపులేవో కలబోసుకు రాసుకుంటాను.

మరి ఎవరైనా ఎక్కడెక్కడో చదివిన విషయాలూ, ఇంకా మరేవో గొప్ప గొప్ప మేథావుల దృక్కోణాలు ఇక్కడ వ్యాఖ్యలరూపంలో రాసేస్తే, చెప్పొద్దూ, నాకు మహ తికమక అయిపోతున్నాది. వీటిని సీరియస్‌గా తీసేసుకుని, ఆవేశపడిపోతూ వ్యాఖ్యానాలు చేసేయకండి. Fair is fair అంటే అదన్నమాట!

ఇంతకీ గల్పిక, స్కెచ్, కథ, కథానిక - వీటికి ఖచ్చితంగా నేను నిర్వచనాలు ఇవ్వలేను, ఆదిని మనరాతలకి ఈ "గల్పిక, స్కెచ్"లాటి నామకరణాలు చేసింది కొడవటి కుటుంబరావుగారు అనుకుంటాను. ఆయన వ్యాసాల్లో ఇవి సవిస్తరంగా చర్చించారు. పోరంకి దక్షిణామూర్తిగారు కూడా మనకి కథ ఎప్పట్నించో వుందనీ, ఆఖ్యాయికా, కథా, ఖండకథా, కథానికా, పరికథా అని అయిదు రకాలు సంస్కృతగ్రంథాల్లో ప్రవచించేరనీ చెప్పేరు. (చూ. తూలిక.నెట్. Some reflections on Telugu short story). నా అల్పప్రాణానికి ఇవన్నీ academic exercises.

నాకు తోచింది ఏ రచయిత గానీ "గల్పిక రాయనా, కథ రాయనా," అనుకుంటూ మొదలు పెట్టరు. ఒకరకంగా చాలా బ్లాగుల్లో వస్తున్న ఆలోచనలూ అనుభవాలూ గల్పికలూ, స్కెచ్చిలూ అనొచ్చు.

రచయిత ఏదో ఒక సంఘటనకో సన్నివేశానికో స్పందించి మొదలు పెడతారు. కలం పట్టిన శుభవేళ, కథా? కవితా? అన్న సంశయం రావచ్చు. లేదా కథా? నవలా? అన్న సంశయం కూడా రావచ్చు. మెంతికాయలో కారం ఎంత కూరుదాం అనుకున్నట్టుగానే ఎంత సరుకు ఇముడ్చుదాం ఈరాతలో అని రచయిత తర్కించుకున్నప్పుడు కథా? నవలా? అన్న ప్రశ్న వస్తుంది. కానీ, గల్పికా?, కథా? కథానికా? అన్న ప్రశ్న రాదు, నామటుకు నేను చిన్నకథగా నాలుగైదు పేజీల్లో అయిపోతుందనుకుంటూ మొదలెట్టి, పధ్నాలు పేజీలవరకూ రాసుకుంటూ పోయినవి వున్నాయి.

నేను తొలిరోజుల్లో ఏవో కథలు రాసి చందమామ, బాల, బాలమిత్రలాటి పిల్లలపత్రికలకి పంపించాను. ఆతరవాత అందరూ చదువుకునే పత్రికలలో తొలిసారిగా తెలుగుస్వతంత్రకి పంపేను, ఏం తోస్తే అదీ, ఎంత రాయాలనిపిస్తే అంతే రాసి.

తెలుగుస్వతంత్ర సంపాదకులే నా తొలిరచనలకి స్కెచ్ అనో గల్పిక అనో పేరు పెట్టేరు. ఇప్పుడు నాదగ్గర వున్న కాయితాలు తీసి చూస్తే, బొత్తిగా అరపేజీ (అసలు స్వతంత్రే అరపేజి సైజులో వుండేది అప్పట్లో) అందులో నాకథ అరపేజీ! ఆ తరవాత నేను రెండు పేజీలు రాసినప్పుడు ఆ సంపాదకులే  కథానిక అని దీవించేరు!

ఇప్పుడు నెటిజన్ అడిగారు కదా అని పరిశోధన మొదలుపెట్టి, నాదగ్గరున్నవి వరసగా బల్లమీద పరిచి, పరీక్షించి చూస్తే, మొదట సైజునిబట్టి కాబోలు అనిపించింది. మళ్లీ జాగ్రత్తగా పరిశీలించి చూస్తే, ఏం చెపుతున్నాం అన్నది కూడా గమనించవలసిన విషయమే అనిపించింది. ఎందుకంటే అరపేజీలో కంటే రెండుపేజీల్లో చెప్పేది ఎక్కువ వుంటుంది కదా తప్పనిసరిగా. (కాయితాలు నింపడం అని కూడా అనొచ్చు ఈ రచనావిశేషాన్ని!)

నిజానికి ఏ ఇద్దరు మాటాడుకోడం మొదలు పెట్టినా, స్కెచ్చిలూ గల్పికలూ కోకొల్లలుగా దొర్లుతాయి. అవునా, కాదా మీరే చెప్పండి. మీరు మరొకరితో మాటాడినప్పుడు ఏం మాటాడుకుంటారు? ఆరోజు జరిగిన సంగతులు, చూసిన సంగతులే కదా. కూరలో ఉప్పెక్కువయింది, బజారులో బస్సాయిగిపోయింది. ఇవాళెంచేతో ఉత్తరాలవాడింకా రాలేదు … ఇలాగే కదా వుంటాయి ఆకబుర్లు. స్కెచ్, గల్పిక అలాటివే. ఏదో ఒక చిన్నవిషయం, అంతే. వాటికి మామూలుగా విజ్ఞులు కథకి కావాలని చెప్పే తలా తోకా వుండవు. అదరగొట్టే సంఘర్షణ కూడా వుండకపోవచ్చు. ఈరోజుల్లో వచ్చే కార్డుకథలూ, కాలంకథలూ అలాటివే.

గల్పిక సాగదీస్తే కథానికో కథో అవుతుంది అనను కానీ, సాగదీసి కథ చెయ్యొచ్చు అని మాత్రం చెప్పగలను. ఉదాహరణకి ఇది చూడండి.

నేను రోజూ వాక్కెళ్తానని చెప్పేను కదా. ఒకరోజు అలా వెళ్తుంటే, ఒక ఇంట్లోంచి ఒక చిన్నమ్మాయి పరుగెత్తుకుంటూ నాదగ్గరికి వచ్చింది ఓ చిన్ననోటుబుక్కూ కలం పుచ్చుకుని. అమెరికనే, తొమ్మిదో పదో వుండొచ్చు వయసు. నావేపే వస్తోంది కనక నేను ఆగేను. తను దగ్గరగా వచ్చి,నోట్ బుక్కూ, కలం అందిస్తూ, సంతకం చెయ్యమని అడిగింది. నేను చిన్నగా నవ్వి, "ఏం. ఇది నీ స్కూల్ ప్రోజక్టా?" అని అడిగేను. "కాదు. వూరికే" అంది. సరేనని, నవ్వి, నాపేరు ఆపుస్తకంలో రాసి ఇచ్చేసేను.

ఇది నిజంగానే జరిగింది. అయితే ఇక్కడ నేను చెప్పిన కథలో ఆ పిల్లెవరూ, ఎందుకు నా సంతకం అడిగింది, దాంతో ఏం చేస్తుంది - లాటి వివరణలు లేవు. ఇది గల్పిక, స్కెచ్ కాకపోతే ఉత్త బ్లాగు!

ఇప్పుడు ఇంకొంచెం ఆలోచిద్దాం. ఆ అమ్మాయికి పేరు పెడదాం. సూజీ అనుకోండి. ( టైపు సుళువు కోసం). మొదట నేను రచయిత్రిని కనక నా ఆటోగ్రాఫ్ అడిగిందేమో అనుకుని కొంచెంసేపు ఆ ఆనందం అనుభవించేను. అది తెలివితక్కువ అని నాక్కూడా తెలుసులెండి. ఆ సూజీకి ఎలా తెలుస్తుంది నేను రచయిత్రిని అని, అందులోనూ తెలుగు రచయిత్రిని అని. అస్సలు లేదు ఆ అవకాశం, మరి నా సంతకం ఎందుకు అడిగింది? మ్. తెలీదు.

రెండో ఆలోచన - అమెరికాలో సాధారణంగా పెద్దలు పిల్లలకి ఎడతెగకుండా చెప్తూంటారు "కొత్తవాళ్లతో మాటాడకు", "వాళ్లు పలకరిస్తే పలకకు", "పిలిస్తే దగ్గరికెళ్లకు" అంటూ. మరి ఈ సూజీ అంత ధైర్యంగా, తనకు తానుగా నాదగ్గరికెందుకొచ్చేసింది? ఎలా వచ్చేసింది? నా సంతకంతో ఏం చేస్తుంది? ఈ ప్రశ్నలకి సమాధానాలు కావాలంటే కల్పన మొదలు పెట్టాలి. దాంతో అది కథ అయిపోతుంది.

మూడు - పైన నేను "ఇది నీ స్కూలు ప్రోజెక్టా?" అని అడిగేను కదా. ఎందుకంటే అమెరికాలో అయిదో క్లాసులోనే మొదలు పెడతారు రిసెర్చి. ఆస్థాయిలో ఏముంటాయి "మీ వీధిలో ఎంతమంది నడుస్తున్నారో లెక్కపెట్టు," "లేకపోతే వాళ్ల పేర్లు పోగుచెయ్యి" అనే కదా. అలా అనుకుని అడిగేనన్నమాట. ఇంతకీ ఆపిల్ల చెప్పనేలేదు. ఇవి కథలో వాతావరణం సృష్టించడానికి పనికొస్తాయి.

మళ్లీ కథకొద్దాం. పైన చెప్పిన ఉదంతం అయినతరవాత కొన్ని రోజులకి ఆ యింటిముందు "ఫర్ సేల్" బోర్డు కనిపించింది (ఇది కూడా నిజంగా జరిగింది). అంటే వాళ్లు ఇల్లు మారుతున్నారన్నమాట. బహుశా నన్ను రోజూ చూస్తోందేమో, ఇల్లు మారిపోతే ఈ సీను వుండదని, ఏదో గుర్తు కావాలని నా సంతకం అడిగిందేమో అనుకున్నాను.

మరొక కోణం, మావూళ్లో భారతీయస్త్రీలు ఎక్కువే. చాలామంది బేబీసిట్ చేస్తుంటారు. ఒకవేళ సూజీని చిన్నతనంలో మనవాళ్లెవరైనా బేబీసిట్ చేసివుంటే, నాకు replacement పాత్ర అంటగడుతోందేమో. పైగా విదేశీయులందరూ ఒక్కలాగే కనిపించడం మామూలే.

ఇప్పుడు సూజీని ప్రొఫైలు చేద్దాం. సూజీ ఎలాటి పాత్ర అవడానికి అవకాశం వుంది? బెదురు లేకుండా నాదగ్గరికి వచ్చేసింది కనక భయంలేని పిల్ల అయివుండాలి. కుతూహలం వుండబట్టే నాసంతకం అడిగింది. నన్ను తమిళదాన్ని అనుకున్నవాళ్లున్నారు కానీ అమెరికన్ అని ఎవరూ అనుకోలేరు. ఇలా ఆలోచిస్తే, సూజీకి ఇతర జాతులంటే ఆసక్తి అనుకోవాలి. ఇక్కడికి సూజీ ఎలాటి వ్యక్తి అన్నసంగతి నిర్ణయమయింది.

కథ పూర్తి చెయ్యడానికి కావలసిన సరంజమా - ఇప్పటికి సూజీ నాసంతకం తీసుకుని దాదాపు ఎనిమిదేళ్లవుతోంది. అంటే కాలేజీలో చేరే వయసు. కథకోసమే చిన్నప్పుడు తను సేకరించిన సంతకం

జాగ్రత్తగా దాచుకుంది అనుకుందాం. తనస్నేహితులకి చూపించి ఆనాటికథ చెప్తూంటుంది. (గమనిక. ఇక్కడ సూజీ చెప్పే కథ స్కెచ్ లేక గల్పిక మాత్రమే). ఆస్నేహితులలోఒకడు భారతీయుడు లేదా భారతీయనాగరికత అధ్యయనం చేసినవాడు. అతను "మాలతి అన్న పేరు ఇండియాలో చాలా ప్రాంతాల్లో పెట్టుకుంటారు. నిడదవోలు అన్న ఇంటిపేరు మాత్రం తెలుగువారికే పరిమితం. అంచేత ఆవిడ (అనగా నేను) తెలుగుమనిషిని అయివుండాలి" అని చెప్తాడు. అప్పటికి సూజీకి కంప్యూటరు బాగా అలవాటయిపోయి వుంటుంది. అంచేత "ఈ తెలుగెక్కడ మాటాడతారూ, వీరి కథా కమామీషూ ఏమిటి" అని నిజంరిసెర్చి చేస్తుంది.

ఇక్కడ మనం కథ మరో మలుపు తిప్పొచ్చు. ఎలా అంటే, ఈసరికి సూజీ యూనివర్సిటీలో చేరింది. ఇక్కడ యూనివర్సిటీలో అందరూ రెండోభాషగా ఇంగ్లీషు-కాని-భాష చదవాలి. అంతకుముందే తెలుగుగురించి రిసెర్చి చేసివున్న సూజీకి తెలుగు తీసుకుందాం అని సరదా పుడుతుంది. మళ్లీ కంప్యూటరెక్కి ఎవరు చెప్తున్నారు అని చూస్తుంది. ఆశ్చర్యం! తనకి సుపరిచితమయిన పేరు. పరమానందంగా సైన్ చేసేస్తుంది నాకోర్సుకి. ... ఇలా రాసుకుంటూ పోవచ్చు ఓపికున్నంత దూరం.

ఇంకా సూజీ తెలుగుఅబ్బాయిని డేట్ చేస్తున్నట్టు కూడా రాస్తే గొప్ప సంఘర్షణ సృష్టించొచ్చు. కథని నవలదాకా సాగదీయవచ్చు కూడాను.

కథనంలో భాషగురించి, ఒత్తులూ, గుణింతాలే కాక ఇంకా చెప్పవలసింది చాలా వుంది. అది వచ్చేవారం.

(18 ఏప్రిల్ 2009)

# 33. కావలెను కథలకి తెలుగుపదాలు!

ముందుటపాలో ఒత్తులూ, గుణింతాలగురించి రాస్తున్నప్పుడు కొన్ని తప్పులు దొర్లేయి. అబ్రకదబ్రగారు చెప్పేక చూసుకున్నాను. వారికి ధన్యవాదాలు. అందులో అక్షరదోషాలు కనిపించినమేరకి దిద్దుకున్నాను. ఆయన ప్రస్తావించిన రెండోవిషయం రెండుమాటలమధ్య విరామాలగురించి. ఇది ఆలోచించాలి.

అసలు తెలుగులో విరామచిహ్నాలు లేవు. పూర్వకవులు ఘంటం పిడికిట సంధించి, తాటాకుమీద ఈచివరినించి ఆచివరికి రాసుకుపోయేవారు ఆపకుండా. ఘంటం ఆపడం తాటాకు చివరికొచ్చినప్పుడే కానీ వాక్యం అయిపోయినప్పుడు కాదు. దరిమిలా ముద్రణాయంత్రాలు వచ్చేక విరామచిహ్నాలు ప్రాచుర్యంలోకి వచ్చేయి.

ఫుల్‌స్టాపు ఉపయోగం బాగానే వుంది కానీ కామాలూ, కొటేషను మార్కులూ (దీనికి తెలుగేమిటో నాకు తెలీదు) మాత్రం ఇంకా కుదురుకున్నట్టు లేదు తెలుగులో.

ప్రస్తుతం నాసందేహం విశేషణానికీ విశేష్యానికీ మధ్య విరామం (స్పేస్) అవసరమా కాదా అని. నల్లనివాడు ఒకే పదం, ఆవుపాలు ఒకే పదం. కానీ కొన్నిమాటల్లో విరామం పెడితే అర్థాలు మారిపోతాయి. "అన్న మాట"లో "అన్న" అన్నది విశేషణం. "అన్నమాట" ఊతపదం కావచ్చు.

నాకు ఈవిషయంలో నిశ్చితమయిన అభిప్రాయాలు లేవు. నాకు LCD Screenలో ఒకొకప్పుడు అక్షరాలు సరిగ్గా కనిపించవు. బ్రౌజరు కారణం కావచ్చు, ఫాంటు కారణం కావచ్చు, ఏదయితేనేం కాయితంమీద కంటే కంప్యూటరుమీద చదవడం కష్టం. అంచేత నేను నా స్క్రీనుమీద ఎలా కనిపిస్తోందో దాన్నిబట్టి, మాటలు కలిపి వుంచడమో, విడదీయడమో చేస్తున్నాను. ఈ విషయంలో ఏది ఒప్పు అన్నది  భాషాశాస్త్రజ్ఞులే చెప్పాలి. వ్యాకరణవిశేషాలకి సంబంధించినంతవరకూ ఇంతే కత.

ఇక కథారచన విషయంలో - తెలుగుకథ తెలుగులోనే రాయాలని నా దృఢమయిన అభిప్రాయం. ఈరోజుల్లో మనమాటల్లో కనీసం సగానికి సగం ఇంగ్లీషు వుంటోంది. అదే వాస్తవం, సహజం అంటున్నారు కొందరు. నాకు అలా అనిపించదు. ఎందుకంటే ఒక తెలుగువాడు మరొక తెలుగువాడికి కథ చెప్తున్నప్పుడు, రచయిత వేరూ, కథకుడు వేరూను. రచయిత నిత్యజీవితంలో ఇంగ్లీషే మాటాడుతూ వుండొచ్చు. అందుకు భిన్నంగా

కథకుడిచేత రచయిత కథని మంచి తెలుగులో చెప్పించవచ్చు. అంటే అలవాటుతోపాటు సాహిత్యవిలువలు కూడా పనిచేస్తాయి కథకుడిమీద.

తెలుగుసాహిత్యంలో ధ్వనికీ, వక్రోక్తికీ ప్రాధాన్యం వుంది. అంటే వున్నది వున్నట్టూ, చూసింది చూసినట్టూ కాక, అలంకారవిశేషాలతో కథని మరింత ఆకర్షణీయం, మనోరంజకం చేయడం. "వాడికి కోపం వచ్చింది" అన్న వాక్యానికీ "వాడు అగ్గిరుద్రుడయిపోయేడు" అన్న వాక్యానికీ తేడా ఏమిటంటారు? చెప్పేతీరులోనే కదా.

బసవరాజు అప్పారావుగారు ఒకకవితలో "బుల్లి పాపాయి ఇల్లు ఖాళీ చేసి వెళ్లిపోయేడు" అంటారు వారి బాబుని తలుచుకుంటూ. చూడండి ఎంత సాధారణమయిన వాక్యం ఎంత విషాదాన్ని నింపుకుందో.

భాష కథని పటిష్ఠం చేస్తుంది. మంచివిషయాలు చెప్పడం ఒక ఎత్తయితే, మనసుకి హత్తుకునే పదాలు కూర్చి చెప్పడం మరో ఎత్తు. అలాటికథకే పాఠకుడు స్పందిస్తాడు.

మరి స్పందన అంటే ఏమిటి? కథ చదువుతుంటే, ఇంకా చదవాలనిపించడం స్పందన. కడవరకూ ఆపకుండా చదవడం స్పందన. చదివినతరవాత దాన్నిగురించిన తలపులు మనసులో కొనసాగడం స్పందన. దాన్ని పొడిగించుకుంటూ పోయి మరోకథకి నాంది పలికించడం స్పందన. ఇలాటిస్పందన వున్నప్పుడే మళ్లీ మళ్లీ చదవాలనిపిస్తుంది. లేకపోతే, ఒకసారి చదివి అందులో ఏం వుందో తెలుసుకుని పక్కన పెట్టేస్తారు. లేకపోతే అబిడ్సులో అణాపరకకి అమ్మజూపుతారు,

ఇంతకీ నేనంటున్న స్పందన కావాలంటే దానికి తగినభాష కావాలి. ఈరోజుల్లో చాలామంది కథలు నిజంగా చదవడంలేదు. అక్కడక్కడ చదివేసి, సుమారుగా అందులో భావాలు తెలుసుకుని పక్కన పెట్టేస్తున్నారు. నెట్టులో అయితే వ్యాఖ్యానాలు కూడా పెట్టేస్తున్నారు. అది కథని ఆస్వాదించడం అనలేను నేను. అలా చదివేవారే ఇంగ్లీషూ తెలుగూ కలిపి రాసినభాషకి అభ్యంతరాలు చెప్పరు కూడా.

అసలు నేను మొదట అడగాల్సింది "మీరు తెలుగుకథ రాస్తున్నారా? ఇంగ్లీషుకథ రాస్తున్నారా?" అని. తెలుగుకథ తెలుగులోనే ఎందుకు రాయాలి అని అడిగితే నేనేమీ చెప్పలేను. ఏమో మరి, దానిలో ఏదో తర్కం వున్నట్టుంది. అందుకూ.

నేను కూడా తెలుగుకథల్లో ఇంగ్లీషు అప్పుడప్పుడు వాడతాను. దానికి రెండు కారణాలున్నాయి. మన సంస్కృతిలో లేని సాంప్రదాయాలూ, ఆచారాలూ మాటాడుతున్నప్పుడు, అదంతా తెలుగులోనే చెప్పాలంటే కృతకంగా వుంటుంది. అంత బాధపడి తెలుగులో రాస్తే చదివేవారికి నేనేం చెప్తున్నానో తెలీకపోవచ్చు కూడా. రెండోది, హాస్యానికి. "He told you కదా" అంటే నాకు హాస్యంగానే అనిపిస్తుంది. చివర "కదా" చేర్చడం ఎందుకు? కదా చేరిస్తే అది తెలుగు అయిపోతుందా? లేక, ఆ ఒక్క మాటకీ ఇంగ్లీషులో సమానార్థకం లేకనా?

ఇంతకంటె మంచి ఉదాహరణ వారాలు చేసుకోడం తెలుగుజాతికి ప్రత్యేకమయిన సంప్రదాయం. వారాలబ్బాయిమీద తెలుగువారు చదువుకోడానికి తెలుగుకథ రాసి, వీక్లీబాయ్ అని పేరు పెట్టడం నాకు హాస్యాస్పదంగానే కనిపిస్తుంది. ఏ ఇంగ్లీషువాడికయినా వీక్లీబాయ్ అంటే అర్థం అవుతుందా? అవదు. వారాలబ్బాయి అన్నమాట వినని తెలుగువారుంటే, వారికి కూడా వీక్లీబాయ్ అంటే ఏమిటో అర్థం కాదు.

నేను వెనక చెప్పిన సూజీ కథ తీసుకోండి. అది అమెరికాలో జరిగింది కనక సహజంగానే ఇంగ్లీషువాతావరణం, ఇంగ్లీషుబతుకుకి అవసరమయిన ఇంగ్లీషుమాటలు వాడవలసివస్తుంది. నేనే ఆకథ తెలుగులో రాస్తే, బహుశా వీలయినంతవరకూ తెలుగు సమానార్థకాలు వెతికి, వీలుకానిచోట మాత్రం ఇంగ్లీషుమాటలు పెడతాను. ఉదాహరణకి వాక్‌కి తెలుగు నడక, వ్యాహ్యాళి - ఇలా ఏవో వుండొచ్చు కానీ ఈనాడు వాడుకలో వున్న వాక్ అన్న మాటకి అవి సరి కావు. అలాగే బేబీసిటింగ్ కూడా ఆమధ్య హైదరాబాదులో ఏవో తెలుగుపదాలు విన్నాను కానీ నాకు అవి సరిగ్గా మనసున నాటలేదు కనక బేబీసిటింగు అనే అంటాను. అలాగే బ్రౌజరూ, ఫాంటులు మొదలయినవి.

ఆమధ్య ఒక తెలుగుఅబ్బాయి "ఎవ్వరీ మనోహారిణి" పాట (ఘంటసాలవారు పాడింది) పంపించాడు అర్థాలు చెప్పమని. అతనికి కొంచెం తెలుగు అర్థం అవుతుందిట. కానీ ఈపాట చాలా బాగుండడంచేత క్షుణ్ణంగా తెలుసుకోవాలని వుందని రాసేడు. నాకు వెంటనే కలిగిన సందేహం ఈ అబ్బాయికి ఎంత తెలుగు వచ్చు? నా అనువాదం ఎంత తేలికభాషలో వుండాలి? అని. అప్పట్లో నాకు వేరే పనులు ఎక్కువగా వుండడంచేత, "నీకెంత తెలుగు తెలుసు, ఆపాటలో ఏమాటలు నీకు అర్థం అయేయి" అంటూ శోధనకి దిగకుండా, ఇంగ్లీషులోనే అర్థాలు రాసి పంపించేసేను. అతను దానికే ఎంతో పొంగిపోయి, తెలుగుభాష ఇందుకే మధురంగా వుంటుందంటారని చెప్పి, "అర్థాలు తెలుగులోనే రాసి పంపగలరా?" అని మళ్లీ అడిగేడు. చెప్పొచ్చేదేమిటంటే, తెలుగుభాష మనసుని రంజింపజేయగల భాష. (ఇతరభాషలవారికి వారి మాతృభాష కూడా అలాగే అనిపించవచ్చు). కథ చెప్పినప్పుడు, కథలో ఏం చెప్పేం అన్న అంశంతో పాటు ఏశబ్దతరంగాలతో పాఠకుడిని అలరిస్తున్నాం అన్న అంశం కూడా ఆలోచించుకోవాలి. "సండే రండి, మండే పొండి" అంటే ఇంగ్లీషు అలవాటయినవారికి అది సహజంగానే కనిపిస్తుంది. కానీ తెలుగంటే పడిచచ్చే నాలాటివారికి "ఆదివారం రండి. కాస్సేపు కబుర్లాడుకుని సోంవారం వెళ్లొచ్చు" అన్నవాక్యంలో వున్న ఆత్మీయత గోచరించదు.

నేను రావిశాస్త్రి భాషని పదేపదే మెచ్చుకుంటాను కానీ నాకు ఆరుద్రకవితలు కూడా అంత ఘనంగానూ తోస్తాయి. చాలా మామూలుమాటలతో మనసుని పట్టి కుదిపేసే వాక్యాలు సృష్టించగలరాయన. ఇప్పుడు నేను ఉదాహరణలు వల్లించలేను కానీ ఎప్పుడో 1950లలో రాసిన రేడియో నాటిక, సీతాకోకచిలకలు, విన్ననాటి అనుభూతి నామనసులో ఇప్పటికీ అలానే వుంది పచ్చగా.

పోగా తెలుగు నిలబెట్టుకోడంగురించి ఒకమాట. భాష సజీవం. వాడుకలో వున్నమాటలు వుంటాయి. లేనివి పోతాయి అని అంటున్నారు కొంతమంది. మరి మనం వాడుతుంటేనే కదా వాడుకలో వుండేది. ప్రత్యేకించి "వాటిని వాడి నిలబెట్టడానికి" అంటూ వేరే జనాలు వుండరు కద. "మనమే ఆ వాడేవాళ్లం, మనమే తెలుగు మాటలాడదాం" అన్న స్పృహ మనకే వుండాలి మరి.

నాలుగేళ్లక్రితం నేను మల్లాది రామకృష్ణశాస్త్రిగారి కథ "సోహం" అనువాదం చేస్తుంటే "మంచిమాట చేసుకువచ్చాను" అన్న వాక్యం కనిపించింది. నాకు ఆమాట తెలుసు కానీ కథలో చూసేవరకూ స్పృహలో లేదు. "మంచిమాట చేసుకురావడం" అంటే పూటకూళ్లమ్మ ఇంట భోజనం ఏర్పాట్లు చేసుకురావడం. అందాకా ఎందుకు? మొన్నీమధ్య "చాతకపక్షులు" రాస్తున్నప్పుడు ఎరేంజిమెంట్లు అంటే ఏర్పాట్లు అని జ్ఞాపకం తెచ్చుకోడానికి నాకు మూడువారాలు పట్టింది. వాడుకలో లేకపోవడం అంటే అదే.

మాకిదేమీ అక్కర్లేదు అనుకునేవారివిషయంలో బాధే లేదు. తెలుగుకథ రాస్తున్నాం అని మాత్రం నాకు చెప్పకండి. అవి చదివి అర్థం చేసుకునేస్థాయి నాకు లేదు.

ఇది చాలనుకుంటాను తెలుగుకథలో తెలుగుభాష అవసరం చెప్పడానికి.

చివరిమాటగా మీరు అందరూ అంటే నాకు గౌరవం. అలాగే మీరు కూడా భాషమీదా సాటి పాఠకులమీదా గౌరవం చూపిస్తారన్న నమ్మకంతో నేను moderation పెట్టడం లేదు. ఎదటివారిని గౌరవించడం కూడా నాగరికతలో భాగమే కదా. నేనంటే గౌరవం వున్నవారు నాబ్లాగులో దుడుకుమాటలాడితే నాకు బాధగా వుంటుంది.

ఇంక మీదే ఆలస్యం. సుజాతా, నెటిజన్, ఇంకా ఈకతలు చదివినవారందరూ, ఫలశృతిగా కథలు రాసేయండి మరి. బహుమానం ఏం ఇవ్వను? నా తెలుగుసంతకం ఇవ్వనా? ☺. పోస్టుఖర్చులు నావే!

(20 ఏప్రిల్ 2009)

# 34. రామక్కా అంటే తామరాకా అనీ ...

"రామక్కా అంటే తామరాకా అనీ" అని మాఅమ్మ ఓ సామెత చెబుతూండేది. ఎవరో "రామక్కా" అని పిలిస్తే, "ఏమిటి నాయనా, తామరాకా అడుగుతున్నావు?" అందిట ఆవిడ.

ఇంతకీ అసలుకథ - ఆవిడకి కాస్త చెవుడు. అంచేత, అలా అడిగింది. అందులో హాస్యంగానీ వ్యంగ్యం కానీ లేదు. అడిగిన పెద్దమనిషి కాస్త దగ్గరకొచ్చి, ఆవిడచెవిదగ్గర నోరు పెట్టి, "లేదమ్మా, నేను మిమ్మల్ని రామక్కా" అని సంబోధించేను అని మర్యాదగా చెప్పొచ్చు. లేదా, "చెవిటిమేళం, నేనో మాటంటే తానోమాట. వినిపించి చావదు" అని విసుక్కుంటూ విసవిసా మరోదిక్కుకి సాగిపోవచ్చు.

"తామరాకా?" అని అడిగినావిడస్థితి నాకు అర్థమవుతుంది. వినిపించకపోవడం ఒకదారీ, వినిపించుకోకపోవడం మరోదారీను. "... ..." మరోలా "అనిపించడం" పూర్తిగా మరో కథ. (సౌమ్య, http://vbsowmya.wordpress.com, టపా "నాలుగు చెవుల ధోరణి" గుర్తొస్తే మరోలా అనుకోకండి. నేను సౌమ్యటపా కాపీ కొట్టబోవడంలేదు. చేసినా మరీ ఇంత బాహాటంగా చేస్తానేమిటి? :p. అయినా ఏమాటకామాటే చెప్పుకోవాలి. తను రాసిన మంచి టపాల్లో అదొకటి.)

నావిషయంలో వినిపించుకోలేకపోవడం చేతనాచేతనావస్థలో జరుగుతుంది. అంటే నాకు ఒకచెవిలో 40 శాతమే వినిపిస్తుంది. ఆపరేషను చేయించుకోమని డాక్టరమ్మ చెప్పింది కానీ నేనే నిర్లక్ష్యం చేసేను. అందులో గల సౌకర్యాలు గుర్తించి. ఎలా అంటే నా రెండోచెవిలో నూటికి నూరుపాళ్లూ వినిపిస్తుంది. అంటే మొత్తం 140, నాకు రెండు చెవులున్నాయి కనక 100+40=140ని. దీన్ని రెండు పెట్టి భాగిస్తే, సగటు 70 శాతం వినిపిస్తుందన్నమాట. ఈరోజుల్లో ఎవరు చెప్పిందాంట్లో మాత్రం అంతకంటె ఎక్కువ వినాల్సింది ఏం వుంటోంది కనక అని నా లాజిక్కు.

నా "నిరాపరేషను" మూలంగా రెండో సౌఖ్యం ఏవిటంటే నేను పడుకున్నప్పుడు, ఫోనుకాలొస్తే. నేను ఎడంపక్కకి తిరిగి పడుకుని వుంటే ఆ ఫోనుగానం నాచెవిని బడదు. అంచేత నాకు నిద్రాభంగం జరగదు. మరి ఆపరేషనుకి ఎలా తల ఒగ్గుతాను చెప్పండి.

టీవీలో dateline అని ఓ న్యూస్ మేగజీనుంది. అందులో ప్రతి పావుగంటకీ ఓమారు "ఇందాకా చెప్పేను చూడండీ" అంటూ వెనక్కి తిరిగి జరిగినకథ మరోసారి చెప్తుంటాడు ఆ గృహస్థు (host. చావా కిరణ్‌గారు

చెప్పేరుట ఇలా అర్థాలు ఇవ్వమని.). ఇది నాకు మొదట్లో విసుగ్గా వుండేది, నాకామాత్రం బుద్ధి లేదనుకుంటున్నాడా? అని, కానీ త్వరలోనే ఈ రిపీట్ టైము సద్వినియోగం చేసుకునే మార్గం కనిపెట్టేను.

మామ్మూలుగా పై పునశ్చరణలతోపాటు మూడు, నాలుగు నిముషాలపాటు వ్యాపారుల"యాడు"లు కూడా వుంటాయి కదా. నేను ఈ వ్యాపారప్రకటనలకీ, ఇంటివాడి పునరుక్తులకీ మధ్య ఏం చేస్తానంటే కాఫీ పెట్టుకుంటాను. గిన్నెలు కడుక్కుంటాను. మెయిలులు చూసుకుంటాను. ఇంకా గుమ్మంలోకి వెళ్లి ఉత్తరాలేమేనా వచ్చేయేమో చూసుకుంటాను. అక్కడే ఏ పొరుగువాడో కనిపిస్తే, ఓ హలో చెప్పి ఆనాటికబుర్లు కలబోసుకుంటాం ఓ రెండునిముషాలపాటు. అంతకంటె ఎక్కువ టైము నాకుంటుంది కానీ వారికి వుండదు.

అలా "అయ్యో, కథ మిస్సయిపోతామేమో" అన్న భయం అస్సలు లేకుండా పోయింది నాకు. ఈ సాంప్రదాయం మనక్కూడా వుండేది. దానికే హరికథ అని పేరు. లేదా సోది అన్నా అనొచ్చు.

ఇవాళారేపూ (అంటే ఆజ్ కల్) కొందరు చూడండి అనేకసంగతులు గలగల చెప్పుకుంటూ పోగల్రు స్పోర్ట్సు కామెంటేటర్లలాగే. అలా మాటాడుకుంటూ పోతున్నప్పుడు బోలెడు సంగతులు దొర్లిపోతాయి. ఒక్కోసారి అసలు విషయం ఏమిటో తెలీక, మనం 300x లెన్సు పెట్టి వెతుక్కోవాలి. దానికి రెండుగంటలసేపు పడుతుంది.

నేను ఇలా అంటున్నానని కోపం తెచ్చుకోకండి గానీ అప్పుడప్పుడు విమర్శల్లోనూ, వ్యాఖ్యల్లోనూ కూడా ఈ ధోరణి కనిపిస్తుంది. అంటే అసలు విషయాన్ని వదిలేసి, ఏదో ఒక్క మాట మాత్రం పుచ్చుకుని, tangentialగా మరోదిక్కుకి సాగిపోడం. దీనివల్ల లాభాలూ వున్నాయి. నష్టాలూ వున్నాయి, కొత్తసరుకుని బరిలోకి ఈడ్చుకురావడం ఒక వసతి. అసలు విషయం దారి తప్పుతుంది కనక మూలరచయితకి రుచించదు మూడింట రెండొంతులు. పోతే విమర్శకులకీ వ్యాఖ్యాతలకీ గల సౌలభ్యం వారికి తెలిసినవి వారు తెలుపుకోడానికి సదవకాశం.

ఇంచుమించు మనం రాసే కథల్లోనూ అంతే జరుగుతుంది. ఏది కథలో "రామక్కా అంటే తామరాకా" లాగా కనిపిస్తుంది? ఏది మనం చెప్తున్నకథలో "వాక్కూ, అర్థమూ"వలె, పార్వతీపరమేశ్వరుల్లాగా ఏకమయిపోతుంది? అన్నది కాస్త పట్టి చూసేవారికి మంచి కాలక్షేపం. దీనినే పండితులు శిల్పం అంటారు. సందర్భశుద్ధి అని కూడా అనొచ్చు. అంటే మీరు చెప్పబోయే కథలో ఆద్యంతం ప్రతివాక్యం కథలో ప్రధానాంశంవేపు "ఇదుగో, ఇటు చూడు" అని పిలిచినట్టుండాలన్నమాట, డేట్‌లైన్ ఇంటివాడిలాగ. అదేపనిగా నస పెట్టమని కాదు. ఆ చెప్పడంలో సౌలభ్యం వుండాలి. "ఇందాకా చెప్పేను గుర్తుందా" అన్న వాక్యం మాత్రం ఏపరిస్థితుల్లోనూ పనికిరాదు. నేననేది కథ ముగించేవేళకి ఆదీ అంతమూ ఓ కొలిక్కి తెస్తాం కదా. అలాగే మధ్యనున్న భాగాలూను అని.

కథ సున్నా అనుకుంటే, ఆ సున్నామీద మీరు ఎక్కడ వేలేసినా అక్కడినుంచీ పొట్టలో చుక్కవేపు రామబాణంలా ఒక సరళరేఖ కనిపించాలన్నమాట.

మనం కథలో ఎక్కడెక్కడి సంగతులూ కలిపి చెప్పేస్తుంటాం కదా. ఆ కలిపి చెప్పడాన్నే కల్పనాచాతుర్యం అంటారు. ప్రతిభావంతులయిన కవులు చూడగానే "అసందర్భంగా వుంది" అనిపించే వాక్యాలని ఒక్క తాటిమీదకి ఎలా తేగలరో భైరవభట్ల కామేశ్వరరావుగారి వ్యాసం "నేనెరిగిన విశ్వనాథ", పొద్దు.నెట్‌లో చదవండి. ఆయన ఎంత బాగా వివరించేరంటే విశ్వనాథవారి కవిత్వంలో అందాలు తెలుసుకోడానికి మనం కవులం కానక్కర్లేదు అనిపించింది. ఇంతెందుకూ? నాక్కూడా అర్థమయిపోయింది అంటే నమ్మండి.

మంచి కథ రాయడానికీ అంతే. కథలో కూడా రచయిత యొక్క భావుకత కనిపిస్తుంది. అదెలా అంటే -

"గోపాలం అనకాపల్లి బస్టాండులో కాఫీ తాగి గోల్డెన్ గేటుబ్రిడ్జివేపు నడవడం మొదలుపెట్టేడు" అని రాసేననుకోండి. వెంటనే డజనుమంది పాఠకులు గార్ఠిగా కోప్పడేస్తారు నామీద, "ఏమిటారాతలు తెలిసీ తెలీకుండా. అనకాపల్లి ఆంధ్రాలో వుంది. గోల్డెన్‌గేటు బ్రిడ్జి అమెరికాలో వుంది. అసలు అమెరికా ఎక్కడుందో తెలుసా నీకు?...." అంటూ. అవునా?

మరి నాకు భావదారిద్ర్యం లేదు కదా. అంచేత నాకు ఐడియాలు వచ్చేస్తాయి. వెంటనే నేను రాసింది రైటే అంటాను. అది ఎలా అంటే -

నాకథలో రెండో వాక్యం "గోపాలం వులిక్కిపడి లేచేడు" అని రాసేస్తాను. అప్పుడు అది కల అని తెలిసిపోతుంది. కలలో మనం ఎక్కడినించి ఎక్కడికేనా పోవచ్చు కదా. నోఓఓ ... ప్రొబ్లెము.

మరి అతనికి కలలో గోల్డెనుగేటు బ్రిడ్జే ఎందుకు కనిపించింది? మళ్లీ మన కల్పనా... ఎటెసటరాయే మనని ఆదుకుంటుంది - గోపాలం కొన్నాళ్లు శాన్ ఫ్రాన్సిస్కోలో వున్నాడు. అతనికి ఆ బ్రిడ్జి అంటే ఎంతో ఇష్టం. అతని కన్నకలలకీ, తీరనికోరికలకి, ఆరని మంటలకీ చిహ్నంలా నిలిచింది ఆ బ్రిడ్జి అతనిమనోవీధిలో. దానిమీద అతనికి ప్రేమా, ద్వేషం. ఇంకా ఇదీ అని చెప్పలేని ఏదో కసీ ... (ఇదేం గోల, బుచ్చిబాబుకి అసమర్థ కాపీలా వుంది!) రాసుకుంటూ పోవచ్చు. అంత బలమైన అనుబంధం వుంటేనే అలా కలల్లోకి వచ్చేస్తాయి మరి.

లేదా, గోపాలం పుస్తకాలు తెగ చదువుతాడు పుస్తకప్పురుగు☺. అమెరికా అయితే వెళ్లలేదు కానీ ఎంత చదివేడంటే మీకు శాన్ ఫ్రాన్సిస్కోనించి షికాగోకి దారి కావాలంటే అతన్నడిగి తెలుసుకోవచ్చు.

మళ్లీ కథలోకి వద్దాం (హరికథ!). అనకాపల్లి వూరిపొలిమేరలో ఓ చిన్న వాగుంది. దాన్ని దాటడానికి ఆవూరి రైతులు ఓ చిన్నవంతెన వేసుకున్నారు. రోజూ బాలగోపాలురు ఆలమందల్ని పొలాలకి మళ్లించేవేళ ఆ వంతెనమీద బాలభానుని సువర్ణరేఖలు పరుచుకుని కన్నులపండగ చేస్తాయి. అదొక అద్భుతదృశ్యం..

గోపాలానికి తెల్లారగట్లే లేచి, బస్టాండులో కాఫీ తాగి, ఆ వాగుపక్కన నిలబడి ఆ వంతెనమీద దినకరుడు చిందించిన అందాలు ఆస్వాదించడం అలవాటు. ఆ వంతెనకి అతను గోల్డెనుగేటు బ్రిడ్జి అని పేరు పెట్టుకున్నాడు. అది అతనికి జీవితంలో ప్రసాదించే ఏకైక ఆనందం… ఇలా కూడా పెంచుకుంటూ పోవచ్చు.

ఇది బాగులేదూ? సరే మరో ఏంగిలు పడదాం. చెప్పేను కదా. కథ ఓ సున్నా. మనం ఎక్కడినించేనా బయల్దేరొచ్చు. చేర్చడం మాత్రం పొట్టలో చుక్కకే.

ఓరోజు గోపాలం వంతెనదగ్గర నిలబడి ఆనందాలు అనుభవిస్తున్నాడు తనివితీరా.

కొంతసేపటికి మరొకతను వచ్చి పక్కనే నిలబడ్డాడు.

గోపాలం భారంగా, సుదీర్ఘంగా నిట్టూర్చి, ‘‘ఈవంతెన ఎంతటి విషాదాన్ని నింపుకుని ఎంతటి రాజసం ఒలకబోస్తోందో చూడండి’’ అంటాడు.

పక్కనున్నాయన, ‘‘అవును. అది నాకు తెలిసినంతగా మరెవరికీ తెలీదు. ఆ వంతెనమీదే నేనూ సుసీ కలుసుకునేవాళ్లం. అక్కడే మేం బాసలు చేసుకున్నాం. ఆవంతెనమీదే నాకు సుసీ చెప్పింది మాపెళ్లి జరగదని. అదుగో ఆ మూడో స్థంభంపక్కనుండే వాగులోకి దూకి మా ప్రేమని అజరామరం చేసింది,’’ అంటాడు.

గోపాలం కోపానలంతో పేట్రేగిపోతూ, ‘‘హాట్, హూట్, అది నాకథ. నువ్వు చెప్పడానికి నీకు హక్కుల్లేవు, నిన్ను లోకం క్షమించదు,’’ అంటూ కోపంతో వూగిపోతూ, తూలి వాగులో పడతాడు. ఇది రాస్తుంటే నాకు నవ్వొస్తోంది. (లోకంలో ప్రేమికులు క్షమించాలి). పోనీ, ఇంకొంచెం పెంచుదాం. పక్కనున్నాయన (వాగులో కాదండీ, గోపాలం దూకకముందు అతనిపక్కన ఉన్నవాడు అని) కూడా ఎంతో హృదయబాధతో, ‘‘అయ్యో, నాకు తెలీనేలేదు, ఈవంతెన దురాగతాలు’’ అని, తాను కూడా వాగులోకి దూకి …

మరి ఇద్దర్నీ ఒడ్డుకి చేరుద్దామా? స్వర్గసుఖాలు అనుభవించమని పైకి పంపేద్దామా? - నాకేం తోచడం లేదు. మీఇష్టం. నీటముంచినా పాలముంచినా మీదే భారం.

ఇది కూడా ‘‘కథలెలా రాయాలి’’లో భాగంలాగే తయారయింది అనుకోకుండా. చెప్పొచ్చేమాట ఏమిటంటే ఇందులో మీకు తెలియని విషయాలేమీ లేవు. వేరు వేరు సంగతులని లాక్కొచ్చి ఓరాటకి కట్టేయడమే శిల్పం అంటే. ‘‘రామక్కా’’ అంటే ‘‘తామరాకా’’ అని అడిగితే తప్పు లేదు. ఆ రామక్కకీ తామరాకుకీ పరస్పరం ఏదో ఓ సంబంధం పెట్టేస్తే మీకథ తయారయిపోయింది అన్నమాటే!

అన్నట్టు మరోమాట. పైకథ అవకతవగ్గా వుంది. గోపాలం ప్రేమకత మొదట్లో చెప్పలేదుకదా అని అడక్కండి. ఇది కేవలం అవుట్లైనే. అసలు కథ రాసినప్పుడు అలా విడి విడిగా వున్న నూలుపోగుల్ని జతకూర్చి ముళ్లు పెట్టుకుంటూ రావడమే  కథ రాయడం అంటే మరీ.

(30 ఏప్రిల్ 2009)

# 35. బొమ్మ అంటే బాపూబొమ్మ అని అర్థంట!

మాటలకి అర్థాలే కాదు ఆకారాలూ వున్నాయి. ఆడవాళ్లమాటలకి అర్థాలే వేరని గిట్టనివాళ్లంటారు కానీ నిజానికి ఎవరు ఏ మాటాడినా మనసులో ఏదో రూపం పెట్టుకునే మాటాడతారు. శ్రీ వీరవేంకటసత్యసుబ్బావధానులుగారు అంటే మీ తల్లో ఓ రూపు తడుతుందా లేదా? నిజం చెప్పండి. అలాటిపేరు ఉచ్చరిస్తున్నప్పుడు గారు తగిలించకుండా వుండలేం. అలాగే సీతారాములంటే వెనక రవివర్మ బొమ్మలు గుర్తొచ్చేవి, ఇప్పుడు బాపూబొమ్మలు తలపుకొస్తున్నాయి. మాటకీ, మనసులో వొడగట్టే దృశ్యానికీ వున్న సంబంధం అదీ. అలాగే చిన్నప్పుడు గోపీగాడు, పెద్ద అవుతున్నకొద్దీ, గోపీ, గోపన్న, గోపిబాబు, గోపీబాబుగారూ, లేదా గోపయ్యగారు ... ఇలా రూపాంతరాలు చెందుతూ వస్తుంది ఆ పేరు.

నాకాలేజీరోజుల్లో అందమయిన అమ్మాయిలని బాపూబొమ్మ అనేవారు. ఆ తరవాత ఏడిపించడానికి బొమ్మ అనేవారు మధ్యలో రెండక్షరాలు కత్తిరించేసి, బుడుగు అంటే పొట్టి నిక్కరు తొడుక్కున్న చిన్ని అబ్బాయి కదూ. ఇది రచయితలకి వున్న సౌకర్యం. బారసాలనాడు అమ్మా, నాన్నలకి తెలీకపోవచ్చు పిల్లాడు ఎలా తయారవుతాడో కానీ రచయితలకి మాత్రం సాధ్యం పాత్రోచిత పేరులు పెట్టుకోడం. తప్పనిసరిగా పెడతారు కూడాను. ఎందుకంటే పేరునిబట్టి పాఠకుడిమనసులో ఆ పాత్ర రూపం ఆవిష్కారం కావాలని.

మా చిన్నప్పుడు లెక్కలక్లాసులో పెద్దదిమ్మ ఘనము, చిన్నదిమ్మ ఘనము అంటూ ఘనపరిమాణాలపాఠం చెప్తున్నప్పుడు కొంటెకుర్రాళ్లు ఆమాటలో "ది" చెరిపేసి, పెద్దమ్మ ఘనమూ, చిన్నమ్మ ఘనమూ అని రాస్తుండేవాళ్లు.

మా అమ్మ ఓ కథ చెప్పేది - ఓ సెట్టిగారు దుకాణంలో కూర్చుని, కాతాదారు వచ్చినప్పుడు, "పెద్దమ్మీ, తవ్వ తే" అనో, "చిన్నమ్మీ, తవ్వ తే" అనో కోడలికి పురమాయించేవాడుట. రెండు సందర్భాలలోనూ తవ్వ తెచ్చే అమ్మి ఒక్కరే. తెచ్చే తవ్వ మాత్రం పిలుపుతీరునిబట్టి చిన్నదో పెద్దదో తెలుసుకునేదిట ఆకోడలు. దీన్నే ఇంగ్లీషులో transferred epithet అంటారు. మనిషికి తగిలించిన విశేషణం కర్మకి బదిలీ అన్నమాట.

మూర్ఖుడా, అన్నప్పుడు ఒత్తు ఖ వల్ల అది పలికినవాడికెంత కోపం వచ్చిందో తెలిసిపోతుంది. ఓంకారనాదంలో అకార, ఉకార మకారాలసముదాయంవల్ల ప్రశాంతత మనసులో నెలకొంటుందని శాస్త్రజ్ఞులవిశ్వాసం. ప్రతి పలుకులోనూ అక్షరాలకున్న ప్రజ్ఞమీద భాషాశాస్త్రవేత్తలు చాలా చెప్పగలరు.

ఆమధ్య సుజాత (మనసులోమాట), http://manishi-manasulomaata.blogspot.com, ఆంటీమీద టపా రాసారు జ్ఞాపకం వుంది కదూ. ఈ ఆంటీలూ నొంటీలూ అమెరికనులు వాడరు. (అమెరికాలో మనవాళ్లమాట అడక్కండి). అమెరికనులవిషయంలో పొరుగువారిమాట వదిలెయ్యండి ఇంట్లో ఆంటీలని కూడా చాలావరకూ పేర్లు పెట్టే పిలుస్తారు. కాపోతే కదాచితుగా పేరుకి ముందు ఆంట్ విశేషణంగా పెట్టొచ్చు ఆంట్ మేరీలాగ. కానీ ఎదురయిన ప్రతివారినీ ఆంటీ, అంకుల్ అంటూ చుట్టరికాలు కలుపేసుకోరు. ఈ ఆచారం కేవలం మనగడ్డనే పుట్టింది. ఈ పిలుపులు ఎంత అస్తవ్యస్తంగా వుంటాయో తెలియాలంటే భానుమతి వావివరసలమీద రాసిన కథ చూడండి. ఈ బంధుత్వాల సరస పదవిన్యాసాలకి వయసుతో నిమిత్తం లేదని ఇట్టే తెలిసిపోతుంది.

పదేళ్లక్రితం నేను మాపెద్దన్నయ్యకుటుంబాన్ని చూడడానికి వెళ్లినప్పుడు, మా అన్నయ్య చెప్పేడు, నన్ను తన మనుమరాళ్లకి  ఎలా పరిచయం చెయ్యాలా అని చుట్టరికాలు తిరగేస్తూ చాలాకాలం ఖర్చు పెట్టేట్ట. మాఅన్నయ్య చాలా ఇంటలిజెంటు మరియు మెథాడికల్ లెండి. నాకయితే ఏదో సామెత చెప్పినట్టు "ఏమవుతాను. ఎత్తేస్తే ఏడు చెక్కలవుతాను" అనాలనిపించింది.

సరి, మాఅన్నయ్య పరిశోధనాఫలితాలు చూద్దాం. నేను ఆయనకి చెల్లెలిని కనక వాళ్ల అబ్బాయికి మేనత్తని. అత్త అంటే  వాడిభార్యకి అమ్మవరస. అంచేత వాళ్లపిల్లలకి అమ్మమ్మ వరస. మరి వాళ్లమ్మమ్మ వేరే వుంది కనక నేను పెద్దమ్మమ్మనో చిన్నమ్మమ్మనో అవాలి. మరి అప్పుడు మా జన్మరహస్యాలు కూడా ఆరా తియ్యాలి. "మాలతి అమ్మమ్మ", "మాలతి అమ్మ" ఇలా చాలా ఎక్స్పెరిమెంటులు చేసేట్ట. అవి మరీ పొడుగ్గా వున్నాయని "మామ్మ" అంటే పోలా అనుకున్నాడు. కానీ మామ్మ అంటే మరో అర్థం వస్తుంది కదా.  మా అమ్మ కావచ్చు, నాయనమ్మ కావచ్చు. అప్పట్లో నేను అక్కడ వున్న నాలుగు రోజులూ వాళ్లేం తేల్చుకున్నట్టు కనిపించలేదు. నాముందు నిలబడి నామొహంలోకి మొహం పెట్టి ఏం చెప్పదలుచుకున్నారో చెప్పేసి పారిపోయేవాళ్లు ఆపిల్లలిద్దరూ. వాళ్ల వయసులు మూడూ, అయిదూ.  ఈమధ్యనే మా పెద్దమనవరాలు 'మాలతి అమ్మ' అని మొదలు పెట్టి, ఆఖరికి ఒట్టి "అమ్మ"గా స్థిరం చేసేసింది ఈమెయిళ్లలో. వాళ్ల నిజ అమ్మనీ మమ్మీ అంటారు!

మొదట్లో చెప్పేను చూడండి పేర్లు పెట్టినప్పుడు మనసులో కొన్ని రూపులు పొడ కడతాయి అని. మాటవరసకి, రాధమ్మ అంటే ముళ్లపూడి వెంకటరమణగారి రాధమ్మ ఏపాఠకునికి మాత్రం మనసులో మెదలదు? అదే ఆయనకథలు చదవనివారికయితే, పోతనగారి రాధ గుర్తుకి రావచ్చు. రాధిక అంటే స్నేహమా అనని బ్లాగరు వుండునా ఈ కలిలో?

ఇంతకీ ఈ కచేరి ఈరోజు ఎందుకు పెట్టేనంటే, నన్ను బామ్మ అనో అమ్మమ్మ అనో పిలవాలని అప్పడప్పుడూ కొందరు అబ్బాయిలు పడుతున్నట్టు కనుపట్టుతోంది. అమ్మాయిలు నాకు తగలలేదు ఎంచేతో మరి. ఇంతకీ

ఆ అబ్బాయిలకి ఈ రాతలంటే అంత ఇష్టం అని నాకు తెలిసిపోయింది. సందేహంలేదు. అయినా ఆ సంబోధన సరి కాదనే అనిపిస్తోంది నాకు. ఎందుకంటే దృశ్యకలు. ఏ ప్రింటుపత్రిక అయినా తీసి చూడండి బొమ్మ అంటే ఎలాటి బొమ్మ కనిపిస్తుందో. "అమ్మ" అలాకాదు. చిన్నా, పెద్దా అన్న విచారం లేకుండా ఆడపుటక పుట్టిన ఏజీవినైనా అమ్మా అని పిలుచుకుంటాం మనం. చిన్నవాళ్లని ఆప్యాయంగా, పెద్దవాళ్లని గౌరవంతోనూ.

ఇంతకీ, అసలుమాట. ఈరోజుల్లో 70 దాటినవాళ్లు జమాజెట్టీల్లా తిరుగుతున్నారు. దేశాలు తిరిగి తమ ప్రయాణవిశేషాలు అందమయిన ఫొటోలతో అందించేవాళ్లూ, పత్రికాప్రపంచంలో, సినీలోకంలో తమపరిచయాలనీ, అనుభవాలనీ బ్లాగస్థం చేసేవాళ్లూ - ఇలా ఎంతమందో. సంఘసేవలో మునిగితేలుతున్నవారి సంఖ్య కూడా తక్కువేం లేదు. మీకంటే (మీకు అంటే యంగ్ మెన్ అండు విమెన్‌కి) ఇరవయ్యో ఇరపైయిదో మాత్రమే యౌవనంలా తోచవచ్చు కానీ ఆసక్తీ, ఉత్సాహం కొలవడానికి కేలండరువత్సరాలు లెక్క లేదని ఋజువు చేసేవాళ్ళు ప్రస్తుతం కోకొల్లలు.

నన్ను మీరు బామ్మ అనో అమ్మమ్మ అనో అభిమానంతోనే అనొచ్చు కానీ నాకు మాత్రం ఆ మాటలు తలుచుకుంటే "నామొహం" కనిపించడం లేదు. నారాతల్లోనో చేతల్లోనో మీకు "ఆరాతల్లోనే తెలుస్తోంది బామ్మగారని" అని మీకు అనిపించినప్పుడు చూద్దాం. ప్రస్తుతానికి మాత్రం నేను బాపూబొమ్మనీ కాను బామ్మనీ కాను.

సందర్భం వచ్చింది కనక మరో సందేహం - ఈబ్లాగుల్లో ఎక్కడా "తాతగారూ" అన్న సంబోధన కనిపించదేం? ఇది కూడా ఆంటీ-ఫెమినిజంలో మరో కోణమా ఏమిటి?

(9 మే 2009)

# 36. Parallax error

"నాకళ్లు పెట్టుకు చూడు" అన్నమాట విన్నారా ఎప్పుడన్నా? వినే వుంటారు.

అంటే నాకళ్లు పీకేసి మీరు తగిలించుకు చూడమని కాదు అర్థం. మరోమాట. "కళ్లు" అని బహువచనం వాడడానికి కారణం ఒక కన్నుతో చూస్తే కనిపించే బొమ్మ వేరు, రెండోకన్నుతో చూస్తే కనిపించే బొమ్మ వేరూ అని. దాన్నే పేరలాక్స్ ఎరర్ అంటారు. ఈపదానికి తెలుగు భౌతికశాస్త్ర పుస్తకాలలో దృష్టిదోషం అని గానీ వక్రదృష్టి అని గానీ వుంటే నన్ను తప్పు పట్టకండి. ఈమధ్య నేను చూసిన అనువాదాలు చూసింతరవాత అనిపించింది అంతే.

ఇంతకీ, మనదృష్టిలో పేరలాక్స్ ఎరర్‌ను తప్పించుకోవాలంటే, రెండు కళ్లూ పెట్టుకుని చూడాలి!

నాచిన్ననాటి సైన్సు పాఠాల్లో నాకు గుర్తుండిపోయిన బహుకొద్ది విషయాల్లో ఇదొకటి. ఎందుకంటే ఈ పేరలాక్స్ లక్షణాలు దాదాపు ప్రతిరోజు ఎక్కడో అక్కడ ఏదోరూపంలో నాకు ఎదురవుతూనే వున్నాయి.

అసలు మనందరికీ చిన్నప్పుడే మొదలవుతుందనుకుంటాను ఒంటికన్నుతో చూసే లక్షణం కాపీబుక్కు సూక్తులతో. ఉదాహరణకి చూడండి.

- పెద్దలు ఏదైనా అడిగితే పిన్నలు జవాబు చెప్పాలి. చెప్పకపోతే, భేతాళుడికథలోలాగ తల వెయ్యి చెక్కలు కాకపోవచ్చు కానీ తలవాచేలా చీవాట్లు పడడం తథ్యం. "నిన్నే అడిగేది. జవాబు చెప్పవేం? అంత పొగరేమిటి? … " అంటూ.

- తెలీకపోతే, కనీసం తెలీదనేనా చెప్పాలి కానీ ముంగిలా మూతి ముడుచుకుని, పళ్ళు గిట్టకరిచి, కళ్లప్పగించి చూస్తూ కూర్చోరాదు లేదా నిల్చోరాదు. (ఇది ఈమెయిళ్లలో మాత్రం సాధ్యం. కుక్కపిల్లలకీ, పిల్లిపిల్లలకీ కూడా సాధ్యం. ఈకారణంగానే జవాబులు పొందడం ఇష్టంలేనివాళ్లు కుక్కల్నీ, పిల్లుల్నీ పెంచుకుంటారు).

ఈసూక్తులు నిజజీవితంలో ఎలా ఆవిష్కృతమవుతాయో చూద్దాం సరదాకి.

1. ఒక పెద్దమనిషి ఒకరింటికి వస్తారు. గుమ్మంలో ఓ పదేళ్ల అబ్బాయి కనిపిస్తాడు.

"ఏం చదువుతున్నావు బాబూ?"

"ఏం చదవడం లేదండీ"

"అదేమిటి? స్కూలికి వెళ్లడంలేదూ?"

“స్కూలికి వెళ్తున్నానండి”

“మరి చదవడం లేదంటావేం?”

“మీరు ఏం చదువుతున్నావు అని అడిగితే చదవడంలేదని చెప్పేనండీ.”

ఇది అడిగినప్రశ్నకి సూటిగా జవాబు చెప్పడం. ఇందులో అధికప్రసంగం లేదు. అనవసరప్రసంగం అసలే లేదు.

2. మరో పెద్దమనిషి వస్తారు. మళ్లీ ఆ బుద్ధిమంతుడే ఎదురవుతాడు.

“మీ నాన్నగారు ఇంట్లో వున్నారా బాబూ?”

“లేనని చెప్పమన్నారండి.” ఇది కూడా పైజవాబులాగే వున్నదున్నట్టు చెప్పడం.

ఆ తరవాత -

1. ఆ పెద్దమనిషి నాలాటి చాదస్తపు పంతులయితే,

“అది కాదు బాబూ. నా ప్రశ్న ‘వున్నారా లేరా’ అని. ‘వున్నారు’ అనో ‘లేరు’ అనో జవాబు చెప్పాలి” అని పాఠం చెప్తారు.

“మరి మానాన్నగారు మీరు వస్తే ‘లేనని చెప్పు’ అన్నారండి,” అంటాడు ఆ అబ్బాయి అమాయకంగా.

2. ఆ పెద్దమనిషి నాలాటి తెలివితక్కువ పంతులయితే,

“అబద్ధాలు చెప్పకూడదు బాబూ. మీనాన్న ఇంట్లో వుంటే వున్నారనే చెప్పాలి. లేకపోతే లేరని చెప్పాలి” అంటూ పాఠం చెప్తారు.

“మరి పెద్దలమాట వినాలి అని కూడా చెప్తారు కదండీ” అంటాడు ఆ అబ్బాయి తికమక పడిపోతూ.

3. ఆ పెద్దమనిషి నాలాటి గడుగ్గాయి పంతులయితే,

“సరేలే. నేను కాదు, సుబ్బులుమామ వచ్చేరని చెప్పు” అంటారు.

కొంతకాలానికి ఈ పాఠాలమూలాన, ఓ శుభదినాన ఆ అబ్బాయికి తెలివొస్తుంది. “నాకు తెలీదండీ. నడవలో పేపరు చదువుకుంటున్న మానాన్నగారిని మీరే అడగండి వున్నారో లేరో” అనేసి, సైకిలెక్కి పారిపోతాడు.

ఇలా అనేకమంది వల్ల ప్రభావితుడవుతూ ఆ అబ్బాయి పెరిగి పెద్దవాడవుతాడు. ఆ తరవాత నేను తొలి చేసిన పూజాఫలముచేత నాతెలుగుక్లాసులో చేరతాడు.

అప్పటికి నాలుగువారాలు అయిందనుకుందాం. 'ఇష్టం' అన్న క్రియాపదం వాడినప్పుడు, కర్తకి 'కి' లేక 'కు' ధాతువు చేర్చాలి, తదనుగుణంగా కర్త స్వరూపం మారుతుంది అని తెలియజేయడం ఆరోజు పాఠం.

ప్రశ్న: నీకు ఎర్రరంగు చొక్కా ఇష్టమా?

జవాబు: నేను కాఫీ తాగాను.

ఈజవాబు "మొదటివారం పాఠంలోనిది. మనం ఇప్పుడు నాలుగోవారంలో వున్నాం. నిన్న చెప్పినపాఠం ఇది" - ఇవన్నీ నేను ఆ అబ్బాయికి చెప్పను. ఇలా "పాఠాలు" పెట్టేనంటే ఆ అబ్బాయికి కోపం వస్తుంది. నాఉద్యోగానికి ఎసరు. అంచేత భూదేవతఅంత శాంతచిత్తముతో నా ప్రశ్న అతను వినలేదన్నట్టు నటిస్తూ, "నీకు ఎర్రరంగు చొక్కా ఇష్టమా?" అని మళ్లీ అడుగుతాను.

ఆ అబ్బాయి మళ్లీ "నేను కాఫీ తాగాను" అంటాడు.

"నేను అడిగింది అది కాదు."

"నాకు తెలుసు. మీ ప్రశ్నకి జవాబు నాకు తెలీదు. అంచేత ఇలా 'కర్వ్' విసిరితే (బేస్‌బాల్ భాష), మీరు ఇటువేపు వస్తారని అలా చెప్పేను" అంటాడు ఏమాత్రం జంకు లేకుండా.

ఇది బిజినెస్ 101 క్లాసులో పాఠం. మనం ఓ దుకాణంలో చొక్కా కొనడానికి వెళ్లేం అనుకోండి.

"నేను ఫలానా స్టైలు చొక్కా కోసం వచ్చేను" అని మొదలుపెడతాం.

ఆ చొక్కా లేదు అనడు షాపువాడు. "ఇదుగో, ఈ డిజైనరు పేంటు చూడండి. లేటెస్టు స్టైలు.. ఇంకా ఎవరికీ చూపలేదు కూడాను. మీకే ఫస్టు ఇచ్చేస్తాను. ఎవరికీ చెప్పకండి. నన్ను చంపుకుతినేస్తారు ..." - ఇలా వేలంపాట మొదలవడం ఎప్పుడంటారు?

నాతెలుగుక్లాసులోనామొహం తెల్లగా వుండి వుంటే ఎర్రగా అయిపోవలసిన ఘట్టం అన్నమాట ఇది. అయినా నేను తమాయించుకుని, "అలా కాదు. నువ్వు అడిగినదానికి జవాబు చెప్తేనే నేను చెప్పినపాఠం నీకు అర్థం అయిందని నాకు అర్థం అవుతుంది" అంటాను.

"అంటే, నాకు తెలిసిందేమిటో తెలుసుకునే వుద్దేశం మీకు లేదని తెలుస్తోంది." అంటాడు అతను చిరాకు పడుతూ.

“నీకు ఈపాఠం చెప్పినా ఒకటే, గోడకేసి తల కొట్టుకున్నా ఒకటే”అని అనాలనిపిస్తుంది కానీ నేను అలా అంటే నాకు కోపం వచ్చింది అనుకుంటారు. నాకు ఎట్టిసమయాల్లోనూ కోపం రారాదు. ఇది unwritten law.

“నువ్వే రైటు” అంటాను హుందాగా.

అసలీమధ్య నా మెదడు చిన్నదయిపోతోందో, లేక దానికి కాలదోషం పట్టిందో అని అనుమానమేస్తోంది నాకు. నేను అడిగేదొకటీ, వారు చెప్పేదొకటీ అవుతోందా, లేక నేనే సమకాలీన సామాజికవిలువలనీ, విద్యావిధానాలనీ అర్థం చేసుకోలేకపోతున్నానా? అని.

నేనిలా అర్థంలేని వ్యర్థప్రశ్నలతో సతమతమవుతూంటే ఇప్పుడే నాకు మరో విషయం కూడా తెలిసింది.

క్లాసులో జరిగిన నాటకం విన్న ఆ అబ్బాయి నాన్న “మా అబ్బాయికి గొప్ప పండితుడు కాగల లక్షణాలు కనిపిస్తున్నాయి” అంటూ అడిగినవారికీ అడగనివారికీ చెప్తూ తెగ మురిసిపోతున్నాట్ట!

ఇంత రాసింతరవాత మరోటి తోస్తోంది. Parallax errorలో దృశ్యంలో లేనివి కనిపించవు. వున్నదృశ్యంలోనే కొంతభాగమే కనిపిస్తుంది. అంటే నేను పెట్టిన శీర్షిక చాలా అసందర్భంగా వుంది. ఏం చెప్పను నా అవస్థ. నేను incorrigible.  నాకు మోక్షం లేదు గాక లేదు. ☹.

(17 మే 2009)

# 36. వైరాగ్యంలోంచి క్రియాశీలతలోకి

గత మూడు టపాలు చూసి "ఈవిడకేమిటి మతిపోతున్నట్టుంది" అని మీరు అనుకుంటుండొచ్చు. అంచేత నాకష్టాలన్నీ మూట గట్టేసి, నాబతుకులో నార్మల్సీ ఏర్పరుచుకొనేడమే ఈ టపా ధ్యేయం. అంటే ఇది చదువుటచేత మీకు మనోవైకల్యం సంభవిస్తే దానికి మీరే బాధ్యులు!

నిజమే. ఈమధ్య నాకు చాలా నీరసం వచ్చేస్తోంది. మొదటి కారణం - వాతావరణం. ఎండలు ముదురుతున్నాయి. మాయింటికి తూర్పుపడమరలుగా పెద్ద patio డోరూ, కిటికీలూ వుండడంచేత ఎండ కుండలతో కుమ్మరించినట్టు గదుల్లోకి చొచ్చుకొచ్చేస్తుంది. అది చాలనట్టు ఎదురు పార్కింగ్‌లాట్‌లో మెటాలిక్ సిల్వరురంగులో ధగధగ మెరిసే కార్లమీంచి ప్రతిఫలించిన సూర్యకిరణాలు నాగదులని మరింత ధగద్ధగాయమానం చేసేస్తున్నాయి. దాంతో మాఇల్లు పెద్దింట పెళ్లిలో గాడిపొయ్యిలా మండిపోతోంది. ఆ తాపం భరించలేక, రెండు వరసలు తెరలు వేసుకున్నాను కిటికీలకీ, పేడియో అద్దాలకీ. దాంతో ఇల్లయితే చల్లబడింది గానీ, బయటి ప్రపంచం పూర్తిగా బందయిపోయింది. నాకు నేనే విధించుకున్న కఠిన కారాగారశిక్షలా, సజీవసమాధిలా వుంది నా ప్రాణానికి ఈ బతుకు.

రానున్నకాలంలో ఎప్పుడో కళ్లు పోయేక పళ్లు రాలిపోయేక జావ కాచుకు తాగడం ఎలాగా తప్పదు, ఇప్పుడే నాకు ఇష్టమయినవన్నీ చేసుకుతినేద్దాం అంటే అదీ లేదు. వారంరోజులుగా నోరు పూసింది. కాఫీలూ, కారాలూ ఎక్కువయితే పైత్యం చేసి అలా అవుతుందిట. నాకు పైత్యం రెండర్థాలలోనూ ముదిరిపోయినట్టే వుంది! నేను కారాలూ, కాఫీలూ పూర్తిగా మానేయలేదు కానీ తగ్గించేను. దాంతో తొమ్మిది దాటినా, నిద్రమత్తు వదలడంలేదు. ఏపని చేయడానికీ మనసు లేదు.

పోనీ, టెనిస్ చూద్దాం కాస్త చురుకు పుడుతుందేమోనని టీవీ పెడితే, మొదటి రౌండులూ మన పెళ్లిళ్లో వధూవరులచేత ఆడించే దండాడింపులు గుర్తొచ్చేయి. టుప్పూ టుప్పూమని బంతి అటూ ఇటూ కొడుతూ ఆడుతున్నారు, ఖర్మ! ఈ ఆటలతో నాకు జీవితంపట్ల మరింత వైముఖ్యం వచ్చేట్టుంది. ఏదో కొండనాలుకకి మందు వేస్తే వున్న నాలుక వూడిపోయిందనీ .. పోనీ, అలా అని టీవీ వదిలేసి, మరో పని చేసుకుందాం అంటే అదీ కుదరదు, ఏ గొప్ప షాటు మిస్సయిపోతున్నానో అని ఒహటే ఆరాటం!

ఇప్పుడే మరోసంగతి కూడా గ్రహించేను. ఇద్దరు ఆటగాళ్లూ ఒకేరకమయిన తలకట్టు (హెడ్ బాండూ, హెయిర్ స్టైలు)తో, ఒకేరంగు చొక్కాలు తొడుక్కుని ఆడుతుంటే, ఎవరు ఎవరో తెలీడంలేదు. అది చాలనట్టు నిన్న సఫిన్ ముందొకరంగూ వెనక ఒకరంగూ వున్న చొక్కా తొడుక్కుని ఆడుతుంటే ముగ్గురు ఆడుతున్నారేమో అనుకుని గాభరా పడిపోయేను కొంచెంసేపు. ఏమాటకామాటే చెప్పుకోవాలి. నిన్న ఆనా ఇవనోవిచ్ మాత్రం చూసితీరాలి, మొదటి గేము ఒక్కటే 72 నిమిషాలు ఆడారు. అదుగో, ఆలాటివే నన్ను టీవీ వదలకుండా చేస్తాయి. ఆడ్డానికి వాళ్లకంత హుషారున్నప్పుడు, కేవలం చూడ్డానికి నాకు ఆమాత్రం ఓపిక వుండక్కర్లేదా? అని నన్ను నేను చీవాట్లేసుకుని, అటు చూడలేకా, ఇటు వదల్లేకా, ఉత్సాహం కూడదీసుకోడానికి మరోమార్గం ఏదైనా వుందా అని వెతుక్కుంటున్నాను ప్రస్తుతం.

ఇలా ఇంకేం చెయ్యగలను అనుకుంటుంటే గుర్తొచ్చింది. శిశిరం వెనకబడి, గ్రీష్మం వేంచేసింది కనక నాక్లాజెట్లో బట్టలన్నీ తదనుగుణంగా తిరగెయ్యాలని. సరే ముందు క్లాజెట్లో శీతలదుస్తులు కింద పడేసి, వేసవిదుస్తులు పెట్టెల్లోంచి తీసి మరోపక్కన పడేసి చూస్తే, రిపేరు చెయ్యాల్సినవి - గత పదేళ్లలోనూ గుండీలూ, కుట్లూ వూడిపోయినవన్నీ కనిపించేయి. సరే ఇప్పుడు రిపేరు చేద్దాం అని కుట్టుమిషను ముందుగదిలోకి తీసుకొచ్చేను. రిపేరు చెయ్యవలసిన చొక్కాలతోపాటు, కత్తిరించి పొట్టి చేద్దాం అనుకుంటున్న పాంటులు కూడా వున్నాయి. పొడుగు చెయ్యాల్సినవి కూడా వున్నాయి. ఎలా పొడుగు చెయ్యొచ్చో నాకు థియొరిటికల్గా తెలుసు కూడాను. నిజంగా పొడుగు చెయ్యబోతే అవి మరెలా తయారవుతాయో తెలీదు.

అసలు నాకు కుట్లూ, వంటలూ అంటే అట్టే సరదా లేదు. ఎవరేనా మీరేనా మాలతీ చందూర్ అని అడిగితే, నేను కాదండీ అని చెప్పడానికి ఇది కూడా ఒక నిదర్శనంగా వాడుకుంటాను. ఆవిడలా వంటలూ, కుట్లూ నాకెలా వస్తాయండీ అంటూ. అమెరికా వచ్చేక వంటలు కాస్త పట్టుబడ్డాయి కానీ ఆవిడలా కొలతలూ, కేలరీలూ, ఆరోగ్యసూత్రాలూ చెప్పలేను ఇప్పటికీను. ఏదో ఇంత ఉప్పూ, పసుపూ, మిరపకాయలూ, చింతపండూ - అందుబాటులో వున్నవేవో గిన్నెలోకి విసిరేసి ఉడకేసి పడేస్తానంతే.

ఇంతకీ, అలా రిపేర్లు చెయ్యాల్సినవీ, కాలానుగుణంగానూ బట్టలన్నీ కుప్పలు కుప్పలుగా పోగు పెట్టేసేక, నాకు మరో ఆలోచన వచ్చింది. వీటిలో కొన్ని తీసిపారేస్తే నాపని తేలికవుతుంది కదా అని. ఇది కూడా నావైరాగ్యంలోనూ, స్ప్రింగు క్లీనింగులోనూ భాగమే. అప్పుడప్పుడు నేను చాలాకాలంగా వాడడమే లేదు అనిపించిన బట్టలూ, గిన్నెలూ, తప్పేలాలూ ఏరిపారేస్తూ వుంటాను. నేను తిరపతిలో వున్నప్పుడు ఒకాయన అంటూ వుండేవాడు కొండకెళ్లి గుండు కొట్టేసుకొస్తే ప్రాణం తేలిగ్గా వుంటుంది అని. సామాన్లు బయట పారేసినప్పుడు కూడా అదే ఎఫెక్టు అని నా అభిప్రాయం. రెంటిలోనూ ఆంతర్యం మమకారాలు వదిలేసుకోడమే కదా సింబాలిగ్గా గానీ, క్రియారూపంలో గానీ.

సరే టీవీ ఆన్ చేసి, కుట్టుమిషను తెచ్చి టీవీకెదురుగా కూర్చున్నాను. ఆదిలోనే హంసపాదు. సూదిలో దారం ఎక్కించడం గగనం అయింది. కళ్లు కనిపించక కాదు. మిషను నేలమీద వుండడంచేత. ''నేలమీద పెట్టి ఎలా కుడతారండీ?'' అనకండి. రిపేర్లే కదా. అంటే కుట్టేది తక్కువా, దానికి సిద్ధం చేసుకునేది ఎక్కువాను. ఏదో నాలుగు కుట్లు వేసేనంటే, కనీసం నాలుగుసార్లయినా తప్పు పడతాయి. అవి వూడదీయడానికి పదినిముషాలు పడుతుంది.. అలాగే బొత్తాయిలు కుట్టినప్పుడు కూడా మిషను కాళ్లదగ్గర ముద్దుకుక్కలా పెట్టుకుని, సోఫాలో కూర్చుని కుట్టుకుంటాం కదా. బొత్తాయిలు మిషనుమీద కుట్టొచ్చు అంటారు కానీ అలా మిషనుమీద కుట్టినవే వూడిపోతాయి అంత తేలిగ్గానూ. అంచేత నేను చేత్తోనే కుడతాను. మరి మిషనెందుకంటే వుందని చెప్పుకోడానికి మరియు అలంకారార్థం. ఆవిధంగా నేను నిజంగా మిషను ఆపరేటు చేసే కాలము చాలా తక్కువా, దానిచుట్టూ చేసే హడావుడి ఎక్కువా.

పైగా, టెనిస్ చూస్తున్నాను కూడా కదా. ఒకొకప్పుడు, కుట్టడంలో పడి ఆట మిస్సయినా, కామెంటేటరు, Wow, she got it, drop shot, … అంటూ కేకెయ్యగానే గబుక్కున తలెత్తి చూస్తాను. వారు రీప్లే చేస్తారు నా సౌకర్యార్థం. ఇలాటప్పుడే నాకు కామెంటేటర్లు పాపం మంచివాళ్లే అనిపిస్తుంది. మంచిసేవే చేస్తున్నారు అని వాళ్లకో మానసికంగా మెచ్చుకోలు సర్టిఫికేటు ఇచ్చేయడానికి కూడా సిద్ధం నేను.

ఇలా వున్నవీ లేనివీ అక్కర్లేనివీ - ఏదో ఒ పని కల్పించుకు చేస్తుంటే, కాస్త వుత్సాహం వస్తుంది. ఇందాకా వార్తల్లో చెప్పేరు - Happiness is being male, old and Republican అని. నేను మేల్ కాదు, రిపబ్లికన్ కాదు. ఓల్డ్ అన్నది పైకల్పికం అంటే never mind. అంచేత ఆరూలు నావిషయంలో వర్తించదు అనుకున్నాను. ఆశ్చర్యం. నా ప్రాణం తెరిపిన పడింది.

(25 May 2009)

# 37. లేమంటే ప్రేమా!!

లేమ కాదండీ, నే చెప్పేది "లేమి" మాట.

దరిద్రపుబతుకుల్లో గల ఔన్నత్యాన్ని వేనోళ్ల పొగిడేవాళ్లున్నారు. నాకెందుకో అది చాలా అసంబద్ధంగా కనిపిస్తుంది. ఇలా అసంబద్ధంగా కనిపించినప్పుడు ఓ కత రాసేస్తే నా ప్రాణం తెరిపిన పడుతుంది. అందుచేత ఇది రాసేడానికి కూర్చున్నాను.

నిజానికి నాక్కూడా ఆ కళలు వేపకాయంత వున్నాయి. అందుకే నాకథకి "హాలికులైననేమి" అని పేరు పెట్టేను. అలాగే నాకు అంతగానూ నచ్చిన, నామనసులో సుస్థిరంగా నిలిచిపోయిన మరో పద్యం -

ఫలరసాదులఁ గురియవే పాదపములు

కమనీయ భూమిభాగములు లేవె పడియుండుటకు

పొసగ బిచ్చము వెట్టరె పుణ్యమతులు

ధనమదాంధులకొలువేల తాపసులకు.

(ఈపద్యంలో కూడా ముందుపద్యంలోలాగే పొరపాట్లులుండొచ్చు. తెలిసినవారు చెప్తే దిద్దుకుంటాను)

పోతనగారిదృష్టిలో - చెట్లు పళ్లూ, కాయలూ ఇస్తాయి, సుందరమయిన భూమి వుంది పడివుండడానికి. ఉత్తమఇల్లాళ్లు బిచ్చం పెడతారు. బహుశా ఇక్కడ బిచ్చం అంటే బట్టలనుకోవాలేమో. ముందు చెట్లు భోజనం ఏర్పాట్లు చేస్తాయని చెప్పేశారు కనక. దశదానాల్లో వస్త్రదానం ఒకటి కదా. ఇంతకీ అసలు మాట డబ్బుతో కళ్లు మూసుకుపోయిన దుర్మార్గులకి సేవ చెయ్యనక్కర్లేదు దినము గడుపుకోడానికి అని.

చిన్నతనంలో అంటే - కంచంలోకి అన్నం ఎలా వస్తుంది, ఏం చేస్తే లోకంలో కీర్తిప్రతిష్ఠలు వస్తాయి అన్న కండూతిలేని రోజుల్లో - దారిద్ర్యం రొమాంటిగ్గా కనిపిస్తుంది.

ముందొక హెచ్చరిక. నేను ఇక్కడ రాయబోతున్న నాదౌర్భాగ్యపుఆలోచనలకి దండిపండితులు మండిపడకుండా ముందే మనవి చేసుకుంటాను. పోతనగారి పాండిత్యప్రకర్షని నేను ఏమాత్రమూ కించపరచడంలేదు. నిన్న చదివినపుస్తకమే గుర్తుండదు నాకు. అలాటిది అర్థశతాబ్దంక్రితం నేర్చిన ఈపద్యాలు గుర్తుండిపోయేయంటే ఆమహాకవి దిట్టతనమే కదా.

నాకు ఈమధ్య మంచిఆలోచనలు రావడంలేదు. నాలాటివారే మరికొందరు వుండకపోతారా అన్న భరోసాతో ఇక్కడ వాచ్యం చేస్తున్నానంతే. ఈనాటి ఆర్థిక, సామాజిక పరిస్థితుల్లో మరియు పెర్సనల్ డెవలప్మెంట్ పేట్రేగిపోతున్నకాలంలో మనఆలోచనలు ఎలా వుంటున్నాయో చెప్పడానికే ఈకత.

పోతనగారి కథ చాలామందికి తెలిసిందే. ఆయన సంతత భగవత్చింతనలో నేలబారు జీవితం గడిపిన మహానుభావుడు. ఆరోజులు అలాటివి కనక చెల్లింది ఆయనకీ, ఆయనవంటి సత్కవులకీను. అప్పట్లో కారు ఇన్సూరెన్సూ, హెల్తిన్సూరెన్సూ, ఇల్లిన్సూరెంసూ .. అంటూ రెక్కలు ముక్కలు చేసుకు ఆర్జించుకున్న నాలుగురాళ్లూ కొల్లగొట్టుకు పోయే భద్రతలబెడద లేనందు మరి.

మళ్లీ కొన్ని యుగాలతరవాత గాంధీమహాత్ముడికి కూడా చెల్లింది త్రీ-పీస్ సూటులొదిలేసి, కొల్లాయిగుడ్డ చుట్టుకు దొరల్తో మంతనాలకి సిద్ధమవడం. అదే నాబోటివారు అలా వెళ్లి వుంటే, "పో, పో, దొరల్తో గాదు ఆరిబట్లరుతో మాటాడ్డానికయినా తగ్గట్టు నేదు నీవాలకం" అంటూ తన్ని తగిలేసేవారు.

అంచేత, వూసుపోకకి కొన్ని ఆలోచనలు మీముందు పెడతాను. మీక్కూడా ఊసు పోకపోతే, చదువుకోండి.

నా మొదటి ప్రశ్న - అందరూ పోతనగారిలానే ఆలోచిస్తే మహాసామ్రాజ్యాలు ఏర్పడ్డానికి అవకాశం వుండేదా?

రెండు - సకలజనులూ దరిద్రులే అయితే బిచ్చము పెట్టగల పుణ్యమతులు మాత్రం ఎక్కడ్నుంచి వస్తారు?

అసలు ఎవరైనా దేనికోసం తాపత్రయపడతారు?

అఫ్కోర్స్, పోతనగారు తాపసులకు అని గిరి గీసేరు కనక ఇట్టి మహోన్నత జీవనమార్గం సకలజనులకోసం కాదని తెలిసిపోతోంది. నేను పైపద్యం చదివిన రోజుల్లోనే, కాలేజీలో హెన్రీ డేవిడ్ థోరోగారి వాల్డెను కూడా నాచేత చదివించబడడం జరిగింది. ఆ గ్రంథరాజంలో థోరోసార్ ఉత్కృష్టమయిన simple living and high thinkingని వేయివిధాల కొనియాడేరు. నిజానికి మనదేశంలో నూటికి తొంభైమందికి అలాటి simple living కోరీ వేడీ తెచ్చుకున్నది కాదు. చాలామందికి అది జన్మహక్కు. అయినా పొరుగువాడు చెబితే విన సొంపు. High thinking మాట అడక్కండి. ఈమధ్య కొందరు ఉద్దండపండితులవ్యాఖ్యానాలు చూస్తే, అసలు ఏ థింకింగూ వున్నట్టు లేదు. తలుచుకుంటే ఒళ్లు జలదరిస్తోంది. గొంగళిపురుగుల్ని చూసినట్టే!

అది సరే, మన ఆలోచనావిధానంలో అందీ పొందనట్టు ఎందుకుంటుందో చెప్తాను.

ఓ అయ్యకో ఓ అమ్మకో గల వజ్రవైఢూర్యాలతో, నవరత్నాలతో పొదిగిన ఆభరణాలూ, రంగరంగవైభవంగా పాలసముద్రంలో పట్టుపానుపులో పవ్వళింపులూ -వీటిలో ఓలలాడుతున్న దైవాన్ని ఆ వైభవంమీదికి మనమనసులు పోకుండా చెయ్యమని వేడుకుంటాం. అలా వేడుకుంటే మనకి పుణ్యం వస్తుందిట.

పుణ్యం వచ్చినతరవాత ఏమవుతుందంటే పుణ్యలోకాలకి వెళ్తాం. పుణ్యలోకాల్లో ఏం వుంటుందంటే రంభా వూర్వశీ నృత్యప్రదర్శనలూ, మృష్టాన్నభోజనాలూ, అష్టైశ్వర్యాలూ ... మరయితే నాకు అనుమానం, ఎప్పుడో వస్తాయని వీటికోసం ఇప్పుడెందుకు ఈ శరీరాల్ని ఎండగట్టడం? ఇప్పుడే ఇక్కడే అనుభవించేస్తే పోలా ఆ అష్టైశ్వర్యాలూ ... అదేలెండి అనుభవించడానికి వున్నవాళ్లమాటే చెపుతున్నది.

సంగతి ఇలా వుండగా మరి ఇవ్విధమ్ముగ లేమికి మంగళారతులు పట్టేవారు ఎవరయివుంటారా అన్న సమస్య ఉత్పన్నమవడం సహజం.

మరోలా చెప్పాలంటే ఏదో ఒక అభిప్రాయాన్ని, ఒక జ్ఞానశకలాన్ని, నభోమండలానికెత్తేయడమో, పాతాళానికి తొక్కేయడమో ఎవరు చేస్తారు అన్నది మొదటి ప్రశ్న. ఎందుకు చేస్తారన్నది రెండో ప్రశ్న.

ఎవరు అంటే లేమి లేనివారు. అసలు లేమిలో బతుకుతూ లేమిని మెచ్చుకున్నవారు ఒక పోతనగారూ ఒక గాంధీగారూనేమో. గాంధీగారు లేమిలో పుట్టలేదు కానీ లేమిని వరించి తరించేరు. కానీ నిత్యజీవితంలో కోటానుకోట్ల ప్రజలకి అది నప్పదు. ఏ బ్రిడ్జికిందో ఏ అట్టపెట్టెలోనో వొణికిపోతూ ముడుచుకుపడుకున్న హోంలెస్ మానవులని అడిగి చూడండి లేమిలో సౌఖ్యాలేమిటో...

ఈమధ్య అమెరికా ఆర్థిక ప్రతిపత్తి మన్ను కరిచేక, మా విస్కాన్సిన్‌లో ఒక కొత్త నుడికట్టు వింటున్నాను homeless children అని. ఇంతవరకూ హోంలెస్ జనాలు ఏకాకులు మాత్రమే. ఇప్పుడు కుటుంబాలకి కుటుంబాలే దిక్కు లేకుండా పోతున్నాయి. ఆ పిల్లలు మామూలుగా వెళ్లే స్కూలికే వెళ్తే, స్థితిగతులు మారగానే సాటిపిల్లలు వాళ్లని హేళన చేస్తున్నారని వార్త.

ఎలక్షనులయేవరకూ వార్తలు హాస్యరసస్ఫోరకంగా వుండి ఆనందాన్నిచ్చేవి నాకు. కానీ ఈమధ్య చాలా చిరాగ్గా వుంటున్నాయి. ఎంతెంత పెద్దవారు ఎన్ని మిలియనులూ, బిలియనులూ కుమార్గాల మూటగట్టుకున్నారో చెప్తుంటే, వాళ్లని రక్షించడానికి ప్రభుత్వం ఎంత కృషి చేస్తోందో వింటుంటే, నాకు మతి పోతోంది. నేను మహా అయితే వెయ్యి డాలర్లు అంటే సుమారుగా వూహించుకోగలను. ఆపైన సంఖ్యలు నాకు చాలా గందరగోళంగా వుంటాయి. ముప్పై మిలియనులు కుప్ప పోసి చూస్తే ఎలా వుంటుందో విజ్యువలైజు చేయబోతే నాకు చుక్కలు కనిపిస్తున్నాయే కానీ డబ్బులు కనిపించడంలేదు.

అంచేత లేమికి ఎవరు పట్టం కడతారంటే లేమి అంటే తెలీనివారనే నిర్ణయానికి వచ్చేశాను. తమకి అనుభవంలో లేనిదాన్ని అందంగా వూహించుకునే భాగ్యం కలగడానికి కూడా పెట్టిపుట్టాలి.

ఒకసారి నేను ఆరుద్రగారింటికి వెళ్లినప్పుడు ఆయన మాటాడుతూ వరద రాజేశ్వరరావుగారి కవిత్వంగురించి శ్రీశ్రీ చేసిన వ్యాఖ్యానం ఒకటి చెప్పేరు. శ్రీశ్రీ అన్నారుట "కొత్తకారులో బీచిరోడ్డుమీద ప్రయాణం చేస్తున్నంత

హాయిగా వుంటుంద''ని. ఆరుద్రగారు ''నాకు కొత్తకారు లేదు. బీచిరోడ్డుమీద కారులో షికారు ఎలా వుంటుందో తెలీదు'' అన్నారు. ఆయన ఏం మాటాడినా నెమ్మదిగా గంభీరంగా చెప్తారు. ఇంతకీ వారి వ్యాఖ్య మనం ఇచ్చే సామ్యాలు మనఅనుభవాల పరిధిలో వుంటాయని. వినేవారికి కూడా ఆఅనుభవం వుంటేనే అది అర్థం అవుతుంది. అప్పటికింకా ఇప్పుడు వున్నన్ని కార్లే కాదు స్కూటర్లు కూడా లేవు. శ్రీశ్రీ వ్యాఖ్య సామాన్యులస్థాయిలో లేదని ఆరుద్రగారి వ్యాఖ్య.

నిజానికి లేమి అంటే డబ్బే కానక్కర్లేదు. ఏకొరత అయినా కొరతే. కిందపడ్డవాడికి చెయ్యందించి, లేపి నిలబెట్టడానికి ప్రయత్నించడం మానవనైజం. స్పోర్ట్స్ కామెంటేటర్లు చూడండి. ఆపకుండా అదేపనిగా ఓడిపోతున్నవాడు గెలవడానికి మార్గాలు సూచిస్తూ వుంటారు. వారినోటిమాట చల్లగా అదే నిజమయి, ఓడిపోతున్నవాడు గెలిచే సూచనలు కనిపించగానే, రెండోవాడు ఏంచెయ్యాలో చెప్పడం మొదలుపెడతారు వాళ్లే మళ్లీ!

అసలు ఎంచేతో కానీ కష్టాల్లోనే ఒక ఆకర్షణ వుంది. ''నేనెంత కష్టపడుతున్నానో చూడండి'' అంటూ చెప్పి ఒప్పించడం చాలా సుళువు. బోలెడు సానుభూతీ, సలహాలు వరదలా వచ్చేసి ఉక్కిరిబిక్కిరి చేసేస్తాయి మిమ్మల్ని. మనకో సామెతుంది లేనివాడు గంజిలోకి ఉప్పు లేదని ఏడిస్తే, ఉన్నవాడు పాలల్లోకి పంచదార లేదని ఏడ్చేడని. అంటే ఇద్దరివిషయంలో సిద్ధాంతరీత్యా నొప్పి సమానస్థాయిలో వుంటుందని.

సమానస్థాయి అంటే జ్ఞాపకం వస్తోంది నాకు తోచిన మరో ఉపమ. పన్నీట స్నానం చేసేవాడికి ఆ పన్నీటిస్నానం ఎంత ఆహ్లాదకరమో పందికి బురదలో పొర్లటం కూడా అంతే ఆహ్లాదకరం. అంటే అనుభవం ఒకటే. ఏది కాంక్షనీయం అంటే ''ఎవరికి?'' అన్నదాన్నిబట్టి అని చెప్పుకోవాలి.

యాతావాతా నేనిక్కడ నిరూపించింది ఏమిటంటే లేమి అంటే ప్రేమలేదని ఎట్టిసమయంలోనూ అనరాదు. అలాటి వ్యర్థవ్యాఖ్యతో మనం ఎవరినీ మెప్పించలేం. మెప్పించడానికి మంచిమార్గం దాన్నిగురించి రాయడమే. ఎలాగంటే, ఇదుగో, ఇలాగే. ...

(6 జూన్ 2009)

# 39. సంతకంటె సంతోసమయ్య మాకు!

బజారంటే నాకు ఒక జానపదగేయం గుర్తొస్తుంది. గేయం అంతా గుర్తు లేదు కానీ అందులో పదాలివి -

ఓ పల్లెపడుచుని ఓ చిన్నవాడు అడుగుతాడు,

ధాన్యమయిన దంచగలవ పిల్ల నీవు అని.

ధాన్యమంటె దగ్గొస్తదయ్య మాకు

అంటూ చెప్పి, ఆపడుచుపిల్ల ఇంకా ఇలాగే తనకి చిరాకు కలిగించే మరో రెండు కూడా చెప్పేక, మరి

సంతకయిన ఎల్లగలవ పిల్ల నీవు - అని అడుగుతాడు.

సంతకంటె సంతోసమయ్య మాకు - అంటుందిట ఆ చిన్నది.

సంతకెళ్లడమంటే అదొక సోషల్ ఇవెంటు మరి.

పగలల్లా రెక్కలు ముక్కలు చేసుకుని, పండించిన కూరా, కాయా, అల్లిన తట్టా, బుట్టా, సకల సామగ్రి నెత్తికీ, కావిళ్లకీ ఎత్తుకుని పదిమందీ ఓచోట చేరి, మంచీ సెబ్బరా మాటాడుకుంటూ తమ వస్తువులు అమ్ముకునీ, కొనుక్కునీ, పొద్దు వాలేక ఇళ్లు చేరడం ఒక ఆహ్లాదకరమైన సామాజిక కార్యక్రమం వారికి.

ఇప్పుడు దీన్నే షాపింగు అంటున్నారు అచ్చతెలుగులో మన తెలుగుబాలురూ, బ్లాగరులూ.

ఈషాపింగుకి టైము మనచేతుల్లో లేదు. లేదు అంటే మనం అనుకున్నప్పుడు సాగేది కాదు. షాపరులు అంటే షాపులు పెట్టుకునేవాళ్లు ఎప్పుడు తెరుస్తే అపుడే మనం వెళ్లాలి. వెళ్తాం. ఏదో పండుగరోజు తెల్లవారురుఝామున నాలుగుగంటలకి షాపు తెరువబడును అంటే రాత్రి రెండుగంటలకే షాపువాకిట పడిగాపులు కాచేవారున్నారంటే నమ్మండి. రెండోది షాపువారు ఏది అమ్ముతే అదే కొనుక్కుంటాం. మనకి ఏది మంచిదో కూడా వాళ్లే చెప్తారు.

ఆమధ్య ఒక ప్రకటన చూసేను "మీగది వైశాల్యం మీరు చెప్పండి. మీకు ఏ టీవీ సరిపోతుందో నేను చెప్తాను" అంటాడు ఆ ప్రకటనుడు. అది నాకు అర్థంకాదు. నాగది ఎనిమిదీ బై పదే అనుకుందాం. నాకు ముప్ఫైరెండంగుళాల టీవీ కావాలనుకుంటే నేను అదే కొనుక్కుంటాను కానీ "మీగదికి పదమూడంగుళాలటీవీ

చాల"ని చెప్పడానికి అతడెవరు? అలా చెప్పడానికి అతడికి అధికారం వుందనుకుంటే, మరి నా స్వేచ్ఛ మాటేమిటి?

అలాగే మనం తొడుక్కునేబట్టలూను. వాళ్లే చెప్తారు మనకి ఏవి నప్పుతాయో, ఏ చొక్కా తొడుక్కుంటే మన కనుపాపరంగు మరింతగా వెల్లివిరుస్తుందో ... అందుకే థోరో మహాశయుడు మనం tailor-made men అన్నాడు. ఈ రంగు మరియు స్టైలు సెన్సు నాకు పుట్టుకతోనే లోపించింది. నాచిన్నతనంలో పండుగో పుట్టినరోజులాటి వేడుకలో అయితేనే కొత్తబట్టలు. మాఅమ్మో అక్కయ్యో బజారుకెళ్లి ఏగుడ్డ వాళ్లకి నచ్చితే అది కొనేసి, పరికిణీ జాకట్టు కుట్టించుకొస్తే, అదే నా టేస్టుగా చెలామణీ అయిపోయింది.

అసలు మామూలుగా నేను బజారుకెళ్లడమే తక్కువ. ఎందుకోగానీ నాకక్కడ ఊపిరాడదు. అంచేత ఏషాపుకేనా వెళ్తే మొదట గుమ్మంలోనే నిలబడి చుట్టూ కలియచూస్తాను సుమారుగా నాకు నచ్చే దుస్తులుగల ర్యాక్కోసం. ఆ ర్యాకు "నాదగ్గరికెవరేనా వస్తారా?" అని దిగులుగా దిక్కులు చూస్తూ కాస్త ఎడంగా ఓమూల కనిపిస్తుంది. తీరా దగ్గరికెళ్లి చూస్తే నాకు రెండు విషయాలు ఠక్కున తెలిసిపోతాయి.

ఒకటి - ఆబట్టలు నాకు రెండు సైజులు పెద్దవి. రెండు - అవి ఇండియాలో తయారయినవి. ఇండియాలో మహా అయితే నూటయాభై రూపాలయలకి దొరికే బ్లౌజుకి అమెరికాలో ఇరవైమూడు డాలరులు ధారపోయడానికి నాకు మనసొప్పదు. ఒకకారణం దానిమీద వచ్చేలాభంలో వెంట్రుకవాసి మాత్రమే ఇండియాలో పనివాళ్లకి అందుతుందన్న కటికనిజం. కొంతకాలంక్రితం 60 మినిట్స్ షోలో చూపించేరు. కేరళలో జీనులు కుట్టే అమ్మాయిని - చిన్నపిల్లే 14 ఏళ్లుంటాయి - అమెరికా తీసుకొచ్చి చూపించేరు ఆపిల్ల కుట్టే జీనులు అమెరికాలో ఎంతకి అమ్ముతున్నారో. ఆఅమ్మాయి ఆశ్చర్యంతో అవాక్కయిపోయింది. ... ఇంతకీ, నేనూ ఒప్పుకుంటాను, ఆ బ్లౌజుకోసం నేను 1000 డాలర్లు టికెట్టుమీద తగలేసి ఇండియా వెళ్తే, 997 డాలర్లు నష్టమే నాకు అని. అయితే మాత్రం ☹.

అదేపనిగా బజార్లంట తిరగడం ఒక కాలక్షేపం మాత్రమే కాదు. ఒకొకప్పుడు "అనదర్ పే నాస్తి" అని కూడా అనిపిస్తుంది. ఎందుకంటే, మామూలుగా ఒకవస్తువుధర 300 రెట్లు ధర కడతారు సరికొత్త డిజైను అన్నపేరుతో. ఆతరవాత పది శాతం తగ్గింపు అంటూ మొదలెట్టి వేలంపాటలా ఇరవై, ముప్పై, ఆఖరికి డెబ్బైఅయిదు శాతం కోత ప్రకటిస్తారు. అంచేత, మనంవిప్పుడు ఈ సేలులకోసం, డీలులకోసం, స్టీలులకోసం పదే పదే షాపులసందర్శనం చేసుకోవాలి, వారం వారం కొండకెళ్లినట్టే.

షాపువాడికీ, స్వామివారికీ ఎప్పుడు కటాక్షం కలుగునో మనకి అగమ్యగోచరం!

ఈ సంతచూపులకి మరోకోణం - పూర్వం గుళ్లో కనిపించేవాళ్లు మనవాళ్లు. ఇప్పుడు కనిపిస్తున్నారు మాలులలో. బజారుకంటూ బయల్దేరినతరవాత ఏరోజు ఎవరిదర్శనం అవుతుందో అన్నది బ్రహ్మదేవుడు కూడా చెప్పలేడు. అంతేకాదు. అలా ఎదురయినవాళ్లందరూ మనని చూడ్డానికే అక్కడికొచ్చేరన్న భ్రమలు కూడా వద్దు.

నామటుకు నాకు ఒక చిలిపి సరదా ఏమిటంటే అల్లంతదూరంలో నన్ను చూసి చూడనట్టు నటిస్తూ ఏబట్టలర్యాకువెనక్కో తప్పుకునేవాళ్లని గమనించడం. ఒకొకప్పుడు వాళ్లు ఎటు వెళ్తున్నారో చూసి, అటే వెళ్లి వాళ్లు నన్ను చూశారా, లేదా? లేక, నన్ను తప్పించుకోడానికి చూస్తున్నారా, మరియు లేక నేనే నా కుత్సితబుద్ధితో వాళ్లని అపార్థం చేసుకుంటున్నానా? అనుకుంటూ తీవ్రమయిన ఆలోచనలతో సతమతమవుతాను.

మా పాపతో షాపింగు నాకు చాలా సరదాగా వుంటుంది. మొదట్లో, అంటే దానికి నాలుగూ, అయిదూ ఏళ్లప్పుడు పిల్ల నావెంట నడిచేది. తరవాత తొమ్మిదీ, పది వచ్చేసరికి నాపక్కన నడిచింది. పదకొండు దాటినతరవాత, నేను తనవెంట నడుస్తున్నాను.

ఇహ షాపులోకి వెళ్లింతరవాత ఫార్సు - బట్టలర్యాకులు చిన్న చిన్న ద్వీపాల్లా పరుచుకు వుంటాయి షాపంతా. మాఅమ్మాయిని గురించి ఓమాట చెప్పాలి. మీనరాసిలో పుట్టింది. అంటే తెలుసుకదా. చేపపిల్లలాగే క్షణమయినా నిలకడ లేదు. ఎంత జాగ్రత్తగా చూస్తున్నా అటూ ఇటూ పారిపోయేది చిన్నప్పుడు. అందుకని, నేనే చెప్పేను, నువ్వు అలా తప్పిపోయినప్పుడు, పక్కనే వున్న కౌంటరుదగ్గరకి వెళ్లి "నేను తప్పిపోయాను అని చెప్పు" అని చెప్పేను.

అక్కడినించి, నన్ను ఏమార్చి, తప్పిపోయి. ఏకౌంటరుదగ్గరికో వెళ్లి, "మా అమ్మ తప్పిపోయింది" అంటూ ఫిర్యాదు చేసేది. వాళ్లేమో ఇంటర్కమ్మీద "మలాతీ ... మీరు, ఫలానా కౌంటరుదగ్గరికి వెంటనే రావలసింది" అని చాటింపు వేసేవాళ్లు.

"నేను కాదు తప్పిపోయిందీ, తనే తప్పించుకపోయిందీ" అని వాళ్లకి చెప్పుకోవాల్సొచ్చేది నేను. అవును మరి, నేను పిల్లని చూసుకోలేదంటారు కానీ "ఇంత ముద్దొస్తున్నమొహం" ఆ పబ్లిక్ ఎనౌన్సుమెంటుకోసం అలా చేసిందంటే ఎవరు నమ్ముతారు?

ఆతరవాత, నేను "తప్పిపోయేనని ఎందుకు చెప్పేవు?" అని అడిగితే, "నువ్వే చెప్పేవు కదా నేను తప్పిపోయేనని చెప్పు అని" అనేది. ఇంకా, "నేను (అంటే తను) తప్పిపోయేనని ఎలా చెప్తాను. నేను

ఎక్కడున్నానో నాకు తెలుసు కదా'' అని కూడా దబాయించేది. ఆనాడే గ్రహించేను ఈకాలప్పిల్లలతో వాదించి గెలవలేం అని.

ఇంతకీ ఈనాడు మాషాపింగువేడుకలు - ఇద్దరం పది షాపులు తిరిగితే, నాలుగుషాపుల్లో తనకి నచ్చిన డ్రెస్సులు కనిపిస్తాయి. ఒకొకషాపులో రెండో మూడో చొప్పున. అవి తీసుకుని, ఫిట్టింగురూంలో ప్రవేశించి ఒకొకటే ధరించి బయటికి వచ్చి నాకు చూపిస్తుంటే అది నాకు ఒక ప్రైవేటు ఫాషన్ షో.

''ఎలా వుంది'' అని అడిగిన ప్రతిసారీ నేను చూడవలసింది డ్రెస్సు కాదు, మాపిల్లమోము.

సుమారుగా ఆమొహమూ, నాజవాబూ ఈక్రింద పట్టికలో ఇస్తున్నాను.

| | |
|---|---|
| చికిలించినకళ్లు - | ఫరవాలేదు. |
| మొహం ముడుచుకుంటే - | మరోటి చూద్దాంలే. |
| పూర్ణబింబమువోలె ప్రకాశించినప్పుడు - | తీసేసుకో. |
| గొంగళిపురుగుని చూసినమొహం - | ప్చ్, బాలే. |

ఇలా ఓ చుట్టు ఎంపికలఘట్టం ముగిసేక, వున్నవాటిలో నచ్చింది అనుకున్నది తీసికెళ్లి ''హోల్డ్''లో పెడుతుంది.

అలా రెండో మూడో హోల్డులు అయేక, ఏదీ తీసుకోకుండా ఇంటికొచ్చేస్తాం.

మరో పదినిముషాలయేక, ''ఇప్పుడే వస్తాను'' అంటూ తనొక్కర్తే వెళ్లి, ఆ ఆపి పెట్టినవాటిలో ఒకటి తీసుకొచ్చేస్తుంది.

అప్పుడే అయిపోయిందనుకోకండి మా కొనుగోలు సీను.

మర్నాడు మావూళ్లో లేకపోతే మూడురోజులతరవాత వాళ్లవూళ్లో అది మార్చేస్తుంది. అవును. సాధారణంగా తాను కొనేవస్తువులు తనవూళ్లో కూడా వుండేషాపు అయివుండేలా చూసుకోడం కూడా షాపింగులో భాగమే!

తను ఫిట్టింగురూంలో మార్చుకుంటున్నప్పుడు ఒకొకప్పుడు, నేను దిక్కులు చూస్తూ నిలబడితే, సేల్స్ బాలికలు వచ్చి ''మీకు నేను సాయము చేయగలనా,'' అని అడుగుతారు. ఆమధ్య ఒకసారి ఎవరో ''స్పానిష్ మాటాడేఅమ్మాయిని పిలవనా?'' అని కూడా అడిగింది.

"వద్దు. అది మరీ కష్టం. ఆ స్పానిష్‌నించి మళ్ళీ ఇంగ్లీషులోకో తెలుగులోకో అనువాదం చేసేవాళ్లు కావలసివస్తుంది" అని చెప్పలేక, ఓ వెర్రినవ్వు నవ్వి, "లేదు, నేను మాఅమ్మాయికోసం చూస్తున్నాను," అన్నాను.

సంతకెళ్ళడంలో ఇంత హాస్యం వున్నప్పుడు, మరి సంతంటే ఎవరికి సంతసం కాదు, చెప్పండి!

(30 జూన్ 2009.)